శ్రీ

# భగవద్గీతానువాదము

రచయిత:

ఆంధ్రబాలసరస్వతి, అష్టావధాని,

కాళహస్తి వేంకటనరసింహారావు,

ఈమని, గుంటూరుజిల్లా.



కృతిభర్త :

## మ. రా. రా. శ్రీ. జవ్వాది లక్ష్మయ్యానాయఁడుగారు

ప్రెసిడెంటు : పంచాయతీబోర్డు, (పెనుగొండ)

ప్రెసిడెంటు : ల్యాండ్ మార్గేజి బ్యాంకు, లిమిటెడ్, (పెనుగొండ)

ప్రెసిడెంటు : సెకండరీ యెడ్యుకేషనల్ బోర్డు, (పశ్చిమ గోదావరి)



మెంబరు : జిల్లాబోర్డు, (పశ్చిమ గోదావరి)

# ప్రేమాంకము

వ్యాసాబ్ధి కురుక్షేత్రమునను, గృష్ణా
నాస్య ధారసధారాప్రవర్ధితమగు
వ్యాసమునిసంస్కృతోద్యానవనము నుండి
యమలములు, దివ్యపరిమళోదంచితములు,
సుందరమ్ములు, శాశ్వతానందదములు,
అక్షరమ్ములు, జ్ఞానరసాత్మకములు,
విబుధభోగ్యమ్ము లధ్యాత్మవిశ్రుతమ్ము
లైన, గీతాప్రసూనమ్ము లధికభక్తిఁ
గలుఁగునుడికారపుంగన్నె దెచ్చి,
దండఁగూర్చి నీకు సమర్పింపఁ; గొనుమ !
లక్ష్మణార్య! సంతృప్తినొసఁగు నిరంతరంబు.

కవిరత్న,
శాళహస్తి వేంకటనరసింహారావు,
అష్టావధాని.



కృతిభర్త :

మ. రా. రా. శ్రీ. జవ్వాది లక్ష్మయ్యనాయుండుగారు

ప్రెసిడెంటు : పంచాయతీబోర్డు, (పెనుగొండ)

ప్రెసిడెంటు : ల్యాండ్ మార్ట్గేజి బ్యాంకు, లిమిటెడ్, (పెనుగొండ)

ప్రెసిడెంటు : సెకండరీ ఎడ్యుకేషనల్ బోర్డు, (పశ్చిమ గోదావరి)



మెంబరు : జిల్లాబోర్డు, (పశ్చిమ గోదావరి)

# ప్రేమాంకము

పుణ్యభూమి కురుక్షేత్రమునను, గృష్ణ
వాక్సుధారసధారాప్రవర్ధితమగు
వ్యాసమునిసంస్కృతోద్యానవనమునుండి
యమలములు, దివ్యపరిమళోదంచితములు,
సుందరమ్ములు, శాశ్వతానందదములు,
అక్షరమ్ములు, జ్ఞానరసాత్మకములు,
విబుధభోగ్యమ్ము లధ్యాత్మవిశ్రుతమ్ము
లైన, గీతాప్రసూనమ్ము లధికభక్తిఁ
దెలుఁగునుడికారపుంగన్నె దెచ్చి,
దండఁగూర్చి నీకు సమర్పింపఁ; గొనుమ!
లక్ష్మయార్య! సంతృప్తినొసఁగు నిరంతరంబు.

కవిరత్న,

కాళహస్తి వేంకటనరసింహారావు,

అష్టావధాని.

ఓమ్.

# స్వవిషయము.

మహాశయులారా!

ఇంతకుఁబూర్వమే యెన్ని కవికోకిలము లాంధ్రవాఙ్మయోద్యానవనమున గీతాగాన మొనరించినవి. వారిశక్తి ముందు నాశక్తి స్వల్పాతిస్వల్పము. అయినను నే నీ కార్యమునకుఁ బూనుకొనుట కొక ప్రధానకారణము గలదు. అదేదియన? మొదటినుండియు శ్రీకృష్ణుఁడనిన నాకు కడుంగడు భక్తి. ఆతని సిద్ధాంతము లవశ్యాచరణీయములనియు, నాతనికతఁడే సాటియనియు, నా విశ్వాసము.

ఆంగీరస నామ సం॥ వైశాఖ శు ౧౧ లు సోమవారము (1932 అగష్టు 16 వ తేది) నమ్ము కని, పెంచి, విద్యాబుద్ధులఁ గరపి యింతవారినిగా నొనరించిన మాజనకులు దివంగతులైరి.

శిల్ప విద్యాప్రవీణుండు • శిష్టగుణుఁడు
కాశహస్త్యన్వయాబ్ధి రా • కా విధుండు
సాంఘికార్థిక నైతిక • సర్వవిషయ
పారగుండు, అక్కటా! వీడె • భౌతికమ్ము
నమలకీర్తి తిరుపతి రా • యాహ్వయుండు.

"పితాహతస్త్రిభువనమంధకారమ్" అను నార్యోక్తి కలదుగదా! ఆ మహాపురుషుని గురించి నేనతిదుఃఖమున మునింగిపోయితిని.

బ్రతికి బాగుపడంగల • వారిఁదునిమి,
బ్రతుకగ నసహ్యముంబొందు • వారి జీవి

తమ్ముఁ బొడుగింతు విది విలాసమ్మొ నీకు
ప్రాణికోట్ల సుదుష్కర్మ ఫలమొ? దేవ!

అని పెక్కు భంగుల విలపించితిని. మిత్రులోదార్చిరి. బాంధవులు పరామర్శించిరి. కాని శాంతి గలుగలేదు. అట్టి విషమపరిస్థితియందు నాకు శాంతిఁ జేకూర్చినది శ్రీమద్భగవద్గీత, శ్రీకృష్ణపరమాత్మ చరిత్రమునై యున్నవి. గీతలు ప్రతిదినము పఠింపసాగితిని. నాదుఃఖము వెనుకఁ బట్టసాగినది. ఆసమయమునందే గీతలలో కొన్ని యనువాద మొనరించి పత్రికలకుఁ బంపితిని. అప్పట్ల మహాత్ముని (గాంధిజీ) నిష్కామయోగము వెలువడినది. దానిని శ్రద్ధాభక్తులతో తెలుసుకొంటిని. గీతలను యథా మాతృకగా నాంధ్రీకరించి దానితో మహాత్ముని వ్యాఖ్యానము సయిత మనువాద మొనరించి, శ్లోకము, పద్యము, వ్యాఖ్యానముఁ గలిపి ముద్రింపఁజేసిన బాగుండునని యూహాగల్గెను. నా మిత్రులు కొందఱ్ నా యుద్దేశమును ద్విగుణీకృత మొనరించిరి. తత్క్షణమే శ్రీ కృష్ణమాత్మునిపై భారమువైచి గీతానువాద మారంభించితిని (10-11-32) కర్మయోగ మాంధ్రీకరించుచుండగ శ్రీయుత దుగ్గిరాల బలరామకృష్ణయ్యచౌదరిగారు, మహాత్ముని వ్యాఖ్యాన మాంధ్రీకరించిరని తెలిసి దానినిఁ దెప్పించి చూచితిని. అంతటితో వ్యాఖ్యానానువాద ప్రయత్నమునుండి విరమించి, గీతానువాదము 1933 ఏప్రియలు 15 వ తేదికి పూర్తియొనరించితిని.

కవులు సాధారణముగా దరిద్రదేవతా పీడితులనునది లోకవిదితమేగదా! భగవదనుగ్రహముచే గ్రంథరచన మొనరించుట కొంత సుకరమేగాని దానినిఁ బ్రచురణజేయుట యన మహా దుర్ఘటము. గ్రంథమును సాపువ్రాసి యొకమూల ఁబడ

వైచితిని. నామితులెందఱో దీనిముద్రణమునకై కృషిసల్పిరి కాని ఫలింపలేదు. నామితులలో కవికుమారులు, కవిత్వాభిమానులు, నగునొకరు నా యీ గ్రంథముద్రణమునకై శక్తివంచనలేక ప్రయత్నమొనరించి కార్యసాఫల్య మొనరింప వలయునని యెంతయోశ్రమపడి తుదకు సానుకూలమొనరింపక పోయితిమేయని మిగుల విచారించిరి. కాలము వ్యతిరేకముగా నున్నప్పుడు వారుమాత్రమేమిచేయఁగలరు ?

1934 వ సంవత్సరమున నేను అంబాజీపేటలో (తూర్పు గోదావరి) భారతపురాణ కాలక్షేప మొనరింపనేగితిని. అచ్చట పెనుగొండ పురపాలకాధ్యక్షులు పశ్చిమగోదావరిజిల్లా బోర్డు సభ్యులునగు శ్రీయుత, జవ్వాది లక్ష్మయ్యనాయుఁడుగారి పరిచయ భాగ్యము లభించెను. వారు నన్ను వారి పురమునకు (పెనుగొండ) ఆహ్వానించి, శ్రీమద్భగవద్గీతలు, శ్రీకృష్ణావతారతత్త్వమునుగూర్చి యుపన్యాసములను జరిపించిరి శ్రీ లక్ష్మయ్యగారు, వీరి యగ్రజులు శ్రీయుత, నరసింహమూర్తిగారు నాయెడ నవ్యాజానురాగులై నాకెట్టికొఱంతయుఁ గలుగనీక, నెల్ల సదుపాయము లొనరించుచు, నన్నొక సోదరుని భాతి జూచుచుండిరి. ఈ నా గీతానువాదమును పండితకవి మితబాంధవులతోఁగూడి సాంగోపాంగముగా బహు శ్రద్ధాన్వితులై విని; తమ నిష్కల్మషానందమును వెలిబుచ్చుచు "నీ గ్రంథమును శీఘ్రకాలములో ముద్రింపఁజేసి యాంధ్ర సోదరుల కర్పింపుఁడని కోరిరి" అప్పుడు నేనీ గ్రంథ రచనాదినుండియు జరిగినవిషయము లామూలాగ్రముగా విన్నవించి; యీ నాకృతికన్యను రసజ్ఞులు సర్వసద్గుణ సమన్వితులు యువకులునగు తమరు పరిగ్రహించు టెంతయు యోగ్యమని

పలికితిని. ఆ నావాక్యములకు సభికులు హర్షధ్వను లొనరించిరి.

(ఆ సమయమునఁ జెప్పిన పద్యములు)

ఎన్నియొబన్నముల్వడియు, ♦ నెన్నో ప్రయత్నములాచరించి యీ
పిన్నకుమారిఁ గాంచియును ♦ ప్రేముడిసాకితి నింతకాలమున్
జన్నది శైశవంబు, విల ♦ సద్గుణరాజి సమాశ్రయించె వి
ద్వన్నత వర్తనంబు రస ♦ బంధురభావ మృదుత్వవాక్య సం
పన్నత మీఁతె; నేవిధిని ♦ బాములకోర్చియుఁ బెంచెనేనియున్
బన్నగవేణి యాత్మవిభు ♦ పాలెగదా! యది "వేదవాక్యమా"
నన్నదెఱింగి, దేశముల ♦ యందునఁ ద్రిమ్మఱితిన్ వరార్థ మీ
యున్నలమిన్న నేడు భవ♦దంచితనిర్మల సద్గుణప్రభా
వోన్నతిఁ గాంచి మెచ్చితల ♦ యూపెనుగాన సుధీవరేణ్యా! యీ
చిన్నది భూషణమ్ములును ♦ చీరెలు రైకలు వాహనాళిపే
రెన్నిక గల్గువస్తువుల ♦ నిమ్మని కోరదు; పెట్టెబేడలున్
సన్నని పైట పావడలు ♦ చందనచర్చలు పూవు లత్తరుల్
ప్రన్ననిభక్ష్యభోజ్యములు ♦ పానకముల్ మదివాంఛఁ జేయబో
దెన్నఁడు బుట్టినిల్లుగన ♦ నేగెదనంచును బోరుఁ బెట్టదే
మన్ననుశాంతమున్విడువ ♦ దాగ్రహమూనదొకప్పుడేనియున్
జిన్నతనంపుఁ జేష్టలను ♦ జేయదు, నీ కిసుమంత కష్ట మ
న్నన్న! ఘటింపఁబోదు, విన♦యాన్వితమై మదికింపుఁ గూర్చు నీ
యన్నిటి కేమిగాని విను♦మా! వచియించెద నొక్క చిత్ర మీ
కన్నె పరిత్యజించియును ♦ గ్రన్నన నంతిపురంబు; స్వేచ్ఛగా
నెన్నిసభాంతరాళముల ♦ కేగియు నెమ్మి యుపన్యసించినన్,
జిన్నెలు వన్నె లేగతినిఁ ♦ జేసినఁ, గాంచియు నెందఱెందఱిన్
సన్నుతులందెనేనియు ని♦జమ్ముగఁ, గర్తకు భర్త కెంతయో
వన్నెయు వాసిఁదెచ్చును ర♦వంతయు గౌరవహానిఁ దేదు నీ

పున్నెమదేమొ? సార్థకతఁ♦బొందుభవత్కులమిక్కృతింబున౯,
అన్న! యీఁకాలసింప తగ♦వా? యిది యెంతటివారి కబ్బు! ర
మ్మన్నను వచ్చునా? బహుళ♦యత్న మొనర్చిన? లక్షలిచ్చిన౯
బన్నగ పూర్వజన్మకృత♦భాగ్యవిశేషము లేకయుండిన౯

కావ్యవిరచనశక్తియే ♦ కలదు కవికిఁ
గాని, విఖ్యాతి రసికుండె ♦ కలుగఁజేయు.
జలజమును బెంచు నీరమ్మె; ♦ చెలిమితోడఁ
గాంతిమంతముఁ జేయు భా♦స్కరుఁడు దాని.

సరసత యెట్టిదో యెఱుఁగఁ♦జాలనివాని హృదంతరమ్మున౯
సరసకవిత్వతత్త్వమ్మృదు♦చాతురికించుక తావుగల్గఁబో
దరయఁగ, యౌవనాంగిమధు♦రాధరనిర్గతరమ్యవాక్యముల్
జరఠున కార్తిగాక మది ♦ సంతసముౕ గలిగింపనేర్చునే?

అడిగిన దెల్ల స♦మర్పించె నొక్కండు
కృతిగౌరవంబుఁ గాం♦క్షించికాదె?
కనకాభిషేకంబుఁ ♦ గావించె నొక్కండు
కృతిగౌరవంబుఁ గాం♦క్షించికాదె?
"పల్లకిఁ దనకేల ♦ బట్టి యెత్తె" నొకండు
కృతిగౌరవంబుఁ గాం♦క్షించికాదె?
మాన్యంబులిచ్చి స♦న్మానించె నొక్కండు
కృతిగౌరవంబుఁ గాం♦క్షించికాదె?
"సప్తసంతానములలోఁ బ్రశస్తిఁ గాంచి
ఖిలముగాకుండునది ధాత్రిఁ ♦ గృతి" యటన్న
ఆంధ్రభోజోక్తి వినవె? నీ ♦ కట్టి సుకృతి
లభ్యమయె; నెంత సుకృతివో? ♦ లక్ష్మయార్య!
శ్రీనాయఁడుగారీ నాకోర్కెను మన్నించి, యంగీకార

మును సూచింపుచు "ఈ వత్సరముమాత్రి మీకార్యమొనరింపఁజాలనందులకు విచారింపుచుంటిననియు, వచ్చెడువత్సరము (యువనామ వత్సరము, 1935) పూర్తియొనరింతు" ననియుఁ దెలిపిరి. అంతట వారి ప్రేమపూర్వకమగు ధన కనకాంబర తాంబూలచందనాది సత్కారము లంది, మా స్వగ్రామమున కేగుదెంచితిని.

అంత యువాబ్ద మేగుదెంచెను. మూఁడు మాసముల కాల మందు గతించిపోయెను. నేను పెనుగొండ కేగితిని. శ్రీ నాయఁడుగారు జిల్లాబోర్డుయెన్నికల సన్నాహములో నిమగ్నులై యుండిరి. ఆరెండుమాసములు నే నచ్చటనే యుంటిని. భగవదనుగ్రహమువలన విజయులైరి. అంతట యధ్యక్షుని యెన్నికలవిషయమై యాందోళన సాగెను. ఆకారణముచే వారు స్థిమితము లేకుండిరి. కాన నేను గ్రంథవిషయము నే వెల్లడింపలేదు. ఈవిధముగా దాదాపు అయిదుమాసముల కాలము గడచిపోయెను. ఎన్నికల గందరగోళము సమాప్తి నందెను. నాయఁడుగారికి నెమ్మది జిక్కెను. ఆసమయమున వారితో గ్రంథవిషయమును మనవిజేయుచు చెప్పిన పద్యములు.

గౌతమీమాండలికసభ్య! ఘనగుణేభ్య!
సాహసౌదార్యధుర్య! ప్రశస్తశౌర్య!
సజ్జనధ్యేయ! పండితజనవిధేయ!
మహితజవ్వాదికులశుక్తిమౌక్తికంబ!

వెనుకటివత్సరంబు తమ వీటికి నేఁ జనుదెంచి, మిమ్ములం గని, కవితాప్రసూనపరికల్పితదామ మలంకరింప, మన్ననలొనరించి, పండితజనమ్ములమ్రోల మదాంధ్రగీతలన్ విని, ననుసత్కరించితి; కవిప్రవరాదరభావ మొప్పఁగన్.

శ్రీయును, వంశమున్, వయసు, • చెల్వు, రసజ్ఞతగల్గుమీకు, లేఁ
బ్రాయపుఁగావ్యకన్యను వి•వాహ మొనర్తునటంచుఁ బల్కఁ; వ
హ్వాయని రెల్లవారు; దర•హాసముతో విడెమిచ్చి "సత్కవి
ధ్యేయ! గ్రహింతునంచు వచి•యించితి" వచ్చెడువత్సరంబునన్

అని సెలవిచ్చిపంప, హృద•యమ్ము ముదమ్మునఁ దేలియాడ, నె
మ్మనమునఁ దావకోక్తి తిరు•మంత్రముగా జపియించుకొంచు, చ
య్యన భవనామవర్షమున • కంతముఁగోరుచు; కోకిలాంచిత
ధ్వనుల యువాబ్దమెన్నఁడిఁక • వచ్చునో; యంచునిరీక్షఁ జేసితిన్.

అరిగెఁ దద్వత్సరంబు, మీ• రన్న భాతి
వచ్చితిని గ్రంథముద్రణ•వ్యయధనంబుఁ
గొనియు, నచ్చన కిడఁబొత్త•మును దలంచి
కాని, మీయాదరణ చాల•కాల మాపెఁ.

షడ్రసోపేతభో•జనము నీసహపంక్తిఁ
బ్రతిదినం బిడి తృప్తిఁ • బఱచినావు
వేళ మించఁగనీక • వివిధోపహారముల్
మించి సద్భక్తి ని•ప్పించినావు
ఏకొఱంతయు లేక • నెల్లసౌఖ్యముల న
ర్థించకుండగనె క•ల్పించినావు
మోటారునెక్కించి • నీటుగాఁ బలుచోట్ల
నొప్పుగా నీతోడఁ • ద్రిప్పినావు
నెమ్మి భవదీయ మిత్రసం•ఘమ్మునందుఁ
గలుగఁజేసితి వెంతయో • గౌరవంబు
పలికినాడవు "మా కవి•ప్రవరుఁ" డనుచు
రమ్యగుణధుర్య! జవ్వాది•లక్ష్మయార్య!

కార్యభారంబు మద్భుజ • స్కంధమందుఁ
గల్గుకతన, ని న్వీడనాడు • కాంక్ష గలిగెఁ,
గాని నీయాదరముఁ బాయఁ • గల్గు నెవఁడు
పంపుమా ! నాదుకృతిపుత్రి • కింపుఁ గూర్చి.

"ఆలస్యాదమృతం విషం" బనెడి యా • గ్యప్రోక్తసిద్ధాంతముల్
జాలన్ నీమదిఁ జర్చఁ జేసి యిపు డే • చందాన వర్తించిరో
మేలా; నట్టుల కార్యము న్నడుపుమా! • నేనేల వ్రాక్రుచ్చుటల్?
కాలాతీతము నిచ్చగింతురె? యశః • కన్యార్థులౌ ధీవరుల్.

నాపద్యముల విని మందహాస మొనరించుచు నంత వరకైన యాలస్యమున కెంతయో విచారించి, గ్రంథముద్రిణమున కగు ధనమును నా కొసంగి యేలూరువరకు తమ కారులో నన్ను వెంబడించిరి. నే నపరిమితానంద మగ్నుఁడనై గ్రంథమును ముద్రణమున కొసంగితిని.

అడిగినంతనే నావంశావళి పద్యములను వ్రాసి యిచ్చుటయే గాక గ్రంథముద్రిణ విషయములో నన్ను గుఱించి శ్రీనాయఁడుగారితో మనవిఁ జేసిన (సిద్ధాంతం, పశ్చిమగోదావరి) బ్రహ్మశ్రీ మంచం బుచ్చిలింగప్పశాస్త్రి (ఆశుకవి, అష్టావధాని)గారికి, నే నెంతయుఁ గృతజ్ఞుఁడను. గ్రంథముఖమునం దచ్చొత్తించుటకుగీతాభావముతో పార్థసారథిచిత్రము నే నడిగినంతనే, యాభావమును జక్కగాఁ దీర్చి చిత్రించి యిచ్చిన శ్రీయుత, కాళే శ్రీరామ్‌గారికి (అమలాపురం) భగవంతుఁడుచిరాయురభివృద్ధు లొసంగుగాత! వారిచిత్రకళ దినదినాభివృద్ధి నందుగాత!

| | |
|---|---|
| ఈ మ ని, | ఇట్లు |
| గుంటూరుజిల్లా | ఆంధ్రబాలసరస్వతి, అష్టావధాని, |
| 15—8—1936, | కాళహస్తి వేంకటనరసింహారావు. |

ఓమ్

# పీఠిక

---


సాహిత్యచక్రవర్తి

చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులుగారు,

రాజమహేంద్రవరం.


శ్రీమద్భగవద్గీతాశాస్త్రము పంచమవేదమని విఖ్యాతిఁ గాంచిన సంస్కృత మహాభారతమునందలి భీష్మపర్వములో పదునెనిమిది యధ్యాయములు, నేడువందల శ్లోకములలోఁ జెప్పఁబడినది. ఇది యధ్యాత్మవిద్యారహస్యవేదియైన శ్రీకృష్ణ భగవానులు భారతమహాయుద్ధప్రారంభమున, తనకు మేన మఱఁదియు, నెచ్చెలియు, శిష్యప్రియుఁడునైన పాండవమధ్యమున కుపదేశించినట్లు గ్రంథమందున్నది. అది వేదాంతోప దేశమునకుఁ దగిన సమయమా యని కొందఱు, పదునెనిమిది యధ్యాయములు గలిగి యేడునూఱుల శ్లోకములచే నొప్పు చున్న మహాగ్రంథ మప్పుడు జెప్పియుండునా యని కొందఱు, సంశయగ్రస్థులై యనేకవిధముల వ్రాసియున్నారు. ఆసంశ యము లెన్నటికినిఁ దీరునవిగావు.

ఏదియెట్లున్నను భగవద్గీత సర్వదేశములవారికిని, సర్వ మతములవారికిని, సర్వజాతులవారికిని, సర్వకాలములవారికినిఁ, బఠనీయగ్రంథమని నిశ్శంకముగాఁ జెప్పవచ్చును. ఏలయన

నిందు జ్ఞానయోగాసక్తులగువారికి జ్ఞానయోగమును, భక్తి యోగప్రియులగువారికి భక్తియోగమును, గర్మయోగనిరతు లగువారికిఁ గర్మయోగమును, లభించును. మొత్తముపై హిందూమతముయొక్క సారమంతయు నిందులో నున్నదని చెప్పుట నిర్వివాదాంశము. ఇందు శివునియుత్కర్షగాని, విష్ణు దేవుని యుత్కర్షగాని, మఱి యే సాంప్రదాయసిద్ధమైన సిద్ధాంతముగాని వివరింపఁబడకపోవుటచే నిది మతత్రియము వారికి సేవ్యమై, యాదరణీయమై యున్నది. అందుచేతనే శ్రీమచ్ఛంకర భగవత్పాదులు అద్వైతపరముగాను, శ్రీమద్రా మానుజాచార్యులవారు విశిష్టాద్వైతపరముగాను, శ్రీమాన్ మధ్వరాయలవారు ద్వైతపరముగాను, దీనికి విపులవ్యాఖ్యా నములు విరచించియున్నారు.

ప్రత్యేకముగా నేదో యొకసాంప్రదాయము నను సరించి యీగ్రంథము లిఖింపఁబడకపోవుటచేతనే; భరతఖండ మునఁ బ్రస్తుతకాలములోఁ బ్రచారములోనున్న యార్య సమాజమునకు, బ్రహ్మసమాజమునకుఁ, జెందినవారు కూడ దీనియందు మిక్కిలి యాదరమును జూపి; యిందలి భావము లను గ్రహించి సంతసించుచున్నారు.

హిందూదేశములో నున్న భాషలన్నిటిలో యీ గ్రంథము ప్రచురింపఁబడినది. అంతేకాదు, పాశ్చాత్యఖండ ములలోని ముఖ్య భాషలలోనికిఁగూడ భాషాంతరీకరింపఁబడి యా యా వాఙ్మయములందు గౌరవనీయమగు స్థానమును బడయుచున్నది. ఈ గ్రంథము నిదివరకుఁ బలువు రాంధ్రిక

రించిరి. కొందఱు పద్యములుగాను, కొందఱు వచనముగాను విరచించిరి.

ఇప్పు డీ గ్రంథమును తెనిఁగించిన కవికుమారులు గుంటూరు మండలమునందలి యామని గ్రామ నివాసులు, వీరి నామధేయము కాళహస్తి వేంకట నరసింహారావుగారు. ఆంగ్లేయ భాషాపరిచితులు. ఆశుకవిత్వావధాన కార్య కుశలులు, పౌరాణికులు, వక్తలు. పితృమరణముచేత వీరు దుఃఖజలధినిమగ్నులైన కాలమున వీరికి శ్రీమద్భగవద్గీతా పఠనము నిరుపమాన చిత్తశాంతినిఁ బ్రసాదించెనని స్వవిషయ మున వ్రాసికొనియున్నారు. నిజముగా భగవద్గీత మనశ్శాంతి లేనివారికి సముచితమైన శాంతి నొసంగుననుట నిశ్చయము. ఇట్టి గ్రంథము నాంధ్రీకరించి తాను తరించి యాంధ్రలోక మును దరింపఁజేయ సమకట్టిన వీరి కృషి ప్రశంసనీయము. చాలచోట్ల వీరు శ్లోకమున కొకపద్యమునే తెనుఁగున వ్రాసి నారు. కొన్నిచోట్ల రెండుశ్లోకముల కొక సీసపద్యమును, మూడు శ్లోకముల కొక సీసపద్యమును వ్రాసియున్నారు. మఱికొన్నిచోట్ల రెండేసి శ్లోకములకు నొకవృత్తమునుగూడ లిఖించిరి.

కవిత్వము సరసమై పాఠకమహాశయుల మనస్సుల నాకర్షించునట్లు లలితమైయున్నది. పద్యములు వల్లనవేయు టకు వీలుగానున్నవి. దాదాపుగా గ్రంథమంతయు వారే నాకు చదివివినిపించినారు. కృతిపతియైన శ్రీ జవ్వాదిలక్ష్మయ్యా నాయఁడుగారి నీ కవి తన కృతికన్యకను స్వీకరింపుడని కోరుచు

నాశుధారగాఁ జెప్పిన యుత్పలమాలిక యతిమనోహరముగా నున్నది. పాఠక మహాశయు లీ క్రిందివాక్యములఁ జిత్తగింతురుగాక.

"ఈ చిన్నది భూషణంబులును జీరెలు రైకలు వాహనాళిపే
రెన్నికఁగన్న వస్తువుల నిమ్మని గోరదు, పెట్టె బేడలున్
సన్నని పైటపావడలు చందనచర్చలు పూవులత్తరుల్
ప్రన్ననిభక్ష్యభోజ్యములు పానకముల్ మదివాంఛ సేయఁబో
దెన్నఁడు బుట్టినిల్లుఁగన నేగెదనంచును బోరుఁబెట్ట దే
మన్నను శాంతమున్ విడువ దాగ్రహమూన దొకప్పుడేనియున్
జిన్నతనంపుఁ జేష్టలను జేయదు, నీ కిసుమంత కష్ట మ
న్నన్న! ఘటింపఁబోదు వినయాన్వితయై మదికింపుఁగూర్చు; నీ
యన్నిటికేమిగాని వినుమా! వచియించెద నొక్కచిత్రి మీ
కన్నె పరిత్యజించియును గ్రన్నన నంతిపురంబు, స్వేచ్ఛగా
నెన్నిసభాంతరాళముల కేగియు నెమ్మి యుపన్యసించినన్,
జిన్నెలు వన్నె లేగతినిఁ జేసినఁ గాంచియు నెందఱెందఱో
సన్నుతులందెనేనియు, నిజమ్ముగ కర్తకు భర్తకెంతయో
వన్నెయు వాసిఁదెచ్చును; రవంతయు గౌరవహానిఁ దేదు, నీ
పున్నెమదేమొ; సార్థకతఁబొందు భవత్కుల మిక్కటంబునన్"

పూర్వోదాహృతమైన పద్యభాగమే గాక, యాంధ్రీకరణమంతయు హృదయంగమముగా నున్నది. నాకు కంఠస్థములగు కొన్నిశ్లోకముల నిచ్చి వానియాంధ్రీకరణ మెట్లున్నదో చదువుఁడని కోరితిని. వానికిసరియైనయాంధ్రీకరణమును

జదివి నన్నానందపరచిరి. అందు నాలుగు శ్లోకములను, నాం ధ్రీకరణమును నీ క్రింద నుదహరించుచున్నాను.

వాసాంసిజీర్ణాని యథావిహాయ నవాని గృహ్ణాతి నరోపరాణి
తథాశరీరాణి విహాయ జీర్ణాన్యన్యాని సంయాతి నవాని దేహీ. (౨. ౨౨)

జీర్ణ వసనాళి నరుఁడు వర్జించి, నూత్న
వస్త్రధారణ మొనరించు భాతి నాత్మ
శిథిలమౌ దేహముల వీడి, ప్రథితమౌ న
వీన దేహములను బొంది వెలయుచుండు

నైనం ఛిన్దన్తి శస్త్రాణి నైనం దహతి పావకః
నచైనం క్లేదయన్త్యాపో నశోషయతి మారుతః. (౨. ౨౩)

శస్త్రములు ఛేదనముఁజేయఁ జాల వాత్మ
మీఁజి కాల్పంగఁ జాలదు కాఱుచిచ్చు
జలము సిక్తమొనర్పగాఁ జాల దెపుడు
పవనునకు శోషిలంజేయ వలనుపడదు.

చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మవిభాగశః
తస్యకర్తారమపిమాం విద్ధ్యకర్తార మవ్యయమ్. (౪. ౧౩)

ఫల్గునా! గుణకర్మవిభాగవశత
నలిపితిని సృష్టి నాలుగుకులములేన
కర్తనైనను నేను తత్కర్మమునకు
నవ్యయుండ నకర్త నటం చెఱుంగు.

సర్వస్య చాహం హృది సన్నివిష్టో
మత్తస్స్మృతిర్జ్ఞాన మపోహనంచ
వేదైశ్చసర్వై రహమేవ వేద్యో
వేదాన్తకృద్వేదవిదేవ చాహమ్. (౧౫. ౧౫)

అన్నిప్రాణులహృదయమ్ములందు నుంటి
స్మృతియు జ్ఞానం బపోహ నాచేతఁ గలుగు
సర్వవేదాంతకర్తను, సర్వవేద
వేద్యుఁడను, వేదవిదుఁడను విజయ! నేను.

వీరియనువాదములో మూలములోనున్న భావ మెచ్చటను జెడలేదు. కవిత్వముంజూడ నిది యాంధ్రీకరణమువలె గనుబడక స్వకపోలకల్పితమగు కావ్యమువలె గనుబడును. భక్తి జ్ఞానవైరాగ్యములకు నిధియని చెప్పఁదగిన యీ యుత్తమ గ్రంథము నాంధ్రీకరించి శ్రీ వేంకటనరసింహారావుగారు ఆంధ్రవాఙ్మయమునకు నూతనాలంకారము నొక దానినిఁ గల్పించిరి.

ఆంధ్రమహాజను లీ మహాకావ్యమునందలి రసమును గ్రోలి, బ్రహ్మవిద్యానిష్ణాతులై, బహుశ్రమైకసాధ్యమైన యీ గ్రంథమును రచియించిన యీ కవికుమారునకుఁ దగిన ప్రోత్సాహముఁ గలిగింతురుగాక! ఇట్టిపవిత్రమైన కృతికన్యకను జేపట్టి తద్గుణముల లోకమునఁ బ్రకాశింపఁజేసిన మ. రా. రా. శ్రీ జవ్వాది లక్ష్మయ్యనాయఁడుగారివంటి కవిపండిత పక్షపాతులు మన యాంధ్రదేశమున ననేకు లుద్భవింతురు గాక!

29–9–1936.
రాజమహేంద్రవరం,

ఇట్లు,
(స) చిలకమర్తి లక్ష్మీనరసింహం.

ఓమ్

# ప్రస్తావన

"వసుదేవసుతం దేవం కంసచాణూరమర్దనమ్
దేవకీపరమానందమ్ కృష్ణం వందే జగద్గురుమ్."
"యావానాత్మని వేదాత్మా తావానాత్మా పరాత్మని
య ఏవం సతతం వేద సోఽమృతత్వాయ కల్పతే"
(మ. భా. శాం. ౨ ౬౮-౨౨)

"తన శరీరమునం దెంతయాత్మ గలదో, యంతటి యాత్మయే యన్యములందును గలదనియెప్పుడు నెవండు తెలుసు కొనునో; వాఁడే యమృతత్వమును బొందుటకు సమర్థుఁడగు చున్నాఁడు" అను మహాభారతవాక్యమును సార్థక మొనరించు టకే మనుష్యుఁడు సదాప్రయత్నించవలయును. అట్టివిజ్ఞానమే మానవునకు దేవత్వమిచ్చి సంపూర్ణునిగా నొనరించును.

"ఆహారనిద్రాభయమైథునం చ, సామాన్యమేతత్పశుభిర్నరాణాం
ధర్మో హి తేషామధికో విశేషో, ధర్మేణ హీనాః పశుభిస్సమానాః"

"ఆహారము నిద్ర భయము మైథునము ననునవి పశువు లకు మనుజులకు సమానములే. ధర్మమనునదియే మనుజుల యందు విశేషము. ఇట్టిది లేనివారు పశుసమానులు."

ఇట్టియమూల్యవిషయములను తెలుపునవి వేదములు. ఈ పవిత్రవేదములు పూర్వభాగమనియు (ప్రవృత్తి), నుత్తర

భాగమనియు (నివృత్తి) రెండుభాగములు. ఈ యుత్తరభాగ మునకే ఉపనిషత్తులనియు వేదశిరోభాగములనియు నామ ములు. ఇవియే వేదాంతములు అనగా "వేదములను పరిశీలించి కడకు నేకధ్యానమందు మనస్సునిలిపి యట్టి ధ్యానమును గూడ విరమించినయెడల తానే తానగును" అని వేదాంత మునఁ జెప్పఁబడుచున్నది. ఆ యంత్యవిషయ మేదో యదియే వేదాంతము! అదియే బ్రహ్మానందము! యదియే జీవేశ్వరైక్యము! అదియే మోక్షము!

ఈమహత్తరవిషయసాధనకై యనేకు లనేకమార్గముల ననుసరించిరి. అన్నిమార్గములయందును సత్యమిమిడియున్నది. అన్నివిధములను బరిశీలించినఁగాని మనకు సరియగు విధానము బోధపడదు. సమత్వబుద్ధితో సలుపునాయుత్తమవిచారముతో మన మొకనిశ్చితాభిప్రాయమునకు రాఁగలము. అట్టిదివ్య మార్గమే గమ్యస్థానమునకుఁ గొంపోయి ప్రశాంతిఁజేకూర్చును.

యుగయుగములయందు నానాఁటికి యీ సత్యవిషయ నిర్ణయప్రయత్నము, మన భారతభూమియందు విపులముగా జరిగియున్నది. అందుచే నాయాకాలములయం దాయాసిద్ధాం తము లేర్పడినవి. శాశ్వతము, సత్యము ప్రపంచమునుం డియుఁ గలదు. దానినిఁ దెలిసికొనుట కనువగుమార్గములనే యుత్తమపురుషులు తమ పవిత్రహృదయ పేటికలను విప్పి మనకుఁజూపిరి.వీరలేమనయార్యఋషిపుంగవులు."ఋషిర్మంత్ర ద్రష్టాః" (మంత్రమును తెలిసికొనినవారు ఋషులు.) మహా నీయుఁడగు నొక వేదఋషికి జ్ఞానోదయము గాఁగా, నాతఁ

డెల్లరుఁ దెలిసికొనునట్లు గంభీరస్వనముతో నెలుఁగెత్తి యిట్లభయప్రదాన మొసంగెను.

"శృణ్వన్తు విశ్వే అమృతస్య పుత్రా, ఆ యే ధామాని దివ్యాని తస్థుః
వేదాహమేతమ్ పురుషమ్ మహాన్తమ్, ఆదిత్యవర్ణమ్ తమసః పరస్తాత్,
తమేవ విదిత్వాతిమృత్యుమేతి, నాన్యః పన్థా విద్యతే ఽయనాయ"

"ఓ యమృతపుబిడ్డలారా! దివ్యస్థానమునందు వెలయు వారలారా! పరగతినిఁ బొందుమార్గముఁ దెలిసికొంటిని. చీకటి కావల సూర్యునిభాతి స్వప్రకాశుఁడై వెలుఁగు మాయాతీత పదార్థమగు పురుషునిఁ గంటిని. వానినిఁ గాంచుటచే మృత్యువునుండి వేరుగాఁగలరు. సద్గతి కన్యమార్గములేదు"

"న తత్ర సూర్యో భాతి న చంద్రతారకమ్
నేమా విద్యుతో భాంతి కుతోఽయమగ్నిః
తమేవ భాన్తమ్ అనుభాతి సర్వమ్
తస్య భాసా సర్వమిదమ్ విభాతి"

"వానిని సూర్యచంద్రులు ప్రకాశ పరుపఁజాలరు. నక్షత్రములు నగ్నియుఁ బ్రకాశపరుపఁజాలవు. వానివలననే నన్నియు ప్రకాశించును"

మనముఁ గాంచు నీ చరాచరాత్మకమగు ప్రపంచ మీశ్వరసృష్టివిలాసమును దదీయ సంబంధమును వెల్లడించు చున్నది. దినక్రమముగా బుద్ధిబలము ననుసరించి గమ్య స్థానముఁ జేరుటకు సన్నిహితమార్గములు గలుగుచుండును. ఈ మహత్తర సత్యవిషయ మొక కాలమునందుఁగాని, యొక శాస్త్రమునందుఁగాని, యొకనియనుభవమునందేఁగాని, యొక

మతమునందేఁగాని కల్గినదను టసంభవము. సత్యము మన మతమునందే గలదు, అన్యమతములయందు పూజ్యమని పలుకు టెంతయు నవివేకము. సాహసము. అన్యసిద్ధాంతముల యం దనుభవములేక వానినిఁ బరిశీలింపక బాహ్యావిషయములతో నిర్ధారణ మొనరించుట బుద్ధిమాంద్యము. ఆయా కాలములయం దాయామహాపురుషులచే నమూల్యోపదేశము లొనరింపఁబడుచుండును. ఆ ధర్మములు అవశ్యాచరణీయంబు లగుచుండును. అట్టి మహనీయు లాదర్శకపురుషులు.

పూర్వకాలమునందు మన భారతభూమియందు వేదస్థ ధర్మములు (పూర్వకాండము) ప్రధానస్థాన మలంకరించినవి. అనగా యజ్ఞ యాగాది రూపకమగు కర్మకలాపము. ఆ యజ్ఞాదులు రానురాను కొన్ని సంవత్సరముల తరబడి సంతత దీక్షగా నొనరింపవలసినవిగాకూడ మారెను. అందు చాల భాగము బాహ్యాడంబర ప్రధానముగా నుండెడివని చెప్ప వచ్చును. కొన్ని వైదిక కర్మలయందు జీవహింస సయితము జరుగుచుండెడిది. అందువలన దోషములేదనికూడ శాస్త్రము శాసింపుచున్నది.

"హింసాత్వంవైదికా యాంతు తావానర్థో ధ్రువం భవేత్
వేదోక్తయా హింసయా తు నైవానర్థం కథంచన"

అంతమాత్రముచేత నప్పట్ల పరమాత్మవిచారణ లేక పోలేదు. ఉన్నది, గాని యాగకర్మకలాపముఖమున నే సత్యాన్వేషణప్రయత్నములు జరుగుచుండెడివి. తదుపరి కొంత కాలమున

కీ కర్మకలాపములతో బుద్ధిమంతులు తృప్తినొందక, విచారణల సల్పిరి. హింసాయుతాడంబరతంత్రముల యాధిక్యత సడలి, మేధావిషయప్రయత్నములు సాగినవి. అదియే వేదోత్తర భాగకాలము. ఆధర్మములే జ్ఞానకాండమని చెప్పఁబడెడి యుపనిషద్రహస్యములు. దీనినుండియే సన్యాసీయ ధర్మము వెలువడినది. ఈ మహావిధానము లన్నియుఁ గాలానుగుణ్యముగా మహాపురుషుల ముఖతా వెలువడినవి. అయ్యవి యన్నియు వారివారి యనుభవైకవేద్యములే. ప్రాతపరిస్థితులు బోయి క్రొత్తపరిస్థితులు వచ్చుట కాలసహజము.

"The oldorder changeth yielding place tonewo God fulfils himself in many ways, best on good custom should corrupt the world."—Tennyson.

ఏయాదర్శకపురుషునిసుభాషితములయం దైనను ద్వివిధ భావము లడఁగియుండును. అందొకటి యప్పటి దేశకాల పాత్రముల ననుసరించిన యాశయము. ఇయ్యది మాత్రము శాశ్వతధర్మము కాజాలదు. ఏలనన, ఒక కాలమునకు సంబంధించినది యొక కాలమునకు సంబంధించక పోవచ్చును. ఒక దేశమునకుసంబంధించినది వేరొక దేశమునకు సంబంధించకపోవచ్చును. ఒకసంఘవిషయము మరొకసంఘమున కక్కఱ. వేయేల? ఒక వ్యక్తి కనుకూలమైనది వేరొకవ్యక్తికి ప్రతికూలము కావచ్చును. ఇట్టి తాత్కాలికాశయములతోనుండు భాషితములు కొంతకాలమునకు కాలగర్భమునం దడఁగిపోవును. కాన వానిని యుత్తమశాఖలోఁ జేర్చుట కవకాశము లేదు. అయ్యవియే పర

మావధియని చెప్పువారలు అన్యోన్య ద్వేషములకు కారణ
భూతు లగుదురు.

ఇక రెండవది యన్ననో శాశ్వతము. ఆ సత్య విషయ
మునకు దేశకాల మత సాంఘికాదులచే నేమాత్రము భేదము
లేదు. సర్వప్రపంచమున కాచరణయోగ్యమై యలరారుచుం
డును. విశ్వమానవ కళ్యాణ సంపాద్యమై, యాచంద్రార్కము
నఖండమై యొప్పును. కాని యియ్యదిమాత్ర మంత త్వరిత
ముగా స్ఫురింపదు. ఆచరణయం దుంచుటయు సులభసాధ్యము
గాదు. సముద్రగర్భాంతర ప్రచ్ఛన్నమౌక్తికమువలె యడఁగి
యుండును. దృఢదీక్షతో గంభీరమగుసముద్రమునఁ జొచ్చి
యారత్నమును బొందవలయునే గాని, యలఁతిగా లభించునది
గాదు.

ఈ ప్రపంచమునం దొక ధర్మము, ఆకాలపరిస్థితుల
ననుసరించియుండు ననుకొనుఁడు. ప్రపంచమునం దన్నిమతములు
నొకేయాచారముతో ప్రవర్తించు టసంభవముగదా! అట్టిచో
నాధర్మమునకు మాత్ర మెట్లు నేకత్వముసిద్ధించును.

"న హి సర్వహితః కశ్చిదాచార స్సంప్రవర్తతే
తేనై వాన్యః ప్రభవతి సోఽపరం బాధతే పునః"

(మ. భా. శాం.)

"ఎల్లరకు నొక్కవిధముననే సదా హితకరమగు
నాచార మెప్పుడును లభింపదు. ఒకటి గ్రహించిన రెండవది
దానికి మించియుండును. రెండవదానికి మార్గమిచ్చిన మూఁడవ
దానికి తిరిగి విరుద్ధమగును"

మన దేశమందు ద్వైతాద్వైత విశిష్టాద్వైత శైవ శాక్తేయాది మతములు గలవు. ఈ మతమునందు సాధారణముగా నన్యోన్యానురాగము పూజ్యమనుటసత్యదూరముగాదు గదా? కడకు, బొట్టుదగ్గరనుండియు జుట్టువరకు భేదదృష్టియే. తమలో తాము దూషించుకొనుటయే గాక తమ యుపాసనా దైవములను గూడ దూషింతురు. అన్నిమతములయొక్క గమ్యస్థానము నామభేదములచే నెవ రెట్లు జెప్పుకొన్నను మోక్షమే గదా?

"ఏకంసద్విప్రా బహుధా వదన్తి"

(అనేకవిధములుగాఁ జెప్పబడువస్తు వొక్కటియే)జీవేశ్వరైక్యమననిండు, కైలాసప్రాప్తియననిండు, వైకుంఠప్రాప్తి యననిండు, మఱేమియైన యననిండు జన్మరాహిత్యమేగదా? ఇవి యన్నియు నాపరమపదముయొక్క పర్యాయపదములే గదా? నదులన్నియు పృథగ్భావముతో నెన్నిమెలికలుఁ దిరిగినను, సముద్రపతనమేగదా శరణ్యము. అదియేగదా వాటి గమ్యస్థానము.అచ్చోట నెట్టిభేదములేని యేకత్వసిద్ధియే గదా?

అట్టిచో సీరాద్ధాంతములేల? సిద్ధాంతములేల? పరస్పర విద్వేషములేల? ఇది బాహ్యధర్మమునుండి యుత్పన్నమైనదే. మన మాతాత్కాలికబాహ్యధర్మముల విశ్వసించుటవలనఁ గలిగినదే యీ సంకటము. ఈ యాశయమెల్లను బూర్వోక్త ప్రథమకక్ష్యలోనిదే.ఈ యుద్రేకముచే దేశమునం దెన్నియో విప్లవములు జరిగినవని చెప్పవచ్చును.

మానవుని తెలివి తేటలు భావములు క్షణక్షణము మారుచుండును. విచారణ మొనరించిన తొలుత యభిప్రాయ భేదములు గల్గినను, కడ కా పృథగ్భావమే మనలను సరియగు సిద్ధాంతమునకుఁ గొనివచ్చును. ఒక వస్తువ నెట్లుచుట్టివచ్చినను తిరిగి యథాస్థానమునకుఁ జేరిననేగదా ప్రదక్షిణము పూర్తి నందుట." Unity in diversity" (స్వామివివేకానంద) "అనేకత్వమునం దేకత్వముగలదు"

సమత్వము దేవత్వముతో వచ్చునయనుభవమే శాశ్వతము, అట్టిసుభాషితములే యాదర్శకములు. వారలే యాదర్శక పురుషులు.

ఇట్టి శాశ్వతధర్మముల వెల్లడించు గ్రంథములయందు శ్రీమద్భగవద్గీత యుత్తమస్థాన మలంకరించెననుటలో సందియము లేదు.

"సర్వోపనిషదో గావో దోగ్ధా గోపాలనందనః
పార్థో వత్సస్సుధీర్భోక్తా దుగ్ధం గీతామృతం మహత్."

"అన్ని యుపనిషత్తులు గోవులు. పార్థుఁడు దూడ. పాలు పితుకువాఁడు గోపాలనందనుఁడు (కృష్ణుఁడు). పితుకఁబడునది గీతామృతము. యోగ్యబుద్ధిగలవాఁడనుభవించువాఁడు." శ్రీ కృష్ణపరమాత్మునిదివ్యగానము సర్వోపనిషత్సారమగుగీతాసుధారసంబునుఁజవిఁజూడఁగోరనివారు, మనభారతభూమియందేగాక నాగరకతాప్రపంచమునం దెచ్చటలేరనియేపలుకవచ్చును. భగవద్గీత ప్రస్థానత్రయమునం దగ్రస్థాన మలంకరించినది. ఈపవిత్ర

నామముతో పూర్వమునందే యనేకగ్రంథములు రచింపఁబడినవన్న (శివగీత, గణపతిగీత, దేవీగీత, సూతగీత, యిత్యాదులు) గీతాప్రాశస్త్యమును వేఱుగాఁ జెప్పనవసరములేదు.

"గీతాసుగీతా కర్తవ్యా కిమన్యైః శాస్త్రవిస్తరైః"

"ఒకగీతాగ్రంథమును బూర్తిగాఁ జదివినఁజాలును. మిగిలినశాస్త్రవిస్తారములతో నేమి ప్రయోజనము?"

ఈ పవిత్రగ్రంథమునకుఁ ద్రిమతాచార్యులు (శంకర రామానుజ మధ్వాచార్యులు) తక్కుంగల పండితమ్మన్యులెందఱో వ్యాఖ్యాతలైయుండిరి. నవయుగాచార్యులగు లోకమాన్య తిలకుమహాశయులు, అరవిందఘోషు, మహాత్మగాంధి, మొదలగు నాదర్శకపురుషు లెందఱో వ్యాఖ్యానకర్తలై యుండిరి. భారతీయులేగాక నాగరికతాప్రపంచమునందన్ని దేశములవారు భాషాంతరీకరణ మొనరించుకొనిరి. ఈ మహాగ్రంథమున కనేకవ్యాఖ్యానములు, ననేకభాషాంతరీకరణములు గలవు. ఇట్టిదానిని నావంటి యల్పజ్ఞుఁ డనువాద మొనరింప సాహసించినందులకు పాఠకలోకమునకు క్షమాపణఁ జెప్పుకొనవలసియున్నది. ఇయ్యది నాపాండిత్యప్రకటనకొఱకొనరించినదిగాదు. భాషావిషయమున నే నతిస్వల్పుఁడను. నాయీ సాహసమునకు శ్రీకృష్ణభక్తియు, గీతాభిమానమే కారణము.

ఏమహత్తరధర్మ మాంతరంగికశాశ్వతసత్యముతో విరాజిల్లుచుండునో! ఎద్ది సర్వసమత్వాశయపూరితమో!

ఎద్ది విశ్వమానవకళ్యాణనిర్మాణ హేతుభూతమో ! ఎద్ది ప్రశాంత దివ్యానుభవ వేద్యమో ! అదియే కాలానుగుణ్యముగా జీర్ణావస్థ నందినను, మేఘాచ్ఛాదితభానుబింబమువలె తిరిగి పునరుద్ధరింపఁ బడి, మహాతేజోవంతమై, యజ్ఞానాంధకారవిచ్ఛేదనకారణమై, శాశ్వతానందపదమార్గదర్శకమై, పరమపూజ్యమై విరాజి ల్లును. ఇక తక్కినధర్మములో సమయానుగుణ్యములై, తా త్కాలికాచరణయోగ్యములై, యస్థిరములై, స్మారకచిహ్న ములు మాత్రమే యగును.

గీతానిర్మాణకాలమును గుఱించియు, గీతాకర్తృత్వ మునుగుఱించియుఁబలువురుపలువిధములగునభిప్రాయములువెలి బుచ్చిరి. గీతాకర్త శ్రీకృష్ణుఁడా? కాడా? యనువిషయమును గురించి ఔనని కొందఱు, కాదని కొందఱు వాదోపవాదము లొనర్చిరి. కాని గీతాధర్మమునకు, శ్రీకృష్ణజీవితమునకు సన్నిహితసంబంధ మున్నట్లు గీతలు, భారతము జదివినవారికి స్ఫురింపకపోదు. ఇందు పవిత్రము, నుత్తమము, నాచరించు టకు సులభము, ధర్మ్యమునగు గుహ్యరాజముఁ దెలిపిన ప్రధానాధ్యాయమునకు (తొమ్మిదవ యధ్యాయము) క్షత్రి యాధిక్యతను సూచించునామ ముంచఁబడినది. ఉదాహరణముఁ దీసుకొనిన జనకాదులు క్షత్రియులు, చెప్పఁబడినది క్షత్రియు నకు, వ్యాజము క్షత్రియోచితమగు ధర్మ్యయుద్ధము. ఈవిష యముల సింహావలోకన మొనరించినగీతాకర్త క్షత్రియుఁడని తోచును. ఆక్షత్రియుడు శ్రీకృష్ణుఁడే యనుటకు, శ్రీకృష్ణ జీవితమంతయు గీతాధర్మమగు కర్మఫలసన్యాసము నే వెల్లడించు

చున్నది. అందుచే గీతాధర్మము కృష్ణకథితమనుట సుసంగత మేమో? ఎట్లయినను ఈ విషయనిర్ణయము చారిత్రిక వేత్తలకు వదలుట శ్రేయస్కరము. మనకు ప్రస్తుత మంత యవసరమును గానేరదు. ఈ వాదోపవాదములతోఁ బ్రయోజనము లేదు. శ్రీకృష్ణుఁడు చెప్పిననుసరే, మఱియొకరు చెప్పిననుసరియే. ఈ విషయములతోఁ గాలహరణ మొనరించుకొనుట మన యుద్దేశము గాదు. గీతలయందలి శాశ్వతధర్మ మెద్ది? అది ప్రపంచమున కెంతవర కుపయోగించును? అందు సామరస్య మెంతవరకుఁ గలదు? ఇందలి ప్రధానోద్దేశ మేమి? యను విచారముసలిపి యందలి సారము గ్రహించి యామార్గ మనుసరించుటయే మనకర్తవ్యము.

గీతాశాస్త్రము యేడువందల శ్లోకములు, పదునెనిమిది యధ్యాయములు గలది. ఈ యధ్యాయముల కాయా విషయ చర్చలననుసరించి పేరు లుంచఁబడినవి. (విషాద, సాంఖ్య, కర్మ, జ్ఞాన, కర్మసన్యాస, ఆత్మసంయమ, విజ్ఞాన, అక్షరపరబ్రహ్మ, రాజవిద్యా రాజగుహ్య, విభూతి, విశ్వరూప సందర్శన, భక్తి, క్షేత్రక్షేత్రజ్ఞ విభాగ, గుణత్రయవిభాగ, పురుషోత్తమ, దైవాసురసంపద్విభాగ, శ్రద్ధాత్రయవిభాగ, మోక్షసన్యాస యోగములు.) సందర్భానుసారముగా పేరులుంచినను బదునెనిమిది యధ్యాయములయందు కర్మయోగమే ప్రతిపాదింపఁ బడినది. పరిణామదశయందు సర్వకార్యములయందును భేద భావము గలుగుచుండును. అపృథగ్భావమే పలువిధములగు ప్రజ్ఞావాదములకు తావాసంగును. ప్రవృత్తియందుఁ గల ధర్మము ఖండరూపమై విషాదకారణమగును.

కురుపాండవులు రాజ్యకలహముచే కురుక్షేత్రమున సన్నద్ధులైరి. కృష్ణసారథ్యముతో రథస్థుఁడై వచ్చిన యర్జునుఁ డిరువాగుల నున్నస్వజనములఁ గాంచి విషమపరిస్థితినిఁ బొంది "కృష్ణా! వీరినిఁ జూచి నాయవయవములు శిథిలమగుచున్నవి. కంప మొదవుచున్నది. గాండివము చేతినుండి జాఱిపోవుచున్నది. ఆహవమున స్వజనులఁ జంపిన శ్రేయస్సు గానుపింపదు. గురు మిత్రబాంధవరక్తసిక్తమగు రాజ్యము నా కక్కఱలేదు. దుర్యోధనాద్యాతతాయులను జంపుటచే బాపమే గలుగును. కృష్ణా! త్రిలోకరాజ్యాధిపత్యము నాకు లభింపనున్నను, వీరు నన్నుహింసించినను, నేను వీరినిఁ జంపఁజాలను" అని పలికి యుద్ధవిముఖుఁడాయెను. యుద్ధభూమియందు స్వజనులఁగాంచిన యర్జునుని,శోకమోహములు కర్తవ్యతామూఢునిగా నొనరించి నవి. ఇది ప్రథమాధ్యాయ విషయము, గీతోపదేశ బీజము. అట్లు కృపయావిష్టుఁడై కన్నీళ్లు విడుచుపార్థునితో కృష్ణుఁడిట్లు చెప్పెను. అర్జునా! ఇట్టికష్టపరిస్థితి నీ కీకశ్మల మెట్లు వచ్చెను? ఇయ్యది అనార్యజుష్టము, అస్వర్గ్యము,అకీర్తికరము; క్లీబత్వము నొందకుము. ఇదినీకు తగదు. క్షుద్రమగు హృదయదౌర్బల్య మును వీడి యుద్ధమునకు లెమ్ము!

ధర్మాధర్మవిచారమను సుడిగుండమునఁ బడి కొట్టు కొనిపోవు నర్జునుఁడు కృష్ణునితో దేవా! కార్పణ్యదోషము చేత నాస్వభావము మారినది. ధర్మమేదో నాకుఁ దోచకున్నది. నిశ్చితమగు శ్రేయ మేదియో నాకుఁ దెల్పుము. నేను నిన్ను శరణుబొందుచున్నాను! నీ శిష్యుఁడను! నన్ను శిక్షింపుము!

రెండవ యధ్యాయమునుండి నాలుగవ యధ్యాయము వఱకు భగవానుఁడు సాంఖ్యకర్మముల రెంటినిబోధించెను. రెండును శ్రేయస్కరము లనియే వచించెను. రెండును శ్రేయస్కరము లగునప్పుడు కర్మయోగమే యనుసరింపవలయునను సిద్ధాంతము లేదు. ఎవరియిష్టము వచ్చినట్లు వా రాచరింపవచ్చును. ఈవిష యమునే యర్జునునిప్రశ్నపై యయిదవ యధ్యాయములో రెండు మార్గములు ననుసరణయోగ్యములైన నందు "కర్మ యోగో విశిష్యతే" కర్మయోగమే శ్రేష్ఠమని సిద్ధాంతీకరిం చెను. సమబుద్ధితో నిష్కామకర్మము లొనరించువానికిఁ గూర్చు న్నచోటనే మోక్షము లభించును. మోక్షముకొఱకు సన్యసిం చుట యనునది పొరపాటు.

"మోక్షస్య న హి వాసోఽస్తి న గ్రామాంతరమేవ వా
అజ్ఞానహృదయగ్రంథినాశో మోక్ష ఇతి స్మృతః."
(శివగీత)

"మోక్షమున కొకచోటు లేదు. ఒక గ్రామము లేదు. తన హృదయాజ్ఞానవినాశనమే మోక్షము" ఆఱవ యధ్యా యమునందు సమత్వబుద్ధికి సాధనములు జెప్పఁబడినవి. ఈ యధ్యాయమునందు యోగసిద్ధాంతములఁగూర్చి కొంత వచించెను. అయ్యవి ముఖ్యములని మాత్రము వచింపలేదు. కాని సమత్వసిద్ధిని (స్థితప్రజ్ఞలక్షణమును) సాధించుటకు సాధనములని మాత్ర మంగీకరించెను. ఏడు ఎనిమిదవ యధ్యా యములందు క్షరాక్షరసృష్టినిగుఱించియు, అధ్యాత్మ, అధి యజ్ఞ, అధిదైవ, అధిభూత భావములను సంక్షేపముగాఁ దెలుపఁ బడెను. తొమ్మిదవ యధ్యాయమునఁ జరాచరమునందు

నిండియున్న యవ్యక్తుఁడగు పరమేశ్వరుని యనన్యభక్తిచేఁ దెలిసికొని యా దివ్యపురుషుని శరణుజొచ్చుటయే మోక్ష ప్రాప్తికి రాజమార్గము. ఇదియే రాజవిద్య, రాజగుహ్యము. ఈ యధ్యాయమునందు కర్మ జ్ఞాన భక్తులకు చక్కని సమ న్వయముఁ గావించెను.

"అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహం
పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి
తదహం భక్త్యుపహృత మశ్నామి ప్రయతాత్మనః
యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్
యత్తపస్యసి కౌన్తేయ తత్కురుష్వ మదర్పణమ్
శుభాశుభఫలైరేవం మోక్ష్యసే కర్మబంధనైః
సన్న్యాసయోగయుక్తాత్మా విముక్తో మాముపైష్యసి."

"ఎవ రితర మెఱుఁగక నన్ను సేవింతురో వారి యోగ క్షేమము లెప్పుడు నేనే వహింతును. ఎవఁడు పత్రమైనను ఫల మైనను జలమైనను బుష్పమైనను భక్తితో నాకు సమర్పించునో యాభక్తిపూర్వక ఫలాదిక మెల్ల నే గ్రహింతును. ఎద్ది సల్పు చుంటివో, ఎద్ది వేల్చుచుంటివో, ఎద్ది తినుచుంటివో, ఎద్ది యిచ్చుచుంటివో, ఏతప మాచరించుచుంటివో, అదియెల్ల నా కర్పింపుము. అటుల సన్న్యాసయోగయుక్తుఁడవయి శుభా శుభకర్మములనుండి ముక్తినంది నన్నుఁ జెందఁగలవు"

పది పదునొకండవ యధ్యాయములయందు పరమేశ్వ రుని విభూతివిస్తారమును వచించి విశ్వరూపప్రదర్శనమును గావించెను. పండ్రెండవ యధ్యాయమునందు తొమ్మిదవ

యధ్యాయమునందలి వ్యక్తోపాసన సులభమని తెల్పుచు భక్తిని బోధించెను. ఇందుఁ జేర్కొనిన భక్తి, ప్రసంగములతోను స్తోత్రములతోను బాహ్యాడంబరములతోను విరాజిల్లునదిగాదు. పిచ్చిశ్రద్ధయుఁగాదు. స్థితప్రజ్ఞునిలక్షణము లెట్టివో, అట్టి లక్షణములనే భక్తునియెడలఁగూడఁ దెల్పెను. వేయేల? స్థితప్రజ్ఞుఁడే యనన్యభక్తుఁడు; అనన్యభక్తుఁడే స్థితప్రజ్ఞుఁడు. వీరివర్తన మేకమే గాని భేద మించుకయు లేదు.

"అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవ చ
నిర్మమో నిరహఙ్కార స్సమదుఃఖసుఖః క్షమీ
సంతుష్టస్సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః
మయ్యర్పితమనోబుద్ధిర్యో మద్భక్తస్స మే ప్రియః"

"సర్వభూతములయందు ద్వేషములేనివాఁడును మిత్రుఁడును దయాకరుఁడును ప్రముదితుఁడును అహంకార మమకారములులేనివాఁడును సుఖదుఃఖములయందు సముఁడును సర్వేంద్రియనిగ్రహుండును దృఢనిశ్చయుఁడును ఋజుమార్గియుఁడును యోగియు త్యాగియు మనోబుద్ధుల నా కర్పించువాఁడును నాకు మిక్కిలి యిష్టుఁడు."

ఈపవిత్రలక్షణములు మాటలతో నలవడునవికావు. కేవలజపతపముల కందరానివి. అనుభవము త్యాగము యోగసిద్ధివలన లభ్యములు. గీతాదర్శము కేవలమేధావిషయములతో లభ్యమగునదికాదు. త్యాగమువలన నిది లభించుచున్నది. ఆత్మపరిశోధకమగు నీత్యాగమునకు జ్ఞాన మవసరము. అట్టి జ్ఞానముతోను గర్తవ్యము నిర్వచింపఁబడలేదు. అట్లు తృప్తి నందిన జ్ఞానము శుష్కభావములతో నిండి గీతాశాస్త్రమును

మూలఁబడవలసినదే. అందుచే భక్తితోఁ గర్మజ్ఞానములకు సంబంధము గలిపించి పరిపుష్టమొనరించెను.

పదుమూడవ యధ్యాయమున క్షేత్రక్షేత్రజ్ఞ విచారము జేయఁబడెను. ప్రకృతిపురుషులభేదమెఱిఁగి యంతటనునిండి యున్న బ్రహ్మము నుపాస్తిజేయుచు ముక్తుఁడగునని తెల్పుచు స్వభావమే సర్వకర్మములఁ జేయుచున్నది; ఆత్మ కర్తగాదు అను జ్ఞానముచేఁ గర్మములు బంధములుగావని తెలియఁజేసెను. పదునాలుగవ యధ్యాయమున సత్త్వరజస్తమోగుణముల భేదమును గుణభేదముచే జగద్వైచిత్ర్యముఁ దెలిసి పరమేశ్వరుని నిష్కామబుద్ధితో సేవించువారు గుణాతీతులని వివరింపఁబడెను. అట్టివారే ముక్తులు. స్థితప్రజ్ఞుఁడు గుణాతీతుఁడు అనన్యభక్తుఁడు యీమువ్వురు సములనియే చెప్పవచ్చును. పదునైదవయధ్యాయమున పరమేశ్వరుని యశ్వత్థవృక్షరూపవర్ణనము తెలిపి క్షరాక్షరాతీతుఁడగు పురుషోత్తమునిఁదెలిసి భజించుట ముక్తిప్రధానమని యుపదేశించెను. పదునాఱవ యధ్యాయమున మనుజులలోఁగల దైవీయసంపత్తు ఆసురీయసంపత్తు వారలలక్షణములు వారలకుఁ బ్రాప్తించు గతులు వర్ణింపఁబడెను. పదునేడవ యధ్యాయమున గుణవిభేదముచేఁ గలుగు శ్రద్ధ దానము తపస్సు యజ్ఞాదులభేదము ఓంతత్సత్ అను బ్రహ్మనిర్దేశభావము వివేచింపఁబడెను. ప్రకృతిగుణవిభేదముచే నేకత్వమునం దనేకత్వముఁ గనుపించుచున్నది. ఈప్రకృతిభేదముల యన్నిటి యందుఁగల యైక్యము దెలిసికొని యేకము నిత్యము నగు నాతత్త్వమునుపాసించి కర్తవ్యము మనుజుఁడు నిర్వహించవలెను.

పదునెనిమిదవ యధ్యాయమునందు నిష్కామబుద్ధితోఁ గర్మముల నొనరించుటయే సన్యాసమగును. కర్మలఁ ద్యజించక పోయినను, నిష్కామబుద్ధితో నొనరించిన సన్యాసముయొక్క సిద్ధాంత మిందుఁ గలదు. ఇదియే యుత్తమము. నామతము. ఈత్యాగము (జ్ఞానము, కర్త, కర్మ, బుద్ధి, ధృతి, సుఖము) ప్రకృతిగుణానుసారముగాఁ ద్రివిధములుగా నుండును. నిష్కామ కర్త నిష్కామకర్మ నిష్కామమువలనఁ గలుగు సుఖములు శ్రేష్ఠములని నిశ్చయింపఁబడెను. ప్రాప్తములగు కర్మములను నిష్కామబుద్ధితోఁజేయుటవలనఁదుదకు శాంతియు మోక్షము లభించును. కర్మములు ప్రకృతిధర్మములు గావున వానిని వదలుదమనిన వలనుగాదు. శుద్ధాంతఃకరణముతో పర మేశ్వరార్పణపూర్వకముగాఁ గర్తవ్యములని యావజ్జన్మాంతము కర్మ లొనరింపవలయును. "ఆపరమేశ్వరుఁడను నేనేగాన నన్ను శరణుబొందుము. నన్ను భజింపుము. నిన్ను సర్వపాపముల నుండి విముక్తునిఁ జేసెదను. ఇయ్యది చక్కగా విచారించుకొని నీయిచ్ఛవచ్చిన ట్లొనరింపుము." అని పలికి యుపదేశము పరి సమాప్త మొనరించి, అర్జునునియిచ్ఛాప్రవృత్తి స్వధర్మ మగు యుద్ధమునందుఁ బ్రవర్తింపఁజేసెను.

అధ్యాయాంత గద్యములయందు శ్రీమద్భగవద్ గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే అని చెప్పఁబడినది. సర్వోపనిషత్తులయొక్క సారమే గీతాశాస్త్ర మని ప్రసిద్ధి. ఇందు సంశయ మేమాత్రము లేదు. గీతల యందలి సాంఖ్యయోగములోఁ దెల్పఁబడిన పునర్జన్మసిద్ధాంత

మునకు ఆత్మనిత్యత్వమునకు కఠోపనిషత్తునందు నచికేతో పాఖ్యానవిషయమునకు సంబంధము గానుపించుచున్నది. భగ వద్గీతోపదేశము ఈ సిద్ధాంతముతోనే యారంభింపఁబడినది. ఈయుపనిషత్తులోనివాక్యములే గీతాశ్లోకములయందు నుప యోగింపఁబడినవి.

"హంత త ఇదం ప్రవక్ష్యామి గుహ్యం బ్రహ్మ సనాతనం
యథా చ మరణం ప్రాప్య ఆత్మా భవతి గౌతమ
యోనిమన్యే ప్రపద్యంతే శరీరత్వాయ దేహినః
స్థాణుమన్యేనుసంయంతి యథాకర్మ యథాశ్రుతం"

"మరణము పొందినతరువాత ఆత్మ యెటులుండునో దానినిచెప్పెదను. వారికర్మానుసారముగా కొందఱితర యోనుల పొందుదురు. కొందఱు స్థాణువులగుదురు."

ఈశోపనిషత్తులో జ్ఞానభక్తివైరాగ్యములు సంగ్రహ ముగాఁ జెప్పఁబడినవి. "కర్మజేయుచునే నూఱుసంవత్సరములు జీవించవలెను" ఇదియే గీతలలో నిష్కామయోగముగాఁ జెప్పఁ బడినది. ఈయుపనిషత్తుయొక్క ఉపసంహారము ప్రపత్తితోఁ జేయఁబడినది. 'అగ్నే నయ సుపథారాయే అస్మాన్ విశ్వాని దేవవయునాని విద్వాన్ యుయోధ్యస్మ జ్జుహురాణమేనో భూయిష్ఠాం తే నమ ఉక్తిం విధేమ" ఓ అగ్నినామక పర మాత్మా! మమ్ముల మోక్షధనముకొఱకు సన్మార్గమునఁ గొనిపొమ్ము. మాకర్మముల నీవెఱుఁగుదువు. మమ్మావ రించినఅజ్ఞానమును తొలఁగించుము. నీకు నమస్కారములు. గీతలలోని "సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకంశరణం వ్రజ" అను ఉపసంహారము పైదాని ననుసరించుచున్నది. ఈ ఉపని

షత్తు పదునెనిమిది మంత్రములలోఁ జెప్పఁబడినది. గీతలు పదు నెనిమిదియధ్యాయములు.

గీతలలోని 14, 15 అధ్యాయములు శ్వేతాశ్వతరోప నిషత్తునకు సంబంధము దెలుపుచున్నవి. "భక్తి" అను శబ్ద మీ యుపనిషత్తునందుతప్ప మఱిదేనియందును గనుపింపదు. తక్కిన యుపనిషత్తులలో "శ్రద్ధ" అని వాడఁబడినది. ఛాందోగ్యోప నిషత్తులోని "సర్వంఖల్విదం బ్రహ్మ, ఓమితిబ్రహ్మ, తత్త్వమసి సదేవ సౌమ్యేదమగ్ర ఆసీత్" అనునవి గీతలలోని "వాసుదేవః సర్వం, ఓం తత్ సత్" నిర్దేశమునకు ఆధారముగానున్నవి. ఈ విధముగా మఱికొన్ని యుపనిషత్తులలోని మంత్రము లాధార ముగాఁ దీసుకొనఁబడినవి. ఉపనిషత్తులేగాక నారదపంచరాత్రము కూడ ఆధారముగాఁ గైకొనఁబడినట్లు కనుపించుచున్నది. భగవద్గీతలు "పంచరాత్రముయొక్క" సంక్షేపమని మధ్వా చార్యులు తమ గీతాతాత్పర్యములోఁ దెలిపిరి.

"వేదార్థపూర్వకం జ్ఞేయం పంచరాత్రమథాఖిలం
తత్సంక్షేపశ్చ గీతేయం తస్మాన్నాస్యాః సమం క్వచిత్"

పంచరాత్రము స్వయముగా నారాయణునిచేఁ జెప్పఁ బడెను. నారాయణుఁడగు శ్రీకృష్ణుఁడు గీతలను జెప్పెను.

"సాంగేషు వేదేషు నిష్ఠామలభమానః శాండిల్యః పంచరాత్రమధీతవాన్"

"వేద వేదాంగములచే నిష్ఠ కుదురక శాండిల్యుఁడు పంచరాత్రముల నధ్యయనముఁ జేసెను."

గీతావిషయమునఁ దాత్కాలికపుధర్మము, స్థానికము అత్యల్పము. ఎంతటి ధీమంతులకైనను అతిక్లిష్టపరిస్థితుల

యందు విషాద ముప్పతిల్లును. ధర్మసందేహము క్లీబత్వము తాత్కాలిక వైరాగ్యము మొలకలెత్తును. అట్టియనుకూల సమయమునందే మహనీయుల హృదయమేఘములనుండి వాగమృతధారలు వర్షించి, సర్వజనహృదయమ్ముల నార్ద్రీభూత మొనరించి విజ్ఞానబీజమ్ముల విత్తి, దోహద మొనరించి మొలకలెత్తించును. ఇట్టిస్థితియందే మనకు గీతాశాస్త్రము ప్రసాదింపఁబడినది. ఇయ్యది యొక దేశమునకుఁగాని, యొకమతమునకుఁగాని, యొకనిమిత్తమును బురస్కరించుకొనికాని ప్రసాదింపఁబడలేదు. గీతాశాస్త్రము సర్వజనాదరణీయమగు ధర్మరాశియని చెప్పవచ్చును. గీతాబోధితమగు త్యాగము దేవమానవసంబంధముగా మనబాహ్యదృష్టికి గోచరించును. కాని వాస్తవమున కది గాదు. సర్వజన సామాన్యమగు వర్తనము, అన్యోన్యసహకారము, భూతసేవ, అహింసాదిసద్విధులనే తెలుపుచున్నది. గీతాభావమును మథించినయెడల, సర్వజనులు స్వార్థమువీడి, సర్వసామ్యముగా నిర్మించుకొనిన యొక శాశ్వతధర్మరాశియని మనకుఁ దెలియును. అన్యోన్యత్యాగము సహకారములవలన విశ్వమానవ సౌభ్రాతృత్వమును వెల్లడింపుచున్నది. స్వార్థత్యాగము, ఆధ్యాత్మికాభివృద్ధి, వర్ణవిధానము, కర్మయోగోద్దేశమును ఘోషింపుచున్నది. బాహ్యదృష్టికీ వర్ణవిధానము కొంతవర కేవగింపు కలిగింపవచ్చునేమో కాని విషయవిమర్శకుల కట్లు స్ఫురింపదు. ఆవిధానము ప్రస్తుతము మన కాచరణయందున్న జన్మహక్కుగల విధానము మాత్రము కాఁజాలదు.

"చాతుర్వర్ణ్యం మయాసృష్టం గుణకర్మవిభాగశః
తస్య కర్తారమపి మాం విద్ధ్యకర్తారమవ్యయం"

ఇయ్యది యాధ్యాత్మిక మహా సౌధారోహణమునకు సోపానపంక్తి. ప్రకృతికిసహాయము. ప్రతిజీవియందును త్రిగుణము లుండితీరవలయును. త్రిగుణాత్మకము కానియెడల భూతత్వమే సిద్ధింపదు. కాని యేగుణమున కాధిక్యముండునో దానినే మనము పేర్కొనుచున్నాము. మూఁటిని మనము చెప్పుటలేదు. (సత్త్వగుణాధిక్యుఁడైన సాత్వికుఁడనియు, రజస్సుతమస్సు ఆధిక్యమైన రాజసతామసులనియు) అంతమాత్రముచేతఁ దక్కిన గుణములు లేవని చెప్పఁగలమా? గుణముల ననుసరించియే కర్మము లుండును. వాని ననుసరించి వర్ణములుండును. అందు దేని కాధిక్య ముండునో దానికి మనమాధిక్యము నిచ్చుచున్నాము. తదనుగుణముగాఁ గర్మము లుండును. ఒకదానితో మఱియొక దానికి సంబంధ ముండనేరదు.

కాని యాజన్మాంత మా విభేద ముండఁజాలదు. కాలానుగుణముగాఁ బరిణామ మొందెనేని భేదరహిత మొందుట కేయాక్షేపణము నుండఁజాలదు. మనవారు సాధారణముగా "నరునకు నాలుగవస్థలు" అను సామెత వాడుచుందురు. దానికి బాల్యాదిచతుర్దశలని సాధారణాన్వయము చెప్పుకొందుము. కాని మన భారతభూమియందుఁ బ్రతివిషయము, ఆధ్యాత్మికభావముతో నిండి నిబిడీకృతమైయున్నది. బాగుగా నాలోచించిన యీ యర్థమే పై వాక్యములో స్ఫురించును. ఏదియన శూద్ర, వైశ్య, క్షత్రియ, బ్రాహ్మణభావము లొకదానివెనుక నొకటి కలుగఁజేసికొనవలయును. అట్లు ప్రయత్నించుచుండే మానవ

ధర్మము. ఈ నాలుగువిధములు కలిసినఁగాని సరియగు మానవత్వము సిద్ధింపనేరదు. ఇందేది లోపించినను బ్రకృతివిరుద్ధమే. బ్రాహ్మణుఁడనువానికి తక్కిన మూడుభావములు వశమయియుండును. అనగా సర్వసముఁడనియు, సర్వస్వతంత్రుఁడనియు, గుణాతీతుఁడనియు భావము. "బ్రహ్మజ్ఞానేన బ్రాహ్మణాః" అను శాస్త్రార్థభావ మిదియే. అతఁడే పండితుఁడు.

గీతాశాస్త్రము సర్వదా సమత్వసిద్ధాంతములకు నిలయమై, యమూల్యభావములతో విరాజిల్లుచున్నది. మహోత్కృష్టము లగు గీతాసిద్ధాంతములు, ఊహాపోహములచే నిర్మింపఁబడినవిగావు. ఆకాశసౌధనిర్మాణములుగావు. ఏమియు లేని శూన్యమునుండి సృష్టింపఁబడినవి గావు. బుద్ధికుశలతచే పాండిత్యప్రకర్షకై చిలువలుపలువలుగా నల్లఁబడినవి గావు. బహువిధములుగాఁ గానుపించినను ఏకసూత్రనిబద్ధితమగు రత్నహారము. నిర్మలవేదాంతముకొఱకు ప్రవర్తింపఁబడినది. క్రమక్రమముగా దివ్యత్వము ప్రసాదించును. అనుభవము, అద్వైతము, యథార్థము, శాశ్వతము, ఆత్మైకవేద్యము. బ్రహ్మవిద్యాంతర్గతము, ఉపనిషత్సారము, గంభీరమగు విశాల పవిత్రహృదయకుహరమునుండి సకాలమున ననర్గళముగా స్రవించిన విశిష్టభావసుధాప్రవాహము.

భగవంతుఁడగు శ్రీ కృష్ణపరమాత్మునిచే గానము సేయఁబడుటచే దీనిని భగవద్గీతయని చెప్పఁబడియెను. ధర్మమునకు గ్లానియు, అధర్మమున కభివృద్ధియుఁ గలిగినప్పుడు భగవదవతారములు గలుగుచుండును.

"యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత
అభ్యుత్థానమధర్మస్య తదాత్మానం సృజామ్యహం"

అట్టులవతరించి చేయుకార్య మీవిధముగా నిర్వచింపఁ బడెను.

"పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే"

"దుర్మార్గులను వినాశ మొనరించి సన్మార్గులను రక్షించుకొఱకు ధర్మము సంస్థాపించుకొఱకు నేను ప్రతియుగమందు పుట్టుచున్నాను." లోకోత్తరము యుగాతీతమునగు శక్తిసామర్థ్యము లెవనియందు మూర్తీభవించి యుండునో యాతఁడే భగవంతుఁడు, అవతారపురుషుఁడు. భగవంతుఁ డనఁగా నర్థమిట్లు నిర్వచింపఁబడెను.

"ఐశ్వర్యస్య సమగ్రస్య వీర్యస్య యశసశ్శ్రియః
వైరాగ్యస్యాథ మోక్షస్య షణ్ణాం భగ ఇతీరణా" (విష్ణుపురాణము)

"భగమనఁగా నైశ్వర్య ధర్మ కీర్తి శ్రీ జ్ఞాన వైరాగ్య మోక్షములు. ఇవికలవాఁడు భగవంతుఁడు."

"ఉత్పత్తిం ప్రళయం చైవ భూతానామాగతిం గతిం
వేత్తి విద్యా మవిద్యాం చ స వాచ్యో భగవానితి" (విష్ణు)

"భూతములపుట్టుకను నాశమును రాఁబోయెడిసంపదాసంపదలను జ్ఞానాజ్ఞానములను నెవ్వఁ డెఱుంగునో వాఁడే భగవంతుఁ డనఁబడఁదగువాఁడు"

ఈపూర్వోక్తలక్షణములుగలవాఁడే యవతారపురుషుఁడు. వానినే మనము పూజించుచున్నాము. ఆతఁడే యాదర్శపురుషుఁడు. ఆమహావ్యక్తిపవిత్రవాక్యములే పరమప్రమాణ

ములు అంతియేగాని సర్వదేహులు నవతారములుగాఁ బరిగ ణింపఁబడవు. లోకకల్యాణముఁ గలుగఁజేయు సామర్థ్య మెద్దాని యందుఁ గలదో యదియే పూజార్హము.

ఇట్టి యవతారము లనేకములని భాగవతాదిగ్రంథ ములయందుఁ బేర్కొనఁబడినది. అందు దశావతారములు విపులముగా వర్ణింపఁబడినవి. అందు రామకృష్ణావతారములు ప్రశస్తములు. అందుఁ గృష్ణావతారము మనదేశమునందేగాక సర్వదేశములయందుఁ గూడ సార్వభౌమపీఠము నలంకరిం చినదనిన నతిశయోక్తి గాదు. కారణ మేమియన? వ్యక్త సృష్టియందు పరాత్పరుని యనంతకళలయందు పదునాఱు కళలు మాత్రమే గలవు. వృక్షాదులందు నొక కళయును, తిర్యక్కులయందు నాలుగు కళలును, మనుజులయం దయిదు మొదలు తొమ్మిదివరకు, అవతారములయందు తొమ్మిదిమొదలు పదునాఱువరకు నుండును. అట్టిషోడశకళా పరిపూర్ణమగునది కృష్ణావతార మొకటియే. "పుంసః కృష్ణస్తు భగవాన్ స్వయం" తక్కినవి యంశావతారములు. పరిపూర్ణా వతారమగు శ్రీకృష్ణభగవానునిచే గానము చేయఁబడినది గాన గీతలకు "శ్రీమద్భగవద్గీతలు" అనునామము సార్థకము కాని పెట్టుపేరు గాదు. ఈ మహావ్యక్తిగుణవిలాసము లత్యద్భుత ములు. ఈతఁ డొకేసమయమున లోకోత్తర సన్యాసిగాను, గృహస్థుఁడుగాను వర్తించినాఁడు. అతనియందు సర్వలోకము లను బాలింపఁగల యధికారశక్తి నెలకొనియున్నను అత్య ద్భుతవైరాగ్యమునకు నిలయమైయుండెను. ఆ మహనీయుని

బోధల కాతఁడే యనుష్ఠాత. ఆ గీతల కాతనిచరిత్రమే వ్యాఖ్యానము. గీత స్వీయానుభవపూర్వకమగుధర్మగ్రంథము గాని సూత్రగ్రంథముకాదు.

కర్మము చేయుటయా? లేక మానుటయా? ఇందెద్ది శ్రేయము? అనువిషయముమీదనే గీతాశాస్త్రము చెప్పఁబడినది. గీతాకాలమున ననేకమతము లున్నట్లు కనుపించుచున్నది. "మయిసర్వమిదంప్రోతం సూత్రేమణిగణాఇవ" (మణులయందలి దారమువలె నన్నిటియందును నే నుంటని) అని గీత నుడువు చున్నది. ఇందు జ్ఞానకర్మమార్గములు ప్రధానములు (ప్రవృత్తి నివృత్తి మార్గములు). వైదికుల (పూర్వమీమాంసకుల) శ్రౌత, స్మార్తకర్మాచరణము శాస్త్రవిహితమైనను నందు సంపూర్ణ జ్ఞానవికాసము లేదు. జ్ఞానములేని తాంత్రికక్రియా కలాపముచే బుద్ధిమంతునకు సమాధానముకానేరదు. ఆయజ్ఞ యాగాదులైనను నశాశ్వత సుఖమే (పునరావృత్తి) గాని శాశ్వతసుఖ మొసంగఁజాలవు.

"ప్రాప్యాంతం కర్మణ స్తస్య యత్కించేహ కరోత్యయమ్
తస్మాల్లోకాత్పునరేత స్మై లోకాయ కరణే."

"ఇహలోకమునం దొనరించు యజ్ఞయాగాది క్రియా ఫలము స్వర్గాదిభోగములచేఁబరిసమాప్తినందును. యజ్ఞమొన రించు ప్రాణి స్వర్గలోకమునుండి మఱలఁగర్మలోకమునకు రావల సినవాఁడగును. తాత్కాలికములగు స్వర్గాదిభోగములతో జ్ఞాని సంతృప్తి నందఁజాలఁడు. ఇట్టి అశాశ్వత సుఖము లాత్మ శ్రేయ మొసంగఁ జాలవు.

"శ్రేయశ్చ ప్రేయశ్చ మేతస్తౌ సంపరీత్య వివినక్తి ధీరః
శ్రేయోహి ధీరోఽభి ప్రేయసో వృణీతే, ప్రేయోమందో యోగ క్షేమాద్వృణీతే
(కఠోపనిషత్)

"ప్రేయము (తాత్కాలికసుఖము) శ్రేయము (శాశ్వత సుఖము) అనునవి రెండు మనుష్యుని నెదుర్కొనెనేని జాగ్రత గలవాఁడు శ్రేయమునే గ్రహించును. మూర్ఖునకు శ్రేయము కంటె ప్రేయమే యెక్కువగును" మోక్షము లేని సుఖ మెంత యున్నను బంధ హేతువే గదా?

ఇంక నుపనిషన్మార్గము (ఉత్తరమీమాంసకుల నివృత్తి మార్గము) కేవలజ్ఞానగమ్యమగుటచే సామాన్యులకుఁ జొచ్చరానిది. మీఁదుమిక్కిలి యిందలి సన్న్యాసీయమార్గము లోకసంగ్రహామునకువ్యతిరేకము, ప్రేమశూన్యము. ప్రేమ లేని జ్ఞానము లోకకల్యాణమునకు సహకారికానేరదు. విశ్వమానవసౌభ్రాతృత్వము నెలకొల్పఁజాలదు. కావున వైదికమతమందలి కర్మపద్ధతిని, ఉపనిషన్మతమునందలి సన్న్యాసీయపద్ధతిని, రెండిటిని గీతాకారుఁడు సవిమర్శముగాఁ దరచి కర్మము లోకసంగ్రహామునందును, సన్న్యాసము కర్మఫలమునందును నియోగించి, సనాతన ధర్మమార్గమునకు లోపము రాకుండ యీ రెండువిధానములకు సమరసభావముఁ బొందించి భక్తితోఁ జేర్చి "కర్మఫల సన్న్యాసము, (నిష్కామయోగము) మోక్ష వ్యతిరిక్తము గాకుండ లోక వ్యవహారమున కడ్డుదగులకుండ నార్యసాంప్రదాయము పురాతనాచారము నగు కర్మయోగమునే గీతాశాస్త్రమునందు వచించెను.

ధర్మాధర్మవిమూఢుఁడై విషాదావస్థకులోనైన యర్జును నకు భగవానుఁ డిట్లు బోధించెను. కర్మములను సన్యసించుట సాధ్య మేరికిని గాదు. కర్మము లాచరింపకుండ జీవించుటయే దుస్తరము. ఎంతవరకు శరీరధారియై యుండునో యంతవరకు ప్రకృతియే కర్మములను జేయించును. మనపుట్టుకతోనే కర్మములువచ్చినవి. యజ్ఞములు ప్రజలు నొకేసారి సృష్టింపఁబడిరి. కర్మమాచరింపక యజ్ఞము సిద్ధముకానేరదు. కర్మ మనఁగా యజ్ఞమేగాని యన్యముగాదు. పూర్వమందు జనకాదులీభావముతోనే కర్మయోగ మాచరించిరి.

"ఇమం వివస్వతే యోగం ప్రోక్తవానహమవ్యయం
వివస్వాన్ మనవే ప్రాహ మనురిక్ష్వాకవేఽబ్రవీత్"

"అవ్యయమైన యీ యోగమును సూర్యునకు నుపదేశించితిని. ఆసూర్యుఁడు తనకుమారుఁడైన వైవస్వత మనువునకుపదేశించెను. ఆతఁ డిక్ష్వాకున కుపదేశించెను."

"ఏవం పరంపరాప్రాప్త మిమం రాజర్షయో విదుః
స కాలేనేహ మహతా యోగో నష్టః పరంతప."

"ఈవిధముగా పరంపరగా నుపదేశింపఁబడినయీ యోగ విద్య చాలకాలమగుటచే లోకమున నశించెను. కావున సనాతనము శిష్టాచారమునగు కర్మయోగమునే నీవు శరణము నందుము. నిష్కామబుద్ధితోఁ గర్మము లొనరించుటయే మనుజుని కర్తవ్యము. లోకసంగ్రహార్థమై స్వధర్మము కర్తవ్యము నను భావముతోఁ గర్మలొనరించు టావశ్యకము. అట్టికర్మములు మోక్షమునకుఁ బ్రతిబంధకములు గానేరవు. కామక్రోధాది

వికారములు మనస్సును చెఱచివైచును. మనోనిగ్రహము లేకున్న సమత్వబుద్ధి యలవడనేరదు. శాంతి దొరకదు.

"మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః
బంధాయ విషయాసంగి మోక్షే నిర్విషయం స్మృతం"
(మైత్ర్యుపనిషత్)

"మనుష్యుల బంధమోక్షములకు మనస్సే కారణము. మనస్సు విషయాసక్తమైన బంధముగలుగును. నిర్విషయమైన మోక్షము గలుగును." కావున మనమును స్వాధీనపరచుకొని నిష్కాముఁడవై సర్వకర్మముల నాకు సమర్పింపుము. నాకీముల్లోకములయందుఁ బొందఁదగినది లేకున్నను లోకసంగ్రహముకొఱకు నుద్భవించి కర్మమునఁ బ్రవర్తించుచున్నాను. యజ్ఞముకొఱకు చేయు కర్మము బంధహేతువు కానేరదు.

గీతాశాస్త్రమునఁ జెప్పఁబడిన యజ్ఞము మన మిప్పుడు జేయునట్టి స్వార్థము పరపీడాకర మగునట్టి తాంత్రికము గాదు. ఇది కేవలము రజోగుణపూరితము, ఆసురము నని గీతాభావము. మనశరీరము యజ్ఞముకొఱకుఁ బుట్టుచున్నది. యజ్ఞ మనఁగా విశ్వకల్యాణ మొనరించుటయని భావము. మనము లోకమునకు ఋణపడియుంటిమి. ఆ ఋణవిముక్తి నందుటకే లోకసేవ నొనరింపవలయును. అదియే కర్తవ్యము. ఆత్మ్యాగమే విశ్వకల్యాణహేతుభూతము. యజ్ఞము పరస్పర సంబంధముఁ దెలుపుచున్నది. "స్వార్థముకొఱకు వండుకొనువాఁడు పాపుఁడు. అట్టి పాపుఁడు పాపమునే భుజింపుచున్నాఁడు" అని గీత బోధింపుచున్నది.

"బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే" అని గద్యము నందుఁ జెప్పినటుల గీతలయం దంతటను బ్రహ్మవిద్యాంతర్గత మగు యోగశాస్త్రమే (కర్మయోగము) బోధింపఁబడినది. పరాపరము లన నేమి? తదీయ సంబంధ మేమి? ఆదియం దేతత్త్వముండెను? నాకు వానికిఁగల సంబంధ మేమి? జగదతీతమగు పదార్థమును నే నెట్లు పొందఁగలను? అను విషయముల సూక్ష్మదృష్టితో విమర్శించి వర్తించుటే వేదాంత శాస్త్రము. వాస్తవ మాలోచించిన మానవజీవిత రహస్య తత్త్వమే వేదాంతశాస్త్రమని తోచును. ఇహపరములు రెండును మనుజున కనుసరణయోగ్యములే. ఈ రెండింటికి నవినాభావ సంబంధము. ఒకటి విడిచి వేరొకటి యుండదు. గీతలయందు నీ రెండిటికి ప్రతిబంధకము లేకుండ సంబంధముఁ గల్పించు టయే గాక శ్రద్ధామూలకమగు భాగవతధర్మవివేచన జేసి జీవితము యజ్ఞమయము, ప్రేమమయముగాఁజేయుటచే గీతలు మన సనాతన వైదికశాస్త్రము లన్నింటిలో నుత్తమోత్త మము ప్రమాణము నై యున్నవి.

విషమావస్థయందు నయితముఁ జలింపని సామ్యబుద్ధినే కర్మయోగమునందు శరణమందవలయును. భక్తిజ్ఞానయుక్త మగు విశుద్ధపరిపూర్ణబుద్ధియే సత్యమునకు సత్ప్రవర్తన, సదా చారములకు శాణోత్తేజనము. ప్రాప్తములగు కర్మముల పరమేశ్వ రార్పణ (నిష్కామముగా) పూర్వకముగా కర్తవ్యములని చేయుటకే మానవుఁడు జన్మించెనుగాని కేవల సుఖోపభోగ ములకుఁ గాదు. సర్వభూతహితకర్మముల నాచరించుటే ఆత్మ శ్రేయము.

"అపహాయ నిజం కర్మ "కృష్ణకృష్ణేతి"వాదినః
తే హరేర్ద్వేషిణః పాపాః ధర్మార్థజన్మయద్ధరే"
(విష్ణుపురాణము)

స్వకీయమగు కర్మములను జేయక "కృష్ణకృష్ణ"యనుచుఁ గూర్చొనువారు హరికి ద్వేషులు పాపులు నగుదురు. ఏలయన హరి యవతారమైన ధర్మము నుద్ధరించుట కేగదా?

జ్ఞానమునకుఁ గర్మమునకు విరోధములేదు. జ్ఞానప్రాప్తిగలిగిన పిమ్మటఁ గర్మమును ద్యజింపవలయుననునది క్లిష్టాతిక్లిష్టము, లోకసంగ్రహవ్యతిరేకము. అట్లు త్యజించిననేగాని మోక్షము గలుగదనుట సాహసము. వాసనాక్షయమైనను జ్ఞాని పరమేశ్వరార్పణముగా విశ్వకశ్రేయముకొఱకు గర్తవ్యమను తలంపుతోఁ గర్మముల నొనరింపవలయునుగాని యుదాసీనుఁడైయుండరాదు. ఇదియే యుత్తమోత్తమమని గీతామతము. కర్మఫలత్యాగమే సన్యాసము. సన్యాసమన "నాకు దేనితోను సంబంధము లేదు" అని ముక్కుమూసుకొని యడవులలోఁ గూర్చుండుటగాదు. తన తోడిజీవులు సర్వకష్టములకు లోనై పరితపించుచుండఁ బ్రేమరహితుఁడై చూచుచుండుటగాదు. సన్యాసీయభావముతో మన జీవిత మామూలాగ్రము నిండియున్నది. నేను లోకము కొఱకు జీవింపుచుంటిని. విశ్వభూత హితమునకు జీవితము హెచ్చించి యనిర్వచనీయమగు శాంతిఁ బొందుటయే కర్తవ్యమని తలంచుటయే సరియగు సన్యాసము. అదియే మానవుని సంపూర్ణత్వము, దేవత్వము. అదియే ప్రశాంతి, ఆనందము, మోక్షము.

గీతాశాస్త్రము సర్వులకు నొక్కవిధముననే సద్గతి నిచ్చునది, అన్యధర్మములయెడ సహనముఁ జూపి తనలో నిముడ్చుకొనునదిగాని వేఱుసేయునదిగాదు.

"మాం హి పార్థ వ్యపాశ్రిత్య యేఽపి స్యుః పాపయోనయః
స్త్రియో వైశ్యాస్తథా శూద్రాస్తేఽపి యాంతి పరాం గతిమ్"

"అర్జునా! నన్నాశ్రయించిన స్త్రీలును, వైశ్యులును, శూద్రులును, నీచయోనిసంభవులు నయితము పరగతినిఁ బొందుచున్నారు.

"న బుద్ధిభేదం జనయేదజ్ఞానాం కర్మసంగినామ్
జోషయేత్సర్వకర్మాణి విద్వాన్ యుక్తస్సమాచరన్"

"కర్మసంగులగు అజ్ఞానుల బుద్ధిని జ్ఞానులు చలింపఁజేయరాదు. తమకు ఫలాసక్తి లేకున్నను గర్మములఁ జేయుచు వారిచేఁ జేయింపవలయును.

గీతాశాస్త్రము విషాదయోగముతోఁ బ్రారంభింపఁబడి మోక్షసన్న్యాస యోగముతోఁ బరిసమాప్తి జేయఁబడినది. అనఁగాఁ బ్రథమావస్థనుండి సంపూర్ణత్వము నొందు వరకుఁ దెలుపఁబడినది. విషాదముతో జన్మ ప్రారంభమగును. ఆవిషాదమునుండి పరమాత్మను పొందుటయే దేహికర్తవ్యము. ఇదియే జీవితవ్యవస్థ. ఇదియే వేదాంతము. ఈ తత్వమునే కర్మయోగముతో సంపుటీకరించి తెల్పఁబడినది. ఎట్టికర్మఁ జేయవలెనో? ఎట్టి భావముతోఁ జేయవలెనో! ఇందు నిరూపించినట్లు మన ప్రాచీన వాఙ్మయమునం దెచ్చటను నిరూపింపఁబడలేదు. ఇదియే "నిష్కామకర్మము,

ఇదియే విశిష్టము,ముఖ్యమునగు సన్యాసము” అని గీతాకారుఁడు నిర్భయముగాఁ దెల్పినాడు. త్రివిధత్యాగములలో కర్మఫల త్యాగమే మహోత్కృష్టమని గీతాసిద్ధాంతము.

"న హి దేహభృతా శక్యం త్యక్తుం కర్మాణ్యశేషతః
యస్తు కర్మఫలత్యాగీ స త్యాగీత్యభిధీయతే."

"దేహధారికి కర్మముల సాంగముగా విడుచుటకు సాధ్యముగాదు. కర్మఫలమును విడచువాఁడే త్యాగియని చెప్పఁబడుచున్నాఁడు."

ఉపనిషత్తుల జ్ఞానము భక్తి యుపాసనయు రాజగుహ్యముతోఁ జేర్చి కర్మకాండము ప్రాచీనపరంరానుసారముగా వచించెను. ఉపనిషత్తులు వేఱ్వేఱుకాలములందు నిర్మింపఁబడుటచే కొంత మతభేదము సూచింపుచున్నవి. వానియేకత్వమునకే సూత్రములు ప్రయత్నించినవిగాని వైదికతత్వమును ప్రతిపాదింపలేదు. ఉపనిషన్మార్గీయులకంటె వైదికతత్వమార్గీయులే మనభారతభూమియందు ప్రాచీనకాలమునుండి యెక్కుడుఁగా గలరు. పౌరాణిక మహాపురుషు లెల్లరు కర్మయోగమార్గావలంబకులే. పురాణములయందు వైదిక తత్వముల్లేఖింపఁబడినను నంత సలక్షణముగా లేదు. వేదాంతశాస్త్రమున కంత సన్నిహితముగాను లేదు. అందుచేతనే భగవానుఁడు "రాజఋషు లెఱింగిన యీసనాతన విద్య చాలకాలమగుటచే నశించె"నని తెలిపెను. ఆ జీర్ణావస్థనొందిన శిష్టానుమోదితమగు పవిత్రకర్మయోగశాస్త్రమునే ప్రవృత్తినివృత్తిమార్గ

ముల రెండిటిని భక్తిరసముతోఁ గలపి సర్వాంగ సౌష్ఠవముగా శ్రీకృష్ణభగవానుఁ డొనరించెను.

కావున, మహాశయులారా! సమస్తసనాతన వైదికశాస్త్రమహావృక్ష మధురఫలసారమై, శాశ్వతమై, సర్వసామ్యమై, సకలజనశరణ్యమై, అఖిలబంధ విచ్ఛేదమై, స్వాతంత్ర్య మార్గదర్శకమై విరాజిల్లు గీతామృతపాన మొనరించుచు వైషమ్యములవీడి యెల్లపుడు సర్వభూతహితార్థమై కర్తవ్యములని కర్మము లొనరించుటయే మనవిధి. అట్టిమహాత్ము లుద్భవించిననాడే మనప్రాచీనభారతగౌరవము పునరుద్ధరింపఁబడఁగలదు. గీతాధర్మమే పృథగ్భావముల నశింపఁజేసి యెల్లర నేకమార్గమున నడిపింపఁగల మహామంత్రరాజము. భక్తిజ్ఞాన కర్మములకు నేకత్వమొనరించి విశ్వమానవ సౌభ్రాతృత్వమును బెంపొందించు గీతాధర్మము శరణమంది కర్మవీరులై భారతభూమి విజ్ఞానభాండారప్రాచీన యశఃకాంతుల దిగంతముల వెలయించు మహాపురుషులు మన మాతృభూమిని జన్మింతురు గాత! భారతమాతభావదాస్యాంధకారము పటాపంచలు జేతురుగాత!

ఓం తత్ సత్.

15—10—1936.
ఈమని, (గుంటూరు)

ఇట్లు,
గ్రంథకర్త.

# కృతికర్తవంశాభివర్ణనము

తెలుఁగువీటికి నిండువెలుఁగును వెలయించి
విలువనాటినవారు తెలగవారు
అరివర్గములఁ గూల్చి పరదుర్గముల గెల్చి
కలన నిల్చినవారు తెలగవారు
రాజ్యాంగవేత్తలై రాష్ట్రాధినేతలై
యలరఁ జాలినవారు తెలగవారు
ప్రజకు జీవికఁ జూపఁ బసులగాసిని బాప
హాలముఁ బూనినవారు తెలగవారు
చెలిమి బలిమినిఁ గలవారు తెలగవారు
లట్టిజోదులు తెల్గునాయకులలోన
జనకజాహ్వాయగోత్రసంజాతసుప్ర
శస్తచరితులు శ్రీకాళహస్తివారు.

శ్రీకాళహస్తిదివ్య
ప్రాకారములందు దేవభవనములందున్
జేకూర్చిన శిల్పపు వి
ద్యాకౌశలతన్ దదాఖ్య నన్వయ మొప్పెన్.

ధరణి గుంటూరిమండలాంతర్గతమ్ము
స్థిరనివాసమ్ము మంగళగిరిపురమ్ము
గాగ నాడును; ఈమనిగాగ నేడు
కాళహస్తిసదన్వయుల్ గలరు, తమకు
హృద్యమా శిల్ప మభిమానవిద్యగాగ.

వారిలోఁ బ్రముఖుండు బలరామయాఖ్యుండు
తలప నెవ్వని ప్రపితామహుండు
లలితవర్తనుఁడైన లక్ష్మీనృసింహుండు
ధర్మజ్ఞుఁ డెవనిపితామహుండు
ఒప్పులకుప్పయౌ నప్పమాంబాసాధ్వి
జ్ఞానంపుదివ్వె యెవ్వానియవ్వ
శిల్పశాస్త్రజ్ఞుఁడై శేముషీధనుఁడైన
తిరుపతిరాయఁ డేధీరుతండ్రి
సుతరత్ననికురుంబ సతి రత్నమాంబిక
పావనచరిత యెవ్వానిజనని
ఘనులు శ్రీనాగభూష ప్రకాశు లనఁగ
బ్రబలి రేధన్యునకు సోదరద్వయంబు
తన్వి దుర్గాంబ యెవ్వానిధర్మపత్ని
చెలఁగు నతఁడు వేంకటనరసింహసుకవి.

తనమేధాగరిమంబుచే సకలశాస్త్రజ్ఞానసంపత్తిచేఁ
దన లౌక్యప్రతిభావిశేషణముచే దైవజ్ఞవిఖ్యాతిచేఁ
దన సద్వర్తనచే యశంబుఁగొని విద్వద్వంద్యుఁడైనట్టిత
జ్జనకుల్ దిర్పతిరాట్సుధీ సరసవాచాభిజ్ఞుఁ గీర్తించెదన్.
శ్రీలక్ష్మి యనఁజెల్లు శ్రీకరసత్కళా
సారశ్శోభిత వనజాతయగుట
భూదేవియన నొప్పు భూరిశాంతతకల్మి
శ్రీనారసింహునిచెలువయగుట
వాగ్దేవియనఁదగు ప్రజ్ఞానిదానమై
ప్రకటితవిద్యాలవాలయగుట

జగదంబ నాఁ జెల్లు సత్సతీత్వఖ్యాతి
యతిగణప్రియున కర్ధాంగియగుట
సర్వశుభలక్షణాంచిత సత్కళత్రి
భవ్యశృంగారగాత్రి పావనచరిత్రి
ఘనగుణకదంబ యొప్పు దుర్గాంబయనఁగ
కాళహస్తినృసింహరాట్కవివధూటి.

పదునాలుగేడుల ప్రాయంబుననె పూని
పలికెను వైదర్భిపరిణయంబు
పలువురు పండితుల్ భళియని గొనియాడ
తాఁ జల్పె నష్టావధాన సభల
విద్వాంసు లర్పింప వేడ్కఁజేకొనె "నాంధ్రి
బాల సరస్వతీ" ప్రౌఢబిరుదు
ఇద్ధమై పత్యుత హేలాపురీసభఁ
గైకొనె ఘంటికాకంకణంబు
అమృత మొలుకంగఁ బద్యపద్యంబునందు
భక్తిమై గీత తెన్గుకబ్బంబొనర్చి
చూఱఁగొనియెను శాశ్వతశోభనముల
శిష్టజనగేయుఁడై నరసింహసుకవి.

తెనుఁగుందోటలఁ బూవుఁదేనియలఁ బ్రీతిన్ గ్రోలి మత్తిల్లి తీయనిగీతాల కవిప్రపంచమున కాహ్లాదమ్ము గీలించి న ర్తనముల్ సల్పు నృసింహభృంగమధులిప్తంబైన గీతావళుల్ ఘనమై శాశ్వతమై వినిర్మలయశఃకాంతిన్ విడంబించుతన్.

వడలి, పశ్చిమగోదావరి.
10—10—1936.

ఇట్లు, అష్టావధాని,
మంచం బుచ్చిలింగప్ప కవి.

# OPINIONS

---

CATTAMANCHI RAMALINGA REDDY GARU, M. A.,
Vice-Chancellor, Andhra University,
WALTAIR.

Dear Sir,

I just glanced through your book, and find it a capable and useful translation.

Yours sincerely,
15th Sept. 1936 (Sd.) C. R. REDDY.

DR. VEMURI RAMAKRISHNA RAO GARU,
M. A., L. T., PHD.
Retired Principal, P. R. College,
Cocanada,

Dear Sir,

Allow me to convey to you my sincere thanks for the kind presentation of a welcome copy of your Gitanuvadam, a valuable labour of love so commendably accomplished.

I hope shortly to benefit by its close perusal.

With hearty congratulations,

I am,
Yours sincerely,
MASULIPATAM, 23—9—1936 (Sd.) V. RAMAKRISHNA RAO.

Y. KAMESWARA RAO GARU, B. A., B. Ed.,
Head Master, J. K. Middle School,
PENUGONDA, West Godavari District.

I had the greatest pleasure of going through 'Gitanuvadam' a Telugu verse rendering of Bhagavadgita by Astavadhani Kalahasti Venkata Narasimha Rao Naidu Garu. The simplicity and clearness of expression and the dignity and magnificence of style make it a production of great literary art. The Andhra public are much indebted to the author for this invaluable addition to the Andhra Literature. My sincerest hope is that the powers that be will take it into their minds to prescribe this as a text book for religious and moral instruction in schools.

May the author and patron be blessed with eternal bliss.

D/10-10-1936. (Sd.) Y. KAMESWARA RAO.

# పండితాభిప్రాయములు

బ్రహ్మశ్రీ కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు
మహారాజరాజశ్రీ ఆంధ్రబాలసరస్వతి, అష్టావధాని,
కాళహస్తి వేంకట నరసింహారావు కవిగారు.

తాము రచించిన "శ్రీమద్భగవద్గీతానువాద" మను గ్రంథమును చదివి పెక్కుపద్యములు వినిపించినారు. వీరు లోగడ "మిలన్" అను హిందీ గ్రంథమునకు ఆంధ్రానువాదము చేసియున్నారనియు, అష్టావధానము చేయు శక్తి గలవారనియు వినియుంటిని. వీరి భగవద్గీతానువాదము మిక్కిలి చక్కగానున్నది. చతుర్విధ కవిత్వములలో నెట్టికవిత్వమైనను చేయవచ్చును గాని, అనువాదము చేయుట మిక్కిలి కష్టము. అందు గీతల కనువాదము చేయుట మిక్కిలి కష్టతరమని స్వానుభవముంబట్టి చెప్పుచున్నాను. వీ రీయనువాదమును ఐదుమాసములలో పూర్తిచేసియున్నట్లు చెప్పుచున్నారు. గడియకు నూరుపద్యములు చెప్పఁగలనను నేను ఈ గీతలు తెలిగించునప్పుడు దినమున కొండురెండుపద్యములకన్న నధికముగాఁ జేయఁజాలక పోయితిని. కాలమంతయు మతత్రయభాష్యములు చూచుటతోనె సరిపడుచువచ్చినది. కావున గీతలు తెలిగించుటలో నుండుకష్టము నాకుఁ దెలిసినది.

ఈయనువాదము పాఠకులకు సుబోధకముగా నున్నది. పద్యము చదువునంతనే తాత్పర్యము బోధపడుచున్నది. వీరు ప్రమాణకవుల మతే మంగీకరించిన గ్రాంథికవాదులు. వీరికవిత్వములో నొండురెండుపదములు తక్క నెక్కడను గ్రామ్యవాదులకు చోటుండదు. పద్యములు ధారాశుద్ధి గలిగి నిర్దుష్టములై యున్నవి. శైలి మనోహరము.

ఇట్టి పరమపవిత్రగ్రంథమును కృతినొందిన మ. రా. రా. శ్రీ జవ్వాది లక్ష్మయ్యనాయుఁడుగారు ధన్యాత్ములు. దీనంజేసివారిజన్మము పవిత్రమైన దియు, వారిపూర్వులును బుణ్యలోకంబులంది శాశ్వతానంద మనుభవించి నట్టివారైరనియు, మనవిచేయుచున్నాను.

(ద) శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి,
రాజమహేంద్రవరం.
29—9—36.

మ. రా. రా. శ్రీ జటావల్లభుల పురుషోత్తముగారు ఎం. ఏ.
(ప్రిన్సిపాల్ సంస్కృత కళాశాల)

మహారాజశ్రీ కాళహస్తి వేంకట నర
సింహారావుగారికి నమస్కారములు.

ఆర్య!

మీరు దయతోఁ బంపిన "శ్రీమద్భగవద్గీతానువాదము" ను జదివి మిక్కిలి యానందించితిని. మీ యనువాదము మూలములోని భావములను జక్కఁగ వ్యక్తపఱచుచున్నది. అట్లుండియు స్వతంత్ర రచనవలెనే ధారాళముగా నున్నది. పద్యములకుఁ బైన మూలశ్లోకములనుగూడ మీరు ముద్రింపించుట హర్షింపఁదగినవిషయము. మీరు మహావిషయములను సామాన్యులకుఁగూడ సులభముగ నర్థమగు విధమునఁ దెల్పియున్నారు. భాష నిర్దుష్టముగా నుండుటయేకాక ముద్దులు మూటఁగట్టుచున్నది. ఇట్టి పవిత్రకార్యమునకు మీ కవితాశక్తి నుపయోగించినందులకు మిమ్ముల నభినందించుచున్నాను. ఆంధ్రాళి మీ గ్రంథమును దప్పక యాదరించునని నమ్ముచున్నాను.

చిత్తగింపుడు,

(ద) జటావల్లభుల పురుషోత్తం, ఎం. ఏ.
కొవ్వూరు పశ్చిమగోదావరి.

బ్రహ్మశ్రీ విద్వత్కవి కలువలపల్లి రంగనాథశాస్త్రిగారు

తెలుఁగొనరించె గీతలకుఁ దేటగ మూలములోని తత్త్వ మ
జ్ఞులకును గోచరించుగతి నూరులకున్ వెలుఁగావహిల్లగన్
వలఁతి మహాత్ముఁ డొప్పుగను వ్రాసిన వ్యాఖ్యకరంబు బాసపై
చెలఁగె నృసింహరావునకుఁ జెప్పగ నేటికి? వేయుమాటలన్.

పటుకవితాప్రవీణుఁడని వ్రాసిగడించిన కాళహస్తి వేం
కటనరసింహరావు బుధగణ్యకృతుల్ రచియించు దిట్టయై
యిటులె రసజ్ఞనాయకుల నేఁటియుఁ గోరియుఁ గావ్యకన్యని
చ్చుటకుఁ గడంగుఁగాక; సరసుల్ బళిరా యని తన్ను మెచ్చగన్.

(ద) కలువలపల్లి రంగనాథశాస్త్రి, ఏలూరు.
8—9—36.

## బ్రహ్మశ్రీ అష్టావధాని మంచం బుచ్చిలింగప్పకవిగారు

ఘంటాకంకణకింకిణీమృదులనిక్వాణంబు రంజిల్లఁగన్
కుంటున్వారని సున్నితంపు నడలన్ గొంగొత్తలన్ జూపి ఒల్
దంటల్ సత్కవులెల్ల మేలనఁగ గీతాగానమున్ సేయు వా
ల్గంటిన్ బాలనృసింహభారతిని వేడ్కన్ ధాత కాపాడుతన్.

వ్యర్థశబ్దంబులేక నన్వయముఁ జెడక
శిష్టలౌనని మెచ్చ నిర్దుష్టఫణితి
దీపటిమఁ జూపి గీత లాంధ్రీకరించె
కాళహస్తి నృసింహరాట్కవివరుండు.

అమలచరితుండు కృతిపతి యగుటఁజేసి
ఉత్తమంబయ్యె కావ్య ముదాత్తసరణి
కర్త నరసింహు భర్త లక్ష్మియను సతము
పార్థసారథి కృపను కాపాడుగాత.

10—10—36,
వడలి,
పశ్చిమగోదావరి.

ఇట్లు,
(ద) మంచం బుచ్చిలింగప్పకవి.

## మంగిపూడి వేంకటశర్మకవిగారు

మహారాజశ్రీ కాళహస్తి వేంకటనర
సింహారావుగారి సముఖమునకు.

మహాశయా!

మీరు రచియించిన "గీతానువాదము" ఆనందముతో నందుకొని పఠించితిని. మీయుత్సాహము, మీకు ఆధ్యాత్మికవిషయములయందుఁగల ఆసక్తియు, శ్లాఘ్యములు. ఇందుకు మిమ్మభినందించుచున్నాను.

ఐహికాముష్మికధర్మదర్పణమగు భగవద్గీతాశాస్త్రమును ఎందరెన్ని విధముల వెలయించినను చాలదు. మీరు మహత్తరమైన శ్రీగీతాశాస్త్రమును ననువదించి కవిత్వము సార్థకము చేసికొని తరించినారు. శైలి సరసముగానున్నది. మీరింకను అనేక గ్రంథములను విరచించి తెలుగుతల్లికి నలంకరించి కృతార్థు లగుదురుగాకయని కోరుచున్నాను.

ఇట్లు
విన్నవించు విధేయుడు,
(ద) మం. వేంకటశర్మ.

౧౬—౧౦—౩౬,
నిడదవోలు.

## మంగిపూడి పురుషోత్తమశర్మగారు

ఆర్యా!

తాము రచించిన భగవద్గీతల ఆంధ్రపద్యానువాదమును చదువుటకు చాల సంతోషమైనది. శైలి సరళమై అందముగానుండి ఆరంభించినది మొదలు వదలబుద్ధికాలేదు. ఈ యుత్కృష్ట గ్రంథమును తెలుగుసేయుట కష్టసాధ్యమైనపని.తమ తర్జుమాలో రెండుమూడుచోట్ల స్వల్పముగా మూలభేద మగుపడుచున్నను, మొత్తముమీద తమకృతి కృతార్థమే యనుటకు సంశయములేదు. ముందు ముద్రణమునకు దీనిని సవరించినచో తాము ఆంధ్రభాషకు అమూల్యాలంకారమును పెట్టినవారగుదురు. తమకృతి నెంతయు మనఃపూర్వకముగా కొనియాడుచున్నాను.

విధేయుడు,
(ద) మంగిపూడి పురుషోత్తమశర్మ.
నిడదవోలు పశ్చిమగోదావరి.
8—10—36

# కృతిసమర్పణము

శ్రీ రంజిల్లఁ జరాచరాత్మకము నై చెన్నారు విశ్వంభరా
భారంబూని సమస్తకార్యఘటనాప్రజ్ఞాప్రభావాఢ్యమై
ప్రారంభాంత్యవిహీనమై యుపనిషద్భావైకసంవేద్యమై
స్ఫారాఖండ మనంతమై తగు పరబ్రహ్మమ్ము నిన్నేమతిన్.

కాళిందీతటినీతటాగ్రమున రాకాచంద్రబింబప్రభా
జాలవ్యాపితసైకతస్థలుల రాసక్రీడలన్ గోపికా
నాళీకాక్షులకున్ బ్రవృత్తి విభవానందంబుఁ జేకూర్చు గో
పాలస్వామి కృతార్థుఁ జేయు దయ జవ్వాద్యన్వయున్ లక్ష్మయన్.

అష్టదిక్పాలకులనై భవాతిశయము
భానుచంద్రాదికగ్రహప్రథితబలము
పంకజోద్భవహరిహరప్రాభవమ్ము
లోముగావుత! నీకృతిస్వామి నెపుడు.

అరయ సత్కావ్యసాంప్రదాయమ్ముగాఁగ
నోలి మత్కృతిపతికి నభ్యుదయవృద్ధి
యలరునట్లు, తదీయవంశావతార
మభినుతించెద బుధవర్గ మభిగణింప.

అతులప్రతాపదీప్తాగ్ని శాత్రవనిబి
డాటవిఁ గాల్చె నే యన్వయంబు
మహితతంజాపురమధురప్రశస్త రా
జ్యముల స్థాపించె నే యన్వయంబు

కోటల నిర్మించి కొలనుపట్టణమునం
దాంధ్రోర్వి నేలె నే యన్వయంబు
విరచించి భరియించి విఖ్యాతకృతుల స
మర్చించె భాష నే యన్వయంబు
అద్దిర! యమూల్యమైన గ్రంథాలయంబు
నాంధ్రుల కొసంగి మించె నే యన్వయంబు
అట్టి * తెల్గునాయకకులఖ్యాతి వేఱె
తెలుపఁగానేల? తెలియ రే? తెలుఁగువారు.

ఆచరితప్రసిద్ధాన్వయమున, సుమన
సాహ్వాయపవిత్రగోత్రవిఖ్యాతు లగుచు
వఱలుచుందురు జవ్వాదివార లందుఁ
దనరు రెడ్డెయ్య వంశవర్ధనుఁడు నగుచు.

అమలగుణఖనియా రెడ్డెయాభిధునకుఁ
బత్నియై యల్లమాంబ సద్భక్తి మించెఁ
బొడమె నాదంపతుల పూర్వపుణ్యమునను
లక్ష్మయాహ్వాయుఁ డఖిలసల్లక్షణుండు.

ఘనుఁ డా లక్ష్మయనాయకాగ్రణికి, వేంకాయమ్మ యిల్లాలునై
యనయంబుం గొలువంగ, బేర్వడసి సౌఖ్యాంభోనిధిం దూగుచు
న్గని యోం పుత్రులపాత్రులం సుగుణవిఖ్యాతైకసచ్ఛీలురం;
వినయాధిక్యుల రామశాస్త్రి యనఁగా, వేంకయ్యనా నిర్వురం.

---

* వీరలే తెలగనాయకులనియు తెలగాలనియుఁ బ్రస్తుతకాలమున వ్యవహరింపఁబడుచుండిరి.

అనఘుఁడు వేంకయనాయం
డనుపమసౌశీల్యసద్గుణాఢ్యను శుభల
క్షణలక్ష్మి తాంగి సుబ్బమఁ
దన కెంతయుఁ గూర్చు సతిగఁ దాఁ బెండ్లాడెన్.

అలపురపాలకాధ్యక్షపీఠం బధి
ష్ఠించి పౌరులమెప్పుఁగాంచె నెవఁడు
సభ్యుఁడై తాలుకాసంస్థను పాలక
పాలితావళినుతు ల్బడసె నెవఁడు
సమధికైశ్వర్యశశ్వద్దానధర్మకా
ర్యార్జితామలకీర్తి నలరె నెవఁడు
హాలముఖాత్తవిభూతి సఖలప్రజావళి
కరుణఁ గాపాడిన కాపెవండు

నిత్యరామపదార్చనానియతుఁ డెవఁడు
బుధజనారాధ్యసద్గుణపూర్ణుఁ డెవ్వఁ
డట్టి దీనావనుని వేంకయాభిధానుఁ
బొగడఁగానేల? నన్యులఁ బోల్పనేల?

శ్రీరామపదపద్మసేవానురక్తులు
సంతతానందపరిశాంతయుతులు
నిత్యసత్యవ్రతనియమానుసారులు
సదసద్వివేకవిచారపరులు
ప్రాంచద్యశోరమాపాంగదృగ్భూషితు
లకలంకసుగుణసౌహార్దధనులు
రాజ్యాంగకార్యనిర్వహణదీక్షులు ప్రజా
కల్యాణసంధానకలితమతులు

సరసకవితాభిమానులు, సత్క్రియాళి
కెల్ల విధములఁ జేయూత నిచ్చుఘనులు
పాత్రులు పవిత్రు లిర్వుర పుత్రికులను
గాంచి వేంకయ జన్మతరించి మించె.

వేడ్క వేంకయ తత్సుతద్వితయమునకు
నారసింహ లక్ష్మయ లను నామము లిడి,
పెంచి విద్యాధికులఁజేసి పేర్మిఁ దాఁ ద్య
జించి భౌతిక దేహమ్ముఁ; గాంచె దివము.

హైమవతియిందిరల కెనయై దలిర్చు
చిట్టెమయు నాదిలక్ష్మి నాఁ జెలఁగుసతుల
నన్నదమ్ములబిడ్డల, నన్నదమ్ము
లిర్వురు వివాహమాడి రా నింపుమీఱ.

తనపుత్రుల్ సుచరిత్రులై సుకవితాతన్వీమనోహారులై
ఘనసంపత్కలనాభిరాములయి ప్రఖ్యాతప్రభావాఢ్యులై
వినయానందసుఖాత్ములై యలరుటన్ వీక్షింపఁజూ గోర్కెనె
మ్మనమందుఁ ముదమందు వేంకయసుధర్మస్థానియైనిచ్చలుఁ.

పులిమీసలంది యుయ్యాలలూపఁగాఁ జాలు
పరిబలధైర్య స్థైర్యబాహుబలము
తప్పొనరించెనా తనవారు పెఱవార
లని జూడనట్టి న్యాయైకదృష్టి
సాధుసజ్జనదీనజనహితాచరణాది
సత్క్రియాచారవిచారబుద్ధి

మాయ మర్మంబను మాట యెఱుంగని
పరివిమలఋజుమార్గవర్తనంబు
రక్షణ మొనర్పఁబూన ఘాతాత్ముఁ డడ్డె
నేని వెనుకంజ వేయఁగాఁ బోని పూన్కి
యలరు కల్యాణగుణసముపాశ్రియుండు
శ్రితదయావర్తి శ్రీనరసింహమూర్తి.

ఏల? కవిత్వచాతురి; యవేల? నలంకృతు; లేల? వర్ణనం;
బేలను? వేయు సుద్దులు; వచించెద నిక్కువ మొక్కమాట, దు
శ్శీలుర శిక్షఁజేయ నరసింహమె మానరసింహమూర్తి; స
చ్ఛీలుర రక్షఁజేయ నరసింహమె మానరసింహమూర్తియా.

గణపతిని, రామచంద్రుని,
నొనరించెఁ బ్రతిష్ఠ భక్తు లోహోయన, స
ల్పెను సప్తాహము, లెన్నియు
ఘనకార్యము లాచరించెఁ గాంక్ష దలిర్పన్.

గ్రామపంచాయతీకోర్టుభామ తనదు
మైత్రి విడనాడలే కెన్నిమాఱ్లు వలద
టంచు వచియించుచున్న వరించుచుండె
సద్గుణుండగు పతి నెందు సకియ విడునె?

లౌకికతత్త్వమెల్ల సుకరమ్ముగ నేర్పఁగ నూహఁజేసి య
స్తోకకృపాంతరాత్మ తనసోదరు లక్ష్మయనన్ సమస్త కా
ర్యాకరుగా నొనర్చియు హితాహితముల్వచియించుచున్ బుధా
నీకము మెచ్చ దిద్దఁగల నేర్పరి మా నరసింహుఁ డొక్కఁడే!

వాసమా ! కన్యకావాసప్రసిద్ధిఁ జే
పట్టిన పెనుగొండపట్టణంబు
అన్వయంబా ! సకలాంధ్రావనీసువి
ఖ్యాతమౌ తెల్గునాయకుల యిక్క-
కులమా ! సమస్తదిక్కుల త్యాగసత్సౌర
భము గుమ్మరించు జవ్వాదికులము
వర్తనంబా ! భవ్యవై దికప్రథమద్వితీ
యానుమోదియౌ దివ్యపథము

చరితమా ! పండితకవీంద్రసరసమృదుల
విమలవాక్యపరంపరావిశ్రుతమ్ము
అంచితక్రీడలా ! యశోఽబ్జాక్షితోడ
సిట్టి మా లక్ష్మయకు భువి నెవ్వ రీడు?

మాటలనేర్పులా ! సుకవిమన్ననలా ! వ్యవహారలీలలా !
'ఓటు'లలో జయంబుల! మహోన్నతధర్మములా! మనోజ్ఞమౌ
పాటల! సత్కళావిధుల! భాగ్యములా! యొకచోట? నన్నిటన్
మేటి జవాది లక్ష్మయ సుమీ పొఱపా టొరు దీటు సేయుటల్.

ప్రకటించె మాతృసారస్వతాసక్తిని
గ్రంథమాలాధ్యక్షకత వహించి
ప్రచురించె స్థానికపరిపాలనప్రౌఢి
రాజకీయాధికారములఁ బడసి
యలరించె విశ్వవిఖ్యాతి భాస్వద్యుతుల్
సప్తసంతానప్రశస్తిగరిమ

పాడించె సద్యశో భావగీతమ్ముల
మంజులకవితాకుమారిచేతఁ

దరమె ? లక్ష్మయ ఘనకార్యతతి వచింపఁ
జేయుచున్నాఁడు చేసెను చేయఁగలఁడు
ఎంతవర్ణించినను నంతయేని యతిశ
యోక్తి గానేర దది స్వభావోక్తిగాని.

ఆనతిచ్చెనా ! యద్ది శిలాక్షరంబు
మెచ్చెన ! కృతార్థుఁ జేయు నేమిచ్చియైన
చెంతఁజేర్చెనా ! చేయుఁ దనంతవాని
శతురువైననుగాని నిస్సంశయంబు.

స్థానికసంస్థలందునను దన్ను నెదుర్ప సమర్థు లెందఱో
పూనిక నింతకాలమును బొందక నోటమి నంతయయ్యుఁ, జయం
బూనుచునున్న సర్వసుగుణోజ్జ్వలు మత్కృతినాథునిఁ బ్రజా
మానితుఁడంచుఁ దెల్పఁగఁ బ్రమాణము వేఱ వచింపనేటికిఁ?

పతిని సంపద్యశోరమాపతియనంగ
సార్థకత్వం బొనర్చిన జలజనయన
కడలిఁ బుట్టని లో టొండుఁ గలిగెఁగాని
యాదిలక్ష్మియె నిక్కపు మాదిలక్ష్మి.

పూవుబుట్టినతోడనే తావిగొలుపు
నన్నగతి పిన్నలయ్యు గుణాఢ్యులైన
రామశాస్త్రియు నా, రంగరావనంగఁ
బొలుచు సుతరత్నములఁ గన్నపూజ్యురాలు.

బంగారము ఫలించు రంగైనభూములు
రమణీయమందిరారామములును
నవ్యశోభాయంత్రినాటకశాలలు
ప్రజ లర్థి నొసఁగిన పాలనంబు
సాధ్వీమతల్లి సాక్షాల్లక్ష్మి యిల్లాలు
నిర్మలోద్యద్గుణుల్ కూర్మిసుతులు
విహితాహితమ్ముల వివరించుమిత్రులు
ప్రాణంబులే నిడు పరిజనమ్ము

లే కొఱంతయు రానీక నెల్లవేళ
లందు ప్రియమార దిద్దెడి యగ్రజుండు
భళిర ! జవ్వాది లక్ష్మయామాత్యునిఁ బోలు
నిందరితుల్యులు గనుపట్ట రెందునేని.

---

ఏతాదృశగుణగణ్యున
కాతతసత్కీర్తిశాలి కతిశాంతునకున్
గీతానువాదకావ్యముఁ
జేతు సమర్పణము ప్రీతి శిష్టులు బొగడన్.



అశ్రుపూర్ణాకులేక్షణుఁ డవి దయార్ద్రి చిత్తుఁడై యిటు దుఃఖమ్ముఁజెందుచున్న
సవ్యసాచిని వీక్షించి; సంగరహితుఁడైన శ్రీకృష్ణపరమాత్ముఁ డనియె నిట్లు.

ఓమ్
శ్రీ కృష్ణపరమాత్మనే నమః

# శ్రీమద్భగవద్గీతానువాదము

## మొదటియధ్యాయము

### అర్జున విషాద యోగము

ధృతరాష్ట్ర ఉవాచః—

శ్లో: ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః,
మామకాః పాండవాశ్చైవ కిమకుర్వత సంజయ. ౧

సంజయా! యేమిసల్పిరి? ◆ సంగరంబు
నభిలషించి ధర్మక్షేత్ర ◆ మైనయట్టి
తతకురుక్షేత్రమందునఁ ◆ జారసిల్లి
యస్మదీయులు పాండురాజాత్మజులును. ౧

దృష్ట్వా తు పాండవానీకం వ్యూఢం దుర్యోధన స్తదా,
ఆచార్య ముపసంగమ్య రాజా వచన మబ్రవీత్. ౨

ఆంబికేయ! వ్యూహాకృతి ◆ నలరుపాండు
పుత్రబలములఁ గాంచియు ◆ భూతలేశుఁ
డై నదుర్యోధనుం డపు ◆ డరిగి గురుని
సన్నిధికి నిట్టులంచును ◆ విన్నవించె. ౨

ఓమ్
శ్రీ కృష్ణపరమాత్మనే నమః

# శ్రీ మద్భగవద్గీతానువాదము

## మొదటియధ్యాయము

### అర్జునవిషాదయోగము

ధృతరాష్ట్ర ఉవాచ:—

శ్లో. ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః,
మామకాః పాండవాశ్చైవ కిమకుర్వత సంజయ. ౧

సంజయా! యేమిసల్పిరి? ♦ సంగరంబు
నభిలషించి ధర్మక్షేత్ర ♦ మైనయట్టి
తతకురుక్షేత్రమందునఁ ♦ దారసిల్లి
యస్మదీయులు పాండురాణ్ణాత్మజులును. ౧

దృష్ట్వా తు పాండవానీకం వ్యూఢం దుర్యోధనస్తదా,
ఆచార్య ముపసంగమ్య రాజా వచన మబ్రవీత్. ౨

ఆంబికేయ! వ్యూహాకృతి ♦ నలరుపాండు
పుత్రబలములఁ గాంచియు ♦ భూతలేశుఁ
డైనదుర్యోధనుం డపు ♦ డరిగి గురుని
సన్నిధికి నిట్టులంచును ♦ విన్నవించె. ౨

పశ్యైతాం పాండుపుత్రాణా మాచార్య మహతీంచమూమ్,
వ్యూఢాం ద్రుపదపుత్రేణ తవ శిష్యేణ ధీమతా. 3

ఆర్యనుతశౌర్య ! కార్ముకా•చార్య ! తావ
కీనశిష్యుండు ధీమంతుఁ•డైన ద్రుపద
పుత్రుచే నిర్మితవ్యూహ•మునఁ జెలంగు
నీమహాపాండవానీక • మెల్లఁ గంటె? 3

అత్ర శూరా మహేష్వాసా భీమార్జునసమా యుధి,
యుయుధానో విరాటశ్చ ద్రుపదశ్చ మహారథః. ४

ధృష్టకేతు శ్చేకితానః కాశీరాజశ్చ వీర్యవాన్,
పురుజి త్కుంతిభోజశ్చ శైబ్యశ్చ నరపుంగవః. ౫

యుధామన్యుశ్చ విక్రాంత ఉత్తమౌజాశ్చ వీర్యవాన్,
సౌభద్రో ద్రౌపదేయాశ్చ సర్వఏవ మహారథాః. ౬

హరిసోదరుఁడు రథి•కాగ్రణి పాంచాల
భూమీధవుఁడు కుంతి•భోజనృపతి
ద్రౌపదేయులు సుభ•ద్రాత్రితనూభవుఁడు యు
ధామన్యుఁ డరిజన•భీముఁడైన
యుత్తమౌజుఁడు పురు•జిత్తు పరాక్రమ
శాలి మత్స్యక్షితి•పాలకుండు
చేకితానుండు కా•శీనరేంద్రుఁడు శైబ్యుఁ
డలధృష్టకేత్వాహ్వ•యాధినాథుఁ

డాదినాయకు లెల్ల మ॰హారథికులు
మండితమహాధనుర్ధరు ॰ ల్భండనమున
నధికవిక్రము లై నభీ॰మార్జునులకు
నన్నివిధములచేత దీ॰టైనవారు. ౪

అస్మాకంతు విశిష్టాయే తాన్నిబోధ ద్విజోత్తమ,
నాయకా మమ సైన్యస్య సంజ్ఞార్థం తాన్ బ్రవీమి తే. ౭

అంబుజోద్భవాన్వయదీప! ॰ యస్మదీయ
ముఖ్యు లెవ్వారో? నాయక॰ముఖ్యు లేరో?
అరయ మనసైన్యమందు సం॰జ్ఞార్థ మేను
బల్కువాఁడ నెఱుంగుమా! ॰ వారి నెల్ల. ౫

భవాన్ భీష్మశ్చ కర్ణశ్చ కృపశ్చ సమితింజయః,
అశ్వత్థామా వికర్ణశ్చ సౌమదత్తిర్జయద్రథః. ౮
అన్యే చ బహవశ్శూరా మదర్థేత్యక్తజీవితాః,
నానాశస్త్రప్రహరణా స్సర్వే యుద్ధవిశారదాః. ౯

మీరలు భీష్మకర్ణులును ॰ మీతనయుండును సౌమదత్తి వి
స్ఫారజయాఢ్యుఁడౌ కృపుఁడు॰సైంధవుఁ డల్లవికర్ణుఁడాదిదు
ర్వారతరాయుధోద్ధతులు ॰ భండనపండితు లెందఱెందఱో
వీరులు మన్నిమిత్తమయి॰వీడఁగనుండిరి జీవితమ్ములన్. ౬

అపర్యాప్తం తదస్మాకం బలం భీష్మాభిరక్షితమ్,
పర్యాప్తం త్విదమేతేషాం బలం భీమాభిరక్షితమ్. ౧౦

అనఘ ! యట్టిదయయ్యు సు♦రాపగాత్మ
జాభిరక్షితమై యప♦ర్యాప్త మయ్యె
మనబలమ్ము; పాండవబల ♦ మనిలసంభ
వాభిరక్షిత మయ్యుఁ బ♦ర్యాప్త మయ్యె. ౭

అయనేషు చ సర్వేషు యథాభాగ మవస్థితాః,
భీష్మ మేవాభిరక్షంతు భవంత స్సర్వ ఏవ హి. ౧౧

మీర లెల్ల రాహవమున ♦ మీఁదునిర్ణ
యస్థలమ్ముల విడక వ్యూ♦హప్రదేశ
పథములం దుండి; యేమఱు♦పాటు నొంద
కించుకేనియు ష్ము ర♦క్షించరయ్య! ౮

తస్య సంజనయన్ హర్షం కురువృద్ధః పితామహః,
సింహనాదం వినద్యోచ్చైశ్శంఖం దధ్మౌ ప్రతాపవాన్. ౧౨

అటుల సంస్తుతించు♦నాసుయోధనునకు
హర్ష మొదవఁ గురుకు♦లాగ్రగణ్యుఁ ౯
డాపితామహుండు ♦ నతులప్రతాపుండు
సింహగర్జఁ జేసి ♦ చింద మొత్తె.

తతశ్శంఖాశ్చ భేర్యశ్చ పణవానకగోముఖాః,
సహసైవాభ్యహన్యంత స శబ్దస్తుములోఽభవత్. ౧౩

ఘనశంఖమ్ములు భేరులు
పణవానకగోముఖాది♦బహువిధతూర
స్వనము లతితుముల మయ్యెను
జననాయక! సకలదిశల ♦ సరభసవృత్తిన్. ౧౦

తతశ్శ్వేతైర్హయైర్యుక్తే మహతి స్యందనే స్థితౌ,
మాధవః పాండవశ్చైవ దివ్యౌశంఖౌ ప్రదధ్మతుః. ౧౪

అంత శ్వేతాశ్వయుక్తమ♦హారథస్థు
లైన మాధవార్జునులు ది♦వ్యంబులైన
ప్రథితశంఖంబు లొత్తిరి ♦ బంధురముగ
నంబికాపుత్రి! శత్రుభ♦యంకరముగ. ౧౧

పాంచజన్యం హృషీకేశో దేవదత్తం ధనంజయః,
పౌండ్రం దధ్మౌ మహాశంఖం భీమకర్మా వృకోదరః. ౧౫

అనంతవిజయం రాజా కుంతీపుత్రో యుధిష్ఠిరః,
నకుల స్సహదేవశ్చ సుఘోషమణిపుష్పకౌ. ౧౬

కాశ్యశ్చ పరమేష్వాసః శిఖండీ చ మహారథః,
ధృష్టద్యుమ్నో విరాటశ్చ సాత్యకిశ్చాపరాజితః. ౧౭

ద్రుపదో ద్రౌపదేయాశ్చ సర్వశః పృథివీపతే,
సౌభద్రశ్చమహాబాహుశ్శంఖాన్ దధ్ముఃపృథక్పృథక్. ౧౮

దేవదత్తంబును ♦ దేవాధిపసుతుండు
పాంచజన్యంబు గో♦పాలమూర్తి
భీమాభిరాముఁడౌ♦భీముండు పౌండ్రమ
నంతవిజయము య♦మాత్మజుండు
వరుస చంచద్విభా♦స్వరసుఘోషంబును
మణిపుష్పకంబును ♦ మాద్రిసుతులు
ఘనరథుండు శిఖండి ♦ కాశీనరేందు్రిండు
విరటుండు పాంచాల♦విభుసుతుండు
ప్రథితబలుఁ డభిమన్యుండు ♦ ద్రౌపదేయ
పంచకమ్మును ద్రుపదుండు ♦ భండనావ
రాజితులు శినిపుత్రాది♦రథికు లెల్ల
శంఖరవముల వేర్వేఱ ♦ నలిపి రంత. ౧౨

స ఘోషో ధార్తరాష్ట్రాణాం హృదయాని వ్యదారయత్,
నభశ్చ పృథివీం చైవ తుములో వ్యనునాదయన్. ౧౯

అమితసంకుల మైన భీ♦మార్జునాది
యోధవిహితశంఖోచ్చలి♦తోగ్రరవము
త్రస్నభోంతరములు నిండి ♦ మాఱుమోగె
ధార్తరాష్ట్రులగుండియల్ ♦ దద్దరిల్ల.

అథ వ్యవస్థితాన్ దృష్ట్వా ధార్తరాష్ట్రాన్ కపిధ్వజః,
ప్రవృత్తే శస్త్రసంపాతే ధనురుద్యమ్య పాండవః. ౨౦

ఉభయ సేనలు చిందంబు ♦ లొత్తి; యాయు
ధప్రయోగసంసిద్ధులౌ♦తతి కిరీటి
కలని కుద్యుక్తులగుకురు♦గణముఁ గాంచి
యెక్కునిడి విల్లు శ్రీహరి ♦ కిట్టు లనియె. ౧౮

హృషీకేశం తదా వాక్య మిదమాహ మహీపతే,
సేనయోరుభయోర్మధ్యే రథం స్థాపయ మేఽచ్యుత. ౨౧
యావదేతాన్ నిరీక్షేఽహం యోద్ధుకామానవస్థితాన్,
కైర్మయా సహ యోద్ధవ్యమస్మిన్ రణసముద్యమే. ౨౨
యోత్స్యమానానవేక్షేఽహం య ఏతేఽత్ర సమాగతాః,
ధార్తరాష్ట్రస్య దుర్బుద్ధేర్యుద్ధే ప్రియచికీర్షవః. ౨౩

ఆలమునన్ ఘటింపఁగఁ బ్రి♦యమ్ము మనమ్ముల నిశ్చయించి,దు
ర్భీలుఁడు కౌరవేంద్రునకుఁ,♦జేరి రెవారు రణాంగణమ్ము, గో
పాలకులాఢ్య! నా కగునొ ♦ భండన మేరితొ, వారిఁ గన్గొనన్
వీలగునట్లు స్యందనము♦నిల్పుమ సైన్యయుగాంతరంబునన్.౧౯

ఏవముక్తో హృషీకేశో గుడాకేశేన భారత,
సేనయోరుభయోర్మధ్యే స్థాపయిత్వా రథోత్తమమ్. ౨౪

భీష్మద్రోణప్రముఖత స్సర్వేషాం చ మహీక్షితామ్,
ఉవాచ పార్థ పశ్యైతాన్ సమవేతాన్ కురూనితి. ౨౫

అనవుఁడు కేశవుం డరద ♦ మల్లన సేనలరెంటిమధ్య స
త్యనుపమవిక్రమక్రమఘ♦టాత్మజశంతనుపుత్రసర్వరా
డ్జనసముఖమ్మునన్ నిలిపి; ♦ శక్రసుతా! సమరేచ్ఛనైన యీ
ఘనకురువీరసైన్యమును ♦ గాంచు మటంచు వచించె నత్తఱిన్.

తత్రాపశ్యత్ స్థితాన్ పార్థః పితౄనథ పితామహాన్,
ఆచార్యాన్మాతులాన్ భ్రాతౄన్ పుత్రాన్ పౌత్రాన్ సఖీం స్తథా.
శ్వశురాన్ సుహృదశ్చైవ సేనయోరుభయోరపి,

సైన్యముల రెంటనున్న యా♦చార్యవిబుధ
పౌత్రమిత్రసుహృజ్జన♦శ్వశురు లాది
మాతులభ్రాతృపితృపితా♦మహాతనూజ
బాంధవుల నవలోకించె ♦ ఫల్గునుండు. ౧౭

తాన్ సమీక్ష్య స కౌంతేయ స్సర్వాన్ బంధూనవస్థితాన్.
కృపయా పరయాఽఽవిష్టో విషీదన్నిద మబ్రవీత్,

ప్రబలభీకరసంగరా♦వస్థితు లగు
సర్వబాంధవులం గాంచి ♦ సవ్యసాచి
బంధురోత్కృష్టకరుణార్ద్ర♦భావుఁడై వి
షాద మందుచు వచియించె ♦ శౌరి కిటుల. ౧౮

దృష్ట్వేమం స్వజనంకృష్ణ! యుయుత్సుంసముపస్థితమ్, ౨౮
సీదంతి మమ గాత్రాణి ముఖం చ పరిశుష్యతి,
వేపథుశ్చ శరీరే మే రోమహర్షశ్చ జాయతే. ౨౯

గాండీవం స్రంసతే హస్తాత్ త్వక్చైవ పరిదహ్యతే,
న చ శక్నోమ్యవస్థాతుం భ్రమతీవ చ మే మనః. ౩౦

గాత్రాళి శిథిలమ్మ • గా౯ జొచ్చె వదనగ
హ్వార మంతయును తడి • యాఱఁదొడఁగె
దేహ మాద్యంతంబు • తీవ్రసంచలితమై
పులక లొక్కుమ్మడిఁ • బొడముచుండెఁ
బట్టుదప్పి మదీయ • పాణిప్రదేశంబు
నుండి జాఱఁగసాగె • గాండివంబు
స్పర్శేంద్రియంబును • సంతప్త మగుచుండె
మనము విభ్రమమొందు • మాడ్కిఁ దోఁచె
భండనోత్సాహమతి సము • పస్థితులగు
స్వీయజనసంఘమును నిరీ • క్షించినంత
నరదమున నిల్చుసామర్థ్య • మైన లేదు
వర్జితభవార్తికృష్ణ! గో • పాలకృష్ణ! ౧౬

నిమిత్తాని చ పశ్యామి విపరీతాని కేశవ,
న చ శ్రేయోఽనుపశ్యామి హత్వా స్వజన మాహవే. 31

కమలనాభ! నిమిత్తము • ల్గానుపించు
చుండె విపరీతములుగఁ బ్రచండయుద్ధ
మందు స్వీయజనమ్ముల • నంత మొందఁ
జేయఁ గనుపింప దావంత • శ్రేయ మేని. ౨౦

న కాంక్షే విజయం కృష్ణ న చ రాజ్యం సుఖాని చ,
కిం నో రాజ్యేన గోవింద కిం భోగై ర్జీవి తేన వా. 32

ఆస సేయను విజయమ్ము • కోస మేను,
వలదు రాజ్యమ్ము, సుఖమును • వలదు నాకు,
నెల్లరుం దీర భోగమ్ము • లేల? రాజ్య
మేల? నీజీవితం బది • యేల? తుదకు. ౨౧

యేషామర్థే కాంక్షితం నో రాజ్యం భోగాస్సుఖాని చ,
త ఇమేఽవస్థితా యుద్ధే ప్రాణాం స్త్యక్త్వా ధనాని చ. 33

ఏ నెవారినిమిత్తమై • యెల్లభోగ
ములను, రాజ్యమ్ము, సుఖసంత • తుల నపేక్ష
సేయుచుంటినో; వారలే • సిరుల జీవ
నముల వాంఛింప కనికి స • న్నద్ధు లైరి. ౨౨

ఆచార్యాః పితరః పుత్రా స్తథైవ చ పితామహాః,
మాతులాః శ్వశురాః పౌత్రాః స్యాలాః సంబంధిన స్తథా.

ఏతాన్న హంతుమిచ్ఛామి ఘ్నతోఽపి మధుసూదన,
అపి త్రైలోక్యరాజ్యస్య హేతోః కిన్ను మహీకృతే. 35

వారలు తాతలుఁ సుతులు♦ పౌత్రులు తండ్రులు మేనమామలుఁ
మీఱినచుట్టపక్కములు♦ మేనమఱందులు మామలుఁ గురుల్
వారలె నన్ను జంపినను♦ వచ్చిననేని త్రిలోకరాజ్యమ
వ్వారి వధింపనోపనను♦ బాడియె గూల్పఁగ తుచ్ఛభూమికై.

నిహత్య ధార్తరాష్ట్రాన్నః కా ప్రీతిస్స్యాజ్జనార్దన,
పాపమేవాశ్రయేదస్మాన్ హత్వైతానాతతాయినః. 36

తస్మాన్నార్హావయంహంతుం ధార్తరాష్ట్రాన్స్వబాంధవాన్,
స్వజనం హి కథం హత్వా సుఖినస్స్యామ మాధవ. 37

ఏమిముదంబుగల్గు, వధి♦యించినచో నలధార్తరాష్ట్రులన్?
గామతి నాతతాయుల సం♦గర్వులఁ గూల్ప నఘంబె గల్గు నో
తామరసాక్ష! బాంధవయు♦తమ్ముగ కౌరవకోటి దున్మివ నే
నీమెయిఁ జాలఁ గాంతు నెటు♦లీస్వజనమ్ములఁజంపి సౌఖ్యముల్.

యద్యప్యేతే న పశ్యంతి లోభోపహతచేతసః,
కులక్షయకృతం దోషం మిత్రద్రోహే చ పాతకమ్. ౩౮

అంబుజాతాక్ష ! లోభోప•హతమనస్కు
లైన వీ రాప్తులెడల ద్రోహమ్ముకతనఁ
గ్రమ్ముపాపమ్ము, వంశక్ష•యమ్మువలనఁ
గలుగుదోస, మావంతయుఁ•దెలియరైరి. ౨౫

కథం న జ్ఞేయ మస్మాభిః పాపాదస్మా న్నివర్తితుమ్,
కులక్షయకృతం దోషం ప్రపశ్యద్భిర్జనార్దన. ౩౯

కులక్షయే ప్రణశ్యంతి కులధర్మాస్సనాతనాః,
ధర్మే నష్టే కులం కృత్స్నమధర్మోఽభిభవత్యుత. ౪౦

అన్వయక్షయకృతదోష • మరయుమనము
తెలిసి యీపాప మెటు నివ• ర్తింపరాదు?
కులము నశియింప తొలిధర్మ•ములు దొలంగుఁ
దొలఁగ ధర్మం బధర్మంబు•కులము నొందు. ౨౬

అధర్మాభిభవాత్కృష్ణ ప్రదుష్యంతి కులస్త్రియః,
స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ జాయతే వర్ణసంకరః. ౪౧

ధర్మ మడుగంటెనేని వి•ధాయకములఁ
బాయును కులాంగనామణి• చారిత్ర మెల్ల
భామలు స్వకీయధర్మముల్ • బాసిరేని
సంభవిల్లును పో వర్ణ•సంకరంబు.

సంకరో నరకాయైవ కులఘ్నానాం కులస్య చ,
పతంతి పితరో హ్యేషాం లుప్తపిండోదకక్రియాః. ౪౨

సంకరము వంశనాశంబు॰సల్పువారి
యన్వయము నెల్ల నరకంబు ॰ నందఁజేయు
లుప్తపిండోదకక్రియా॰తప్తులగుచు
పతనులౌదురు వారల॰పితరు లెల్ల. ౨౮

దోషైరేతైః కులఘ్నానాం వర్ణసంకరకారకైః,
ఉత్సాద్యంతే జాతిధర్మాః కులధర్మాశ్చ శాశ్వతాః. ౪౩

వాసుదేవ ! కులఘ్నుల॰వలన నైన
వర్ణసంకరకారక॰దుర్ణయముల
చే వినాశన మందు సు॰స్థిరములైన
జాతిధర్మలు కులధర్మ॰సంచయంబు. ౨౯

ఉత్సన్నకులధర్మాణాం మనుష్యాణాం జనార్దన,
నరకే నియతం వాసో భవతీత్యనుశుశ్రుమ. ౪౪

అహో బత మహత్పాపం కర్తుం వ్యవసితా వయమ్,
యద్రాజ్యసుఖలోభేన హంతుం స్వజనముద్యతాః. ౪౫

నరులకు వంశధర్మములు ॰ నాశన మొందిన శాశ్వతమ్ముగా
నరకనివాస మబ్బునను॰న్యాయమె వింటి మనుశ్రుతమ్ముగా;
హరహర !! రాజ్యసౌఖ్యముల॰యాశ స్వకీయజనాళినెల్ల సం
హారణ మొనర్చువృత్తిని మ॰హాఘ మొనర్పఁగనుద్యమించితొ!

యది మామప్రతీకార మశస్త్రం శస్త్రపాణయః,
ధార్తరాష్ట్రా రణే హన్యు స్తన్మే క్షేమతరం భవేత్. ४६

అప్రతీకారుఁడ నశస్త్రిఁ • డైననన్ను
శస్త్రపాణులు ధార్తరా•ష్ట్రవర్గంబు
క్రొంచకను యుద్ధమున సంహ•రించిరేని
క్షేమ మయ్యెడి నాకు మి•క్కిలి తలంప. ३०

ఏవముక్త్వాఽర్జునస్సంఖ్యే రథోపస్థ ఉపావిశత్,
విసృజ్య సశరం చాపం శోకసంవిగ్నమానసః. ४७

ఫల్గునుం డటు వచియించి • ప్రధనభూమి
నెంతయును శోకసంవిగ్న•హృదయుఁ డగుచు
సశరచాపము శీఘ్రమ • జారవిడచి
రథమునం గూరుచుండె ధ•రాతలేశ! ३१

# రెండవ యధ్యాయము

## సాంఖ్య యోగము

తం తథా కృపయాఽఽవిష్ట మశ్రుపూర్ణాకులేక్షణమ్,
విషీదంత మిదం వాక్యమువాచ మధుసూదనః. ౧

అశ్రుపూర్ణాకులేక్షణుఁ ♦ డతిదయార్ద్రి
చిత్తుఁడై యటు దుఃఖమ్ముఁ♦జెందుచున్న
సవ్యసాచిని వీక్షించి; ♦ సంగరహితుఁ
డైన శ్రీకృష్ణపరమాత్ముఁ ♦ డనియె నిట్లు. ౧

కుతస్త్వా కశ్మలమిదం విషమే సముపస్థితమ్,
అనార్యజుష్టమస్వర్గ్యమకీర్తికరమర్జున. ౨

ఇట్టి క్లిష్టపరిస్థితి నెట్టు లీ య
నార్యజుష్టమ్ము దుష్కీర్తి ♦ కాకరమ్ము
ధన్యలోకకవాటబం♦ధనము నైన
కశ్మలము నిన్నుఁ జెందె న♦క్కట! కిరీటి! ౨

క్లైబ్యం మాస్మగమః పార్థ నైతత్త్వయ్యుపపద్యతే,
క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరంతప. 3

ఓపరంతప! క్లీబత్వ ◆ మొందఁబోకు
మిద్ది నీయందు నెంతయు ◆ నెసఁగఁబోదు
పార్థ! క్షుద్రమ్మ హృదయదౌ◆ర్బల్యమెల్లఁ
బాఱఁదోలియు లే లెమ్మ! ◆ బవరమునకు. 3

కథం భీష్మమహం సంఖ్యే ద్రోణం చ మధుసూదన,
ఇషుభిః ప్రతియోత్స్యామి పూజార్హా వరిసూదన. ౪

అరినిషూదన! కృష్ణ! నే◆నాహవమున
నంపవానల నెటు గురి◆యింపఁ గలను?
పూజ్యభావమ్మ నెఱపఁగాఁ ◆ బోలునట్టి
కుంభసంభవభీష్మాది◆గురులఁ దాకి. ౪

గురూ నహత్వా హి మహానుభావాన్
శ్రేయో భోక్తుం భైక్షమపీహ లోకే,
హత్వార్థకామాంస్తు గురూనిహైవ
భుంజీయ భోగాన్ రుధిరప్రదిగ్ధాన్. ౫

గురువుల మహానుభావులఁ ◆ గూల్పక నిల
ననుభవించు భైక్షమ్మది ◆ యైన మేలు
అర్థకాముల గురువుల◆నడఁచి రక్త
సిక్తభోగంబు లే నెటు ◆ జెందఁగలను? ౫

న చైతద్విద్మః కతరన్నో గరీయో
యద్వా జయేమ యది వా నో జయేయుః,
యానేవ హత్వా న జిజీవిషామ
స్తేఽవస్థితాః ప్రముఖే ధార్తరాష్ట్రాః. ౬

ఇంతియెగాక యుద్ధమున • నెవ్వరికిన్విజయంబు గల్గునో ?
నంతయుఁ దోఁచదిద్ది మధు • సూదన! రెండిటయుక్తమేదొ?, మ
త్స్వాంతమునం దెఱుంగ; మనఁ • జాల నెవారి వధించి, యుద్ధభూ
మ్యంతరమందు నిల్చిరిసు • మా! యలకౌరవముఖ్యబాంధవుల్. ౬

కార్పణ్యదోషోపహతస్వభావః
పృచ్ఛామి త్వాం ధర్మసమ్మూఢచేతాః,
యచ్ఛ్రేయస్స్యాన్నిశ్చితం బ్రూహి తన్మే
శిష్యస్తేఽహం శాధి మాం త్వాం ప్రపన్నమ్. ౭

ధర్మసమ్మూఢచిత్తంబు • దనరఁ గృపణ
తాభిదోషహతస్వభా • వాఢ్యుఁడనయి
చెలిమిఁ బ్రశ్నింతు నిశ్చిత • శ్రేయ మెద్ది ?
శిష్యునిఁ బ్రపన్ను శిక్షించి • చెపుమ ? నాకు. ౭

న హి ప్రపశ్యామి మమాపనుద్యా
ద్యచ్ఛోకముచ్ఛోషణమింద్రియాణామ్,

అవాప్య భూమావసపత్నమృద్ధం
రాజ్యం సురాణామపి చాధిపత్యమ్. ౮

ధరణి నకంటకంబు ధన♦ధాన్యసమృద్ధమునైన రాజ్యముఁ,
సరసిజపత్రినేత్ర! బుధ♦సన్నుతమౌ త్రిదశాధిపత్యముఁ
దొరకిన; నింద్రియమ్ములను♦దూల్పుచు శోషిలఁజేయుచున్నదు
ర్భరమగుమద్విషాదమును♦బాపెడువస్తువె గానుపింపదా! ౮

ఏవముక్త్వా హృషీకేశం గుడాకేశః పరంతపః,
న యోత్స్య ఇతి గోవిందముక్త్వా తూష్ణీం బభూవహ. ౯

తమువాచ హృషీకేశః ప్రహసన్నివ భారత,
సేనయోరుభయోర్మధ్యే విషీదన్తమిదం వచః.

శత్రుసంతాపకరుఁడు వా♦సవతనూజుఁ
డనియు నిట్లు పరాఙ్ముఖుఁ♦డగుచు ననికి,
నార్తి నిల్చిన నుభయసై♦న్యాంతరమున,
మందహాసమ్ముతోడ గో♦విందుఁ డనియె. ౯

అశోచ్యానన్వశోచ స్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే,
గతాసూనగతాసూంశ్చ నానుశోచన్తి పణ్డితాః. ౧౧

ఆర్తి నొందగరాని భీ♦ష్మాదిగురుల
విషయమునఁ గుందుచున్నావు, ♦ విజ్ఞునిగతిఁ
బ్రజ్ఞల వచింపుచుంటివి, ♦ పండితాళి
వగతురె? గతాగతప్రాణ♦వహులఁగూర్చి. ౧౦

న త్వేవాహం జాతు నాసం న త్వం నేమే జనాధిపాః,
న చైవ న భవిష్యామ స్సర్వే వయ మతఃపరమ్. ౧౨

నేను నీవును యీరాజ♦నికర మెల్ల
కాము లేనట్టివార మె♦క్కాలమునను,
పోమె నేనియు దేహముల్ ♦ పోము మనము,
అర్జునా! యిం దసత్య మా♦వంత లేదు. ౧౧

దేహినోఽస్మిన్ యథా దేహే కౌమారంయౌవనంజరా,
తథా దేహాన్తరప్రాప్తిర్ధీర స్తత్ర న ముహ్యతి. ౧౩

విజయ! కౌమారయౌవన♦వృద్ధదశలు
దేహి కీదేహమునఁ గల్గు ♦ తీరుగాఁగ
నటులె, దేహాంతరప్రాప్తి ♦ యగుచునుండు
నందు ధీరులు మోహమ్ము♦నందఁబోరు. ౧౨

మాత్రాస్పర్శాస్తు కౌన్తేయ శీతోష్ణసుఖదుఃఖదాః,
ఆగమాపాయినో నిత్యా స్తాం స్తితిక్షస్వ భారత. ౧౪

పాండుసుతమధ్య! మాత్రిలుఁ♦స్పర్శములును
నొసఁగునవి సుఖదుఃఖశీ♦తోష్ణములను,
ఆగమాపాయులును నని♦త్యములు గాన;
వానియందు తితిక్షను ♦ బూను మీవు. ౧౩

యం హి న వ్యథయ న్త్యేతే పురుషం పురుషర్షభ,
సమదుఃఖసుఖం ధీరం సోఽమృతత్వాయ కల్పతే. ౧౫

సత్పురుష! యివి సమదుఃఖ♦సౌఖ్యుఁ డైన
ధీరపురుషుని వ్యథను జెం♦దింపలేవు,
ఆతఁడే యమృతత్వమ్ము ♦ నందుటకును
నర్హుఁ డగుచున్నవాఁడు య♦థార్థముగను. ౧౫

నాఽసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః,
ఉభయోరపి దృష్టోఽన్త స్త్వనయో స్తత్త్వదర్శిభిః. ౧౬

ఫల్గునా! సత్తునకు నభా♦వమ్ము లేదు,
అరయ భావమ్మసత్తున ♦ కొఽఅయఁ బోదు,
ఈయుభయభేదమెల్ల గ్రౌ♦హింపఁబడియెఁ,
బ్రథితతత్త్వాభిదర్శు లౌ♦వారిచేత. ౧౬

అవినాశి తు తద్విద్ధి యేన సర్వ మిదం తతమ్,
వినాశ మవ్యయ స్యాస్య న కశ్చిత్కర్తు మర్హతి. ౧౭

ఎద్ది యీజగంబు♦నెల్ల వ్యాప్తంబయ్యె
నద్ది నాశమొంద ♦ దంచు తెలియు,
మవ్యయంబునైన ♦ యద్దాని నాశన
మొందఁజేయ నర్హుఁ♦డొకఁడులేడు. ౧౭

అన్తవన్త ఇమే దేహా నిత్యస్యోక్తా శ్శరీరిణః,
అనాశినోఽప్రమేయస్య తస్మా ద్యుధ్యస్వ భారత. ౧౮

అర్జునా! నిత్య మవినాశ • మప్రమేయ
మైన దీయాత్మ, దేహమ్ము • లంత మొందు
నవి యటంచుఁ జెప్పంబడె; • నాహవ మ్మొ
నర్పు! లే లెమ్మ! శాత్రవ • దర్ప మడఁపు! ౧౭

య ఏనం వేత్తి హన్తారం యశ్చైనం మన్యతే హతమ్,
ఉభౌ తౌ న విజానీతో నాయం హన్తి న హన్యతే. ౧౯

పూని యాత్మను చంపెడు • వానినిగను,
చంపఁబడుదానినిగను, ద • లంపు సేయు
వారు కేవలమూఢు, లీ • వస్తు వెపుడు
చంపఁబడదు, యథార్థంబు • చంపఁ బోదు. ౧౮

న జాయతే మ్రియతే వా కదాచి
న్నాయం భూత్వా భవితా వా న భూయః,
అజో నిత్య శ్శాశ్వతోఽయం పురాణో
న హన్యతే హన్యమానే శరీరే. ౨౦

వేదావినాశినం నిత్యం య ఏన మజ మవ్యయమ్,
కథం స పురుషః పార్థ కం ఘాతయతి హన్తి కమ్. ౨౧

ఏనాఁడు సంభవం • బెఱుఁగ దొక్కప్పుడై
నను వినాశనమును • గనఁగఁబోదు

స్వల్పకాలం బుండి • చనునదిగాదు పో
కలుగదు పో • కొంత • కాలమునకు,
ఆదిమధ్యాంతమై • యనవరతం బొక్క-
వడుపున నిత్యమై • వరలుచుండు,
నంతంబుఁ గనిన దే • హంబు నీదివ్యప
దార్థమ్ము నాశమ్ము • తాను గనదు,
ఎవ్వఁ డీయాత్మ నిత్యమై • యెసఁగు నంచు
నంత మొందదు నజము న • వ్యయ మటంచు
నెలమి గ్రహియించునో, యాతఁ • డెవరి నెట్లు
చంపుఁ? జపించు నెట్లు? వా • సవతనూజ! ౧౯

వాసాంసిజీర్ణాని యథా విహాయ నవాని గృహ్ణాతి నరోఽపరాణి,
తథా శరీరాణి విహాయ జీర్ణాన్యన్యానిసంయాతి నవాని దేహీ.

జీర్ణ వసనాళి నరుఁడు వ • ర్జించి నూత్న
వస్త్రధారణ మొనరించు • భాతి నాత్మ
శిథిలమౌ దేహముల వీడి • ప్రథితమౌ న
వీన దేహంబులను బొంది • వెలయుచుండు. ౨౦

నైనం ఛిన్దన్తి శస్త్రాణి నైనం దహతి పావకః,
న చైనం క్లేదయంత్యాపో న శోషయతి మారుతః. ౨౩

శస్త్రములు ఛేదనముఁజేయఁ • జాల వాత్మ
మీఁటి కాల్పంగఁ జాలదు • కాఱుచిచ్చు,

జలము సిక్త మొనర్పగాఁ ♦ జాల దెపుడు,
పవనునకు శోషిలం జేయ ♦ వలనుపడదు. ౨౧

అచ్ఛేద్యోఽయమదాహ్యోఽయమక్లేద్యోఽశోష్య ఏవచ,
నిత్యస్సర్వగత స్థాణు రచలోఽయం సనాతనః. ౨౪

చీల్పఁదగినదియునుగాదు, ♦ కాల్పఁదగిన
యదియునుంగాదు, తడిసెడు♦నదియుఁగాదు,
ఎండఁదగినదియునుగాదు, ♦ యిదిస్థిరమ్ము
స్థాణు వచల మనాదియు ♦ సర్వగతము. ౨౨

అవ్యక్తోఽయమచింత్యోఽయమవికార్యోఽయముచ్యతే,
తస్మా దేవం విదిత్వైనం నానుశోచితు మర్హసి. ౨౫

వ్యక్తముంగాక నవికార్య♦మై యచింత్య
మై చెలఁగునంచును వచింతు ♦ రార్యవరులు
శౌర! యీయాత్మ కాన నీ♦వరసి దీనిఁ
జింత నొక్కించు కేనియుఁ ♦ జెందఁదగవు. ౨౩

అథ చైనం నిత్యజాతం నిత్యం వా మన్యసే మృతమ్,
తథాపి త్వం మహాబాహో నైనం శోచితు మర్హసి. ౨౬

జాతస్య హి ధ్రువో మృత్యు ర్ధ్రువం జన్మ మృతస్య చ,
తస్మా దపరిహార్యేఽర్థే న త్వం శోచితు మర్హసి. ౨౭

అటులఁగా కాత్మ పుట్టుచు ♦ నంత మొందు
ననుచు నెంచినఁ జింతించు ♦ టనుచితమ్ము

పుట్టినది గిట్టు, గిట్టియుఁ ♦ బుట్టుఁ, గాన
నపరిహార్యార్థ మందు నీ♦కగునె? చింత. ౨౭

అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత,
అవ్యక్తనిధనా న్యేవ తత్ర కా పరిదేవనా. ౨౮

ఎఱుఁగఁగారాని, వాది నా ♦ కించుకైన
వ్యక్తమధ్యమ్ము, లెఱుఁగ రా ♦ వంత్యదశలు,
అర్జునా! భూతజాలము ♦ లట్టివాని
విషయమేల? నీ కీ పరి♦ వేదనంబు. ౨౮

ఆశ్చర్యవ త్పశ్యతి కశ్చి దేన
మాశ్చర్యవ ద్వదతి తథైవ చాన్యః
ఆశ్చర్యవచ్చైన మన్యశ్శృణోతి
శ్రుత్వా ప్యేనం వేద న చైవ కశ్చిత్. ౨౯

దీనిఁ గాంచు విచిత్రమా♦దానివోలెఁ,
బలుకునిటు లన్యుఁ డాశ్చర్య♦కలితముగను,
ఆలకించు నొకండు చి♦త్రార్థ్యముగను,
మఱియొకఁడు చూచి విని పల్కి ♦ యెఱుఁగఁబోఁడు.

దేహీ నిత్య మవధ్యోఽయం దేహే సర్వస్య భారత,
తస్మా త్సర్వాణిభూతాని న త్వం శోచితు మర్హసి. 30

ఏల విభ్రాంతి? పార్థ! పి♦పీలికాది
బ్రహ్మపర్యంతముంగూడ ♦ పరగుచుండు

నాత్మ, యెపుడు వినాశమ్మ • నందఁబోదు
గాన; విడు దుఃఖ మీభూత•గణముఁ గూర్చి. ౨౮

స్వధర్మమపి చావేక్ష్య న వికమ్పితు మర్హసి,
ధర్మ్యాద్ధి యుద్ధాచ్ఛ్రేయోఽన్యత్ క్షత్త్రియస్య నవిద్యతే.
యదృచ్ఛయా చోపపన్నం స్వర్గద్వార మపావృతమ్,
సుఖినః క్షత్త్రియాః పార్థ! లభన్తేయుద్ధమీదృశమ్. ౩౨

మఱియు స్వధర్మ మెన్న విను•మా! చలియింపఁగరాదు, ధర్మసం
గరమునకన్న నొండొకటి• గల్గునె? శ్రేయము క్షత్త్రియాళికే;
నరవరు లొందగాఁ గల ర•నావృతనాకకవాటముం బ్రియ
త్నరహితలబ్ధయుద్ధమును,•ధన్యతముల్ సుఖు లట్టివారలే. ౩౨

అథచేత్త్వం ధర్మ్య మిమం సంగ్రామం న కరిష్యసి,
తతస్స్వధర్మం కీర్తిం చ హిత్వా పాప మవాప్స్యసి. ౩౩
అకీర్తించాపి భూతాని కథయిష్యన్తి తేఽవ్యయామ్,
సంభావితస్య చాకీర్తి ర్మరణా దతిరిచ్యతే. ౩౪

అరయఁగ నిట్టిధర్మమున • కాశ్రయమౌ నని సేయ వేని, భా
స్వరయశముఁ స్వధర్మమును•బాసియు కాంతువు ఘోరపాపముఁ,
నిరత ముపన్యసించెదరు • నీయపకీర్తినిఁ గూర్చి యెల్లరుఁ,
మరణమె మేలుగా యశము•మాసిన, గౌరవ మెంచువానికిఁ.

భయా ద్రిణా దుపరతం మన్యన్తే త్వాం మహారథాః,
యేషాంచ త్వంబహుమతో భూత్వా యాస్యసి లాఘవమ్.

నేటివర కేమహారథుల్ ♦ నిన్ను గార
వముగఁ దిలకించుచుండిరో ♦ వార లెల్ల
తమకు భయ మొంది నీవు యు♦ద్ధమును వీడి
తంచు నతిలాఘవముగ నీ♦గాంచుచుంద్రు. 30

అవాచ్యవాదాంశ్చ బహూన్ వదిష్యన్తి తవాఽహితాః,
నిన్దన్త స్తవ సామర్థ్యం తతో దుఃఖతరం ను కిమ్. 36

నీదుసామర్థ్యమునుగూర్చి ♦ నీయహితులు
నధికనింద యొనర్చుచు ♦ ననవరతము
నుడువరానివాక్యమ్ముల ♦ నుడువుచుంద్రు,
రింతకంటెను దుఃఖ మిం♦ కేమిగలదు? 37

హతో వా ప్రాప్స్యసే స్వర్గం జిత్వావా భోక్ష్యసే మహీమ్,
తస్మాదుత్తిష్ఠ కౌన్తేయ! యుద్ధాయ కృతనిశ్చయః. 32

సంగరహతుండ వగు దేని ♦ స్వర్గసుఖము
ననుభవింతువు, విజయమ్మ♦నంద రాజ్య
భోగములఁ జూఁడఁ గొందువు, ♦ భువినిఁ గాన
నని సలుప లెమ్మ! కృతనిశ్చ♦యతను పార్థ! 39

సుఖదుఃఖే సమే కృత్వా లాభాలాభౌ జయాజయౌ,
తతో యుద్ధాయ యుజ్యస్వ నైవం పాపమవాప్స్యసి. 38

అపజయమ్మును జయము సౌఖ్యమ్ము నార్తి
లాభనష్టమ్ము లెల్లఁ దలంచి సమము
లంచు లే లెమ్ము! పిమ్ము టాహవ మొనర్ప
మట్టిచో కిల్బిషమ్ము నిన్నంటఁబోదు. 33

ఏషా తేఽభిహితా సాంఖ్యే బుద్ధిర్యోగే త్విమాం శృణు,
బుద్ధ్యా యుక్తో యయా పార్థ కర్మబన్ధం ప్రహాస్యసి. 39
నేహాభిక్రమనాశోఽస్తి ప్రత్యవాయో న విద్యతే;
స్వల్పమప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్.
వ్యవసాయాత్మికా బుద్ధి రేకేహ కురునన్దన,
బహుశాఖా హ్యనన్తాశ్చ బుద్ధయోఽవ్యవసాయినామ్.

నీకు సద్బుద్ధిని నే బోధఁ జేసితి
సాంఖ్యసిద్ధాంతాను సారముగను,
బలికెద నిక యోగ వాదమ్ము ననుసరిం
చియు నిద్ది నీ వాశ్రయించితేనిఁ,
గర్మబంధమ్ములఁ గట్టువడవు దీన
నారంభనాశన మనఁగ లేదు,
ప్రత్యవాయము లేదు బహుస్వల్ప మైనను,
నధిక భయమ్ముల నపహరించు

నీవిధానమ్మునందున • నేక మగుచు
నిశ్చయాత్మకమగుబుద్ధి • నెగడుచుండు,
నధికశాఖ లనంతము • లౌననిశ్చ
యాళిబుద్ధులు తలఁప పృథాత్మజాత ! ౪౪

యా మిమాం పుష్పితాం వాచం ప్రవద న్త్యవిపశ్చితః,
వేద వాదరతాః పార్థ! నాన్యద స్తీతి వాదినః ౪౨

కామాత్మానస్స్వర్గపరా జన్మకర్మఫలప్రదామ్,
క్రియావిశేషబహుళాం భోగైశ్వర్యగతిం ప్రతి. ౪౩

భోగైశ్వర్యప్రసక్తానాం తయాఽపహృతచేతసామ్,
వ్యవసాయాత్మికా బుద్ధిస్సమాధౌ న విధీయతే. ౪౪

వేదవాదరతులు • లే దన్య మిద్దాని
కంచు నెక్కుడుగ వాదించువారు
కామాత్మకులును స్వర్గంబె సర్వోత్తమ
పురుషార్థ మనువారు • మూఢమతులు
జన్మకర్మఫలాళి • సంఘటించెడునది
ప్రథితభోగైశ్వర్య•పదవిఁ గూర్చు
సర్వక్రియావి శే•షకము పుష్పితమునౌ
వచనమ్ము నెవ్వారు • వల్కిరొకొ
యట్టివాక్యాపహృతచిత్తు • లైనవారు
సమధికైశ్వర్యభోగాను•సక్తులైన

వారికి సమాధియందైనఁ • బడయరాదు
నిశ్చయాత్మకమా బుద్ధి • నిశ్చయంబు. 3౫

త్రైగుణ్యవిషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున,
నిర్ద్వన్ద్వో నిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్. ౪౫
వేదములు పార్థ! త్రైగుణ్య•విషయకములు
యోగకుశలగుణత్రియ•త్యాగుఁడవును
ద్వంద్వరహితుఁడ వనిశస•త్త్వస్థుఁ డవును
ఆత్మవంతుఁడవై యుండు • టర్హ మీవు. 3౬

యావానర్థ ఉదపానే సర్వత స్సంప్లుతోదకే,
తావాన్ సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః. ౪౬
అర్థ మెంతయు నుదపాన•మందుఁగల్గు
నంతియే సంప్లుతోదక•మందుఁగల్గు
నఖిలవేదములం దెంత • యర్థ మొదవు
జ్ఞానియావాని కంతియే • సంభవించు. 3౭

కర్మణ్యేవాధికార స్తే మా ఫలేషు కదాచన,
మా కర్మఫలహేతుర్భూర్మా తే సఙ్గోఽస్త్వకర్మణి. ౪౭
నిత్యకర్మాధికారమే•నీకుఁ గలదు
తత్ఫలాధికారంబు నుం•తయును వలదు
కర్మఫలకారణుండవు • గాకు మెపుడు
గాని, కర్మ లనుష్ఠించు•కాంక్ష విడకు. 3౮

యోగస్థః కురు కర్మాణి సఙ్గం త్యక్త్వా ధనఞ్జయ,
సిద్ధ్యసిద్ధ్యోస్సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే. ౪౮

సిద్ధ్యసిద్ధుల సముఁడవై • వెలఁగియుండి
సంగరహితుఁడవై కర్మ • సలుపు మెపుడు
యోగనిష్ఠాత్మకుండవై • యుండ నగును
సమముగా నుంటయే యోగ•సరణి పార్థ! ౩౯

దూరేణ హ్యవరం కర్మ బుద్ధియోగా ద్ధనఞ్జయ,
బుద్ధౌ శరణ మన్విచ్ఛ కృపణాః ఫలహేతవః. ౪౯

కామవిరహితకర్మల•కంటె కామ
కర్మములు క్షుద్రములు, నిట్టి • కర్మములకుఁ
బాల్పడెడువారె దీనులు • పరిబలహీను
లగు, సమత్వబుద్ధినె సదా • యాశ్రయింపు. ౪౦

బుద్ధియుక్తో జహాతీహ ఉభే సుకృతదుష్కృతే,
తస్మాద్యోగాయ యుజ్యస్వ యోగః కర్మసు కౌశలమ్. ౫౦

సామ్యబుద్ధిగల్గు•జనముల నెన్నఁడుఁ
దొడరఁబోవు సుకృత•దుష్కృతములు
గాన యోగసిద్ధి•కై యత్న మొనరింపు
మదియె కర్మకౌశ•లాభివృద్ధి. ౪౧

కర్మజం బుద్ధియుక్తా హి ఫలం త్యక్త్వా మనీషిణః,
జన్మబంధవినిర్ముక్తాః పదం గచ్ఛన్త్యనామయమ్. ౫౧

ఫల్గునా! బుద్ధియుక్తులౌ • పండితాళి
వివిధకర్మఫలంబుల • విడచివైచి
జన్మబంధనిర్ముక్తులై • సర్వభద్ర
యుతపదమ్మును బొందుచు • నున్నవారు. ౪౨

యదా తే మోహకలిలం బుద్ధిర్వ్యతితరిష్యతి,
తదా గన్తాసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్య చ. ౫౨

అరయ నీబుద్ధి వ్యామోహ•మనెడుకలుష
మెపుడు తరియింపఁగల్గునో • యపుడె నీవు
వినఁదగినయట్టిదానికి • వినినదాని
కౌర! నిర్వేదభావమ్ము • నందఁగలవు. ౪౩

శ్రుతివిప్రతిపన్నా తే యదా స్థాస్యతి నిశ్చలా,
సమాధావచలా బుద్ధిస్తదా యోగమవాప్స్యసి. ౫౩

వివిధవేదాంతవాక్యము • ల్వినుటచేత
సంచలించునీబుద్ధి ని•శ్చలము నగుచు,
నెప్పుడు సమాధి నచలమై • యొనఁగఁ గలదొ
యప్పుడే నీవు యోగమ్ము • నందఁగలవు. ౪౪

స్థితప్రజ్ఞస్య కా భాషా? సమాధిస్థస్య కేశవ!,
స్థితధీః కిం ప్రభాషేత? కి మాసీత వ్రజేత కిమ్? ౫౪

అనఘ! యీసమాధి • నలరు స్థితప్రజ్ఞు
భాష యేమి? పల్కు•పల్కు లేమి?
యెటులఁ గూరుచుండు? • నెటు ప్రవర్తించును?
ఏమిపొందుఁ దెల్పు• మో మహాత్మ! ౪౫

ప్రజహాతి యదా కామాన్ సర్వాన్ పార్థ మనోగతాన్,
ఆత్మన్యే వాత్మనా తుష్టః స్థితప్రజ్ఞ స్తదోచ్యతే. ౫౫

పార్థ! యెప్పట్టునందున • ప్రత్యగాత్మ
యందె సంతుష్టి నందుచు • నాత్మచేత,
నెపుడు త్యజియించునో మనోగ• తేచ్ఛ లెల్ల
పలుకఁబడు నప్పుడే స్థిత•ప్రజ్ఞుఁ డనుచు. ౪౬

దుఃఖేష్వనుద్విగ్నమనా స్సుఖేషు విగతస్పృహః,
వీతరాగభయక్రోధః స్థితధీ ర్ముని రుచ్యతే. ౫౬

ఆర్తి నుద్విగ్నముఁ జెంద•నట్టివాఁడు,
ఆశలేనట్టివాఁడు సౌ•ఖ్యమ్ము లందు,
భయము రాగమ్ము క్రోధమ్ముఁ • బాయు మౌని
వర్యుఁడే పల్కఁబడు స్థిత•ప్రజ్ఞుఁ డనుచు. ౪౭

యస్సర్వత్రానభిస్నేహ స్తత్తత్ప్రాప్య శుభాశుభమ్,
నాభినన్దతి న ద్వేష్టి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా. ౫౭

పార్థ! సర్వత్ర స్నేహభా•వమ్ము లేని
వాఁడయి, శుభాశుభమ్ములఁ • బడసినపుడు
సంతసమ్మును ద్వేష మా • వంత లేకఁ
జెలఁగునాతనిబుద్ధియే • స్థిరతరంబు. ౭౮

యదా సంహరతే చాయం కూర్మోఽఙ్గానీవ సర్వశః,
ఇన్ద్రియాణీన్ద్రియార్థేభ్య స్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా. ౫౮

ఎపుడు కూర్మాంగములభాతి • నింద్రియముల
నంతటను సర్వవిషయమ్ము•లందునుండి
యోగి యుపసంహృతిని జేయు•నొక్కొ? యపుడ
యతనిబుద్ధి ప్రతిష్ఠితం•బై తనర్చు. ౭౯

విషయా వినివర్తన్తే నిరాహారస్య దేహినః,
రసవర్జం రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే. ౫౯

దేహధారి నిరాహార•దీక్షఁ గనిన
వానివిషయాళి క్షీణించు • వాంఛ దక్క
నాస్థితప్రజ్ఞునకు రాగ • మంత మొందు
భళిర! పరమాత్మదర్శన•భాగ్యమునను ౮౦

యతతో హ్యపి కౌన్తేయ! పురుషస్య విపశ్చితః,
ఇన్ద్రియాణి ప్రమాథీని హరన్తి ప్రసభం మనః. ౬౦

భళిర! పరమాత్మదర్శన॰భాగ్యమునకు
యత్న మొనరించుజ్ఞానికి ॰ నడ్డు దగిలి
యింద్రియానీక మాతని॰హృదయము బల
వంతముగ హరియించును ॰ పాండుతనయ! ౫౧

తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీత మత్పరః.
వశే హి యస్యేన్ద్రియాణి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా. ౬౧

ఆనమస్తేంద్రియముల సం॰యమ మొనర్చి
యోగి నాయందె సక్తుఁడై ॰ యుండవలయు;
నేని కింద్రియవితతి స్వా॰ధీన మగునొ,
వానిబుద్ధియె స్థిరమయి ॰ వరలుచుండు. ౫౨

ధ్యాయతో విషయాన్ పుంస స్సఙ్గ స్తేషూపజాయతే,
సఙ్గాత్సఞ్జాయతే కామః కామాత్క్రోధోఽభిజాయతే. ౬౨

పురుషునకుఁ గల్గువిషయసం॰స్మరణచేత
వానియందున నాసక్తి ॰ వఱలు; దానఁ
గోర్కె యుద్భవమందు; నా॰కోర్కెవలన
సంభవం బందు క్రోధమ్ము ॰ సత్య మిద్ది. ౫౩

క్రోధాద్భవతి సమ్మోహః సమ్మోహాత్స్మృతివిభ్రమః,
స్మృతిభ్రంశాద్బుద్ధినాశో బుద్ధినాశాత్ప్రణశ్యతి. ౬౩

పుట్టు నవివేక మా క్రోధ ♦ మునను; దాన
స్మరణశక్తి యడంగును; ♦ స్మరణశక్తి
నాశనము నొంద బుద్ధి వి ♦ నాశ మందు,
నంతరించిన బుద్ధి, తా ♦ నంతరించు. ౧౪

రాగద్వేషవియుక్తైస్తు విషయా నిన్ద్రియైశ్చరన్,
ఆత్మవశ్యై ర్విధేయాత్మా ప్రసాద మధిగచ్ఛతి. ౬౪

ప్రసాదే సర్వదుఃఖానాం హాని రస్యోపజాయతే,
ప్రసన్నచేతసో హ్యాశు బుద్ధిః పర్యవతిష్ఠతి. ౬౫

నాస్తి బుద్ధిరయుక్తస్య నచాయుక్తస్య భావనా,
న చాభావయతశ్శాన్తి రశాన్తస్య కుతస్సుఖమ్. ౬౬

ఏనాఁ డెఱుంగక ♦ నెవ్వానికరణముల్
రాగ మప్రియమును ♦ రహిఁ జెలంగు
నెవ్వానిమానసం ♦ బెల్లవేళల స్వకీ
యాజ్ఞానువర్తియై ♦ యలరుచుండు
నాపూరుషుం డింద్రి ♦ యములచే విషయాళిఁ
జరియించుచుండి స్వ ♦ చ్ఛత వహించు

నిర్మలయుక్తుఁడై ♦ నెగడెడు యోగికి
సకలదుఃఖమ్ములు ♦ సమసిపోవు
ధరఁ బ్రసన్నాత్మబుద్ధి సు♦స్థిరత నొందు
భావనయు బుద్ధియు నయుక్తుఁ ♦ బాసియుండు
భావనాశూన్యునకు శాంతిఁ ♦ బడయరాదు
శాంతిలేకున్న సుఖ మెట్లు ♦ సంఘటిల్లు? ౫౫

ఇన్ద్రియాణాం హి చరతాం యన్మనోఽనువిధీయతే,
తదస్య హరతి ప్రజ్ఞాం వాయుర్నావమివామ్భసి. ౬౭

ఇంద్రియమ్ముల వెనువెంట♦నే మనంబు
పార్థ! నియమింపఁబడకయె ♦ పరుగు లిడునొ?
ఆమనము వానిదౌ ప్రజ్ఞ ♦ నపహరించు
జలమునున్న నావను ప్రభం♦జనునిభాతి. ౫౬

తస్మాద్యస్య మహాబాహో నిగృహీతాని సర్వశః,
ఇన్ద్రియాణీన్ద్రియార్థేభ్యస్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా. ౬౮

కాన నెవ్వానియింద్రియ♦గణము తలఁప
నంతటను నింద్రియార్థంబు♦లందునుండి
నిగ్రహింపగఁబడి తన♦నియతి నుండు
వానిబుద్ధియె స్థిరతర♦వర్తి యగును. ౫౭

యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ,
యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః. ౬౯

అఖిలభూతమ్ములకు నేది ♦ యంధకార,
మదియె యోగికి జాగ్రత ♦ మై చెలంగు,
సకలభూతమ్ములకు నేది ♦ జాగ్రత యగు,
నంధకారమ్మ దాని క♦య్యదియె సుమ్మి. ౬౯

ఆపూర్యమాణ మచలప్రతిష్ఠం
సముద్ర మాపః ప్రవిశన్తి యద్వత్,
తద్వత్కామా యం ప్రవిశన్తి సర్వే
స శాన్తి మాప్నోతి న కామకామీ. ౭౦

పొందు నచలప్రతిష్ఠ మా♦పూర్యమాణ
మగుసముద్రమ్మ నెట్టుల ♦ నన్యజలము,
లటులనే సర్వకామంబు♦లందు నెవని,
గను నతఁడె శాంతి, పొందఁడు ♦ కామకామి. ౭౦

విహాయ కామా న్యస్సర్వా న్పుమాంశ్చరతినిస్పృహః,
నిర్మమో నిరహఙ్కారస్స శాన్తిమధిగచ్ఛతి. ౭౧

ఎవఁడు కామమ్ములం ద్యజి♦యించి యధిక
నిస్పృహుండయి, విడనాడి ♦ నేను నాది

యనెడు సంకల్ప, మభిమాన ♦ మడఁచి తిరుగు
నట్టిపురుషుండు శాంతిని ♦ యధిగమించు ౭౦

ఏషా బ్రాహ్మీ స్థితిః పార్థ! నైనాం ప్రాప్య విముహ్యతి,
స్థిత్వాఽస్యామన్తకాలేఽ పి బ్రహ్మనిర్వాణమృచ్ఛతి. ౭౨

పార్థ! యీనిష్ఠ బ్రహ్మసం♦భవముగానఁ
బడయ నీస్థితి, మోహమ్ము♦పాలఁ బడఁడు
ఔర! యీనిష్ఠ నిలచిన ♦ నంత్యకాల
మందయిన బ్రహ్మనిర్వాణ ♦ మందఁగలరు. ౭౧

# మూడవయధ్యాయము

## కర్మయోగము

జ్యాయసీ చేత్కర్మణ స్తే మతా బుద్ధి ర్జనార్దన,
తత్కిం కర్మణి ఘోరే మాం నియోజయసి కేశవ! ౧

కర్మమునకన్న బుద్ధియే ♦ ఘన మటంచు
నీవు భావింపుచుండిన ♦ నీరజాక్ష!
యేలఁ? బురిగొల్పుచున్నాఁడ ♦ వీమహోగ్ర
కర్మల నొనర్పఁగా నన్ను ♦ నిర్మలాత్మ! ౧

వ్యామిశ్రేణేవ వాక్యేన బుద్ధిం మోహయసీవ మే,
తదేకం వద నిశ్చిత్య యేన శ్రేయోఽహమాప్నుయామ్. ౨

సంశయగ్రస్తమైన వాక్యమితి నాదు
బుద్ధి నెంతయు మోహంబుఁ ♦ బొందఁజేయు
చుంటి; వీజ్ఞానకర్మల ♦ రెంట నొకటిఁ
దెల్పుమా! నాకు శ్రేయమ్ము ♦ సల్పుదాని. ౨

లోకేఽస్మిన్ ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయాఽనఘ,
జ్ఞానయోగేన సాఙ్ఖ్యానాం కర్మయోగేన యోగినామ్. 3

అధిప! నాచేత పూర్వ మీ♦యవనియందు
ద్వివిధమగునట్టినిష్ఠలు ♦ దెల్పఁబడియె,
సాంఖ్యులకు జ్ఞానయోగాను♦సరణ మనుచు,
యోగులకుఁ గర్మయోగంబు ♦ యుక్త మనుచు. 3

న కర్మణామనారమ్భాన్నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే,
స చ సన్న్యసనాదేవ సిద్ధిం సమధిగచ్ఛతి. ౪

శ్వేతవాహన! కర్మలఁ ♦ జేయ కున్నఁ
బొందలేఁడు నైష్కర్మ్యంబు ♦ పురుషుఁ డెప్డు;
డరయఁగా సన్న్యసించిన♦యంతమాత్రి
సిద్ధి నావంతయేనియుఁ ♦ జెందఁబోఁడు. ౪

నహి కశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠ త్యకర్మకృత్,
కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజైర్గుణైః. ౫

కర్మల నొనర్పకయ క్షణ♦కాల మేని
యుండఁజాలఁడు నిక్కువ ♦ మొక్కఁ డేనిఁ
బ్రకృతిగుణములఁ జేయింపఁ♦బడుచునుండు
నవశుఁడై ప్రతిజీవి క♦ర్మాళి తాను. ౫

కర్మేన్ద్రియాణి సంయమ్య య ఆస్తే మనసా స్మరన్,
ఇన్ద్రియార్థాన్ విమూఢాత్మా మిథ్యాచారస్స ఉచ్యతే. ౬

ఎవఁడు కర్మేంద్రియమ్ముల • నెల్ల నిగ్ర
హమ్ము గావించి ప్రీతి శ • బ్దాదివిషయ
చింతన మొనర్చుచుండునో • చిత్తమందు
నార! మూఢుండు డాంబికా • చారి వాఁడె. ౬

యస్త్విన్ద్రియాణి మనసా నియమ్యారభతేఽర్జున,
కర్మేన్ద్రియైః కర్మయోగ మసక్తస్స విశిష్యతే. ౭

ఎవఁడు జ్ఞానేంద్రియమ్ముల • నెల్ల మనము
చేత స్వాధీన మందఁగాఁ • జేసికొనియు,
ఫలరహితవృత్తి కర్మాంగ • ములను, గర్మ
యోగ మారంభముం జేయు, • యోగ్యుఁ డతఁడె ౭

నియతం కురు కర్మ త్వం కర్మ జ్యాయో హ్యకర్మణః,
శరీరయాత్రాఽపి చ తే న ప్రసిద్ధ్యేదకర్మణః. ౮

కాన నీవు నియత • కర్మ లొనర్పుము
కర్మరహితవృత్తి • కంటె, కర్మ
సహితవృత్తి మేలు, • సల్ప కున్నను గర్మ,
చేయ దుర్ఘటంబు • జీవయాత్ర. ౮

యజ్ఞార్థాత్కర్మణోఽన్యత్ర లోకోఽయం కర్మబన్ధనః,
తదర్థం కర్మ కౌన్తేయ! ముక్తసఙ్గ స్సమాచర. ౯

కట్టి! యజ్ఞార్థమౌ కర్మ • కంటె నన్య
కర్మముల బంధనప్రాప్తి • గలుగుచుండుఁ,
గావునఁ దదర్థమైనట్టి • కర్మ మీవు
సంగరహితుండ వగుచును • జలుపఁదగును. ౯

సహయజ్ఞాః ప్రజాస్సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః,
అనేన ప్రసవిష్యధ్వ మేష వోఽ స్త్విష్టకామధుక్. ౧౦

యజ్ఞములతోడఁ గూడిన • యట్టిప్రజల
నజుఁడు సృజియించి పూర్వమం • దనియె నిట్లు,
యజ్ఞములచేత సృష్టింప • నౌను బ్రజల,
నివి యభీష్టమ్ము లెల్ల మీ • కిడును గాత! ౧౦

దేవాన్భావయతాఽనేన తే దేవా భావయన్తు వః,
పరస్పరం భావయన్త శ్శ్రేయః పర మవాప్స్యథ, ౧౧

వృద్ధిసేయుఁడు యజ్ఞాళి • నెల్లసురల,
వృద్ధిఁ బొందించెదరు వార • లెల్ల మిమ్ము,
మీరలు పరస్పరమ్ము పే్ర • మించుకొనుచు
నుత్తమశ్రేయ మందఁగ • నొందఁగలరు. ౧౧

ఇష్టాన్ భోగాన్ హి వో దేవా దాస్యన్తే యజ్ఞభావితాః,
తైర్దత్తా న ప్రదాయైభ్యో యో భుఙ్క్తే స్తేన ఏవ సః. ౧౨

యజ్ఞములచేత సంతుష్టు ♦ లై సురలు
నెమ్మి నిడెద రభీష్టభో ♦ గమ్ము లెల్ల,
వార లిచ్చిన వీయక ♦ వారి కెవ్వఁ
డనుభవించునో; చోరుఁ డా ♦ నతఁడు ధ్రువము. ౧౨

యజ్ఞశిష్టాశిన స్సన్తో ముచ్యన్తే సర్వకిల్బిషైః,
భుఞ్జతే తే త్వఘం పాపా యే పచన్త్యాత్మకారణాత్. ౧౩

యజ్ఞశేషాన్నము భుజింప ♦ నఖిలకిల్బి
షాళినుండి విముక్తి తా ♦ నందఁగలఁడు
పచన మొనరించు నెవ్వఁడు ♦ స్వార్థమునకు
నట్టిపాపుండు పాపమే ♦ యనుభవించు. ౧౩

అన్నాద్భవన్తి భూతాని పర్జన్యాదన్నసమ్భవః,
యజ్ఞాద్భవతి పర్జన్యో యజ్ఞః కర్మసముద్భవః. ౧౪
కర్మ బ్రహ్మోద్భవం విద్ధి బ్రహ్మాక్షరసముద్భవమ్,
తస్మాత్సర్వగతం బ్రహ్మ నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితమ్. ౧౫

అన్నమ్మువలన భూ ♦ తానీక ముద్భవం
బందు, తదన్నమ్ము ♦ నావహిల్లుఁ

బర్జన్యువలన, నా♦పర్జన్యుఁ డావిర్భ
వించును బో యజ్ఞ♦వితతినుండి,
తలపఁ దత్క్రతుసము♦దాయంబు పుట్టొందుఁ
బ్రథితమా కర్మక♦లాపమునను,
బ్రహ్మమ్మునుండి సం♦భవముగాంచె నటంచుఁ
దలఁపుమా కర్మవి♦ధాన మెల్ల,
బ్రహ్మ మక్షరమున సము♦ద్భవము నొందుఁ,
గాన సర్వత్ర వ్యాప్తినిఁ ♦ గాంచినట్టి
పరమపావనమైన త♦ద్బ్రహ్మ మెపుడు
యజ్ఞమునఁ బ్రతిష్ఠితమగు ♦ ననఘచరిత! ౧౪

ఏవం ప్రవర్తితం చక్రం నానువర్తయతీహ యః,
అఘాయురిన్ద్రియారామో మోఘం పార్థ! స జీవతి. ౧౬

అనఘ! యిటులఁ బ్రవర్తిత♦మైన చక్ర
మిహమునం దనువర్తింప ♦ డెవఁడు, వాఁడు
విషయలోలత్వమునను జీ♦వితము ఘోర
పాపపంకిలముగఁ జేసి ♦ వ్యర్థుఁ డగును. ౧౫

యస్త్వాత్మరతిరేవ స్యాదాత్మతృప్తశ్చ మానవః,
ఆత్మన్యేవ చ సన్తుష్టస్తస్య కార్యం న విద్యతే. ౧౭

ఆత్మయందె రమింపుచు, ♦ నాత్మయందె
యపరిమితమోద మందుచు, ♦ నాత్మచేతఁ

దృష్టుఁడా నెవ్వఁ డట్టియా◆ధీనిధికిని
గవ్వడీ! లేదు చేసెడు◆కార్య మేమి. ౧౭

నైవ తస్య కృతేనార్థో నాకృతేనేహ కశ్చన,
న చాస్య సర్వభూతేషు కశ్చి దర్థవ్యపాశ్రియః. ౧౮

అనఘ! తద్బ్రహ్మనిష్ఠున ◆ కవనియందుఁ
గర్మచే నర్థ మొక్కింత ◆ కలుగఁబోదు,
చేయకున్న నుంతయు హాని ◆ చెంద దతని,
కఖిలజీవుల నర్థాశ్రి◆యమ్ము లేదు. ౧౮

తస్మాదసక్త స్సతతం కార్యం కర్మ సమాచర,
అసక్తో హ్యాచరన్ కర్మ పర మాప్నోతి పూరుషః. ౧౯

కావున ఫలాశ వర్జించి ◆ నీవు సతముఁ
జేయఁదగినకార్యంబులఁ ◆ జేయు మయ్య!
ఫలపరిత్యక్తకర్మలఁ ◆ జలుపునట్టి
పురుషవర్యుండు మోక్షంబుఁ ◆ బొందఁగలఁడు. ౧౯

కర్మణైవ హి సంసిద్ధి మాస్థితా జనకాదయః,
లోకసఙ్గ్రహ మేవాపి సంపశ్యన్ కర్తుమర్హసి. ౨౦

జనకుఁడాదిమైన ◆ సజ్జను ల్కర్మల
నాచరించి సిద్ధి ◆ నంది రార!

సవ్యసాచి! లోక॰సంగ్రహార్థము కర్మ
లాచరింపఁదగుదు॰వయ్య! నీవు. ౧౯

యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్తదే వేతరో జనః,
స యత్ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే. ౨౧

అరయ నుత్తముఁ డెద్దాని ॰ నాచరించు,
నాచరింతురు దానినే ॰ యన్యులెల్ల,
రాతఁ డెట్టిప్రమాణమ్ము ॰ ననుసరించు,
ననుసరింతురు దానినే ॰ యఖిలజనులు. ౨౦

న మే పార్థాఽస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన,
నానవాప్త మవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి. ౨౨

నాకుఁ గర్తవ్య మెద్ది ము॰ల్లోకములను
లేదు, పడయంగరానిది ॰ లేదు, పడయఁ
దగినయదియును లేదు, పృ॰థాతనూజ!
కాని వర్తింపుచుంటి నేఁ ॰ గర్మమందు. ౨౧

యది హ్యహం న వర్తేయం జాతు కర్మణ్యతన్ద్రితః,
మమ వర్త్మానువర్తన్తే మనుష్యాః పార్థ! సర్వశః. ౨౩

అపరిమత్తుఁడ నగుచు నొ॰కప్పుడైన
నేను గర్మల నొనరింప॰నేని పార్థ!

సర్వవిధములచేతఁ బ్ర♦జాచయమ్ము
లనుసరింతురు నామార్గ ♦ మనఘచరిత! ౨౨

ఉత్సీదేయు రిమే లోకా న కుర్యాం కర్మ చేదహమ్,
సఙ్కరస్య చ కర్తా స్యాముపహన్యా మిమాః ప్రజాః. ౨౪

నేను గర్మకలాపంబు ♦ నెఱపకున్న
నఖిలజనములు చెడిపోదు ♦ రయ్య పార్థ!
ప్రజల నెల్లను జెఱచిన♦వాఁడ నగుదుఁ
గర్త నౌదు నే సంకర♦కార్యమునకు. ౨౩

సక్తాః కర్మణ్యవిద్వాంసో యథా కుర్వన్తి భారత!
కుర్యాద్విద్వాం స్తథాఽసక్తశ్చికీర్షుర్లోకసఙ్గ్రహమ్. ౨౫

ఫల్గునా! సక్తు లగుచు న♦పండితాళి
యాచరించెద రెటు కర్మ ♦ లావిధంబ,
కాక సక్తుండు లోకసం♦గ్రహముఁ గోరి
జ్ఞాని కర్మల నొనరింపఁ ♦ బూను విజయ! ౨౪

న బుద్ధిభేదం జనయే దజ్ఞానాం కర్మసఙ్గినామ్,
జోషయేత్సర్వకర్మాణి విద్వాన్ యుక్తస్సమాచరన్. ౨౬

జ్ఞాని కర్మానుషంగియౌ ♦ జ్ఞానహీను
బుద్ధిని జలింపఁగాఁజేయఁ ♦ బోల దెపుడు;

సేయుచును బూని, వారలఁ జేతఁగూడఁ
గర్మ లెల్లను జేయింపఁ గా వలయును. ౨౭

ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః,
అహఙ్కారవిమూఢాత్మా కర్తాఽహ మితి మన్యతే. ౨౭

ప్రకృతిసంబంధమగు గుణప్రతతిచేతఁ
జలుపఁబడు సర్వకర్మసంచయమునకును
గర్త నే నాదునని, యహంకారమూఢ
చిత్తుఁడగు నాతఁడు తలంపుఁ జేయుచుండు. ౨౮

తత్త్వవిత్తు మహాబాహో! గుణకర్మ విభాగయోః,
గుణాగుణేషు వర్తన్త ఇతి మత్వా న సజ్జతే. ౨౮

అర్జునా! గుణకర్మంబులందు భేద
మరసి తెలిసినవాఁ, డింద్రియములు గుణము
లందు వర్తించుచుండు నంటంచుఁ దలఁచి
వాఁడు సక్తుండు గాఁడు నిక్కం బొకింత. ౨౭

ప్రకృతే ర్గుణసమ్మూఢా స్సజ్జన్తే గుణకర్మసు,
తానకృత్స్నవిదో మన్దాన్ కృత్స్నవి న్నవిచాలయేత్. ౨౯

ప్రకృతిగుణముల మూఢులై పరగి యేరు
కోరి గుణకర్మములయందుఁ గూడుకొనియు

నజ్ఞులై మందులై యుందు ♦ రట్టివారి
నార! చలియింపఁజేయరా ♦ దాత్మవిదుఁడు. ౨౮

మయి సర్వాణి కర్మాణి సన్న్యస్యాఽధ్యాత్మచేతసా,
నిరాశీర్నిర్మమో భూత్వా యుధ్యస్వ విగతజ్వరః. ౩౦

సర్వకర్మలు నాయందె ♦ సంఘటించి
స్థిరతరంబగు నధ్యాత్మ♦చిత్తమునను,
విడి మమత్వంబు, నాశను ♦ వెడల నడఁచి,
సంగర మొనర్పుమా గత♦జ్వరుఁడ వగుచు. ౨౯

యే మే మత మిదం నిత్య మనుతిష్ఠన్తి మానవాః,
శ్రద్ధావన్తోఽనసూయన్తో ముచ్యన్తే తేఽపి కర్మభిః. ౩౧

మానియు నసూయ, శ్రద్ధాస♦మన్వితు లయి,
యింతవఱ కేను నుడివిన♦యీమతంబు
ననవరత మాచరించిన♦యట్టిజనులు
కర్మశృంఖలములచేతఁ ♦ గట్టువడరు. ౩౦

యే త్వేతదభ్యసూయన్తో నానుతిష్ఠన్తి మే మతమ్,
సర్వజ్ఞానవిమూఢాం స్తాన్ విద్ధి నష్టా నచేతసః. ౩౨

ఎవరు మద్బోధితంబైన ♦ యీమతంబు
స్వీకరింపక, నిందను ♦ జేతు రొక్కొ,
మూర్ఖులై సర్వవిజ్ఞాన♦మూఢు లగుచు
నర్జునా! వారు నశియింతు♦రం చెఱుంగు. ౩౧

సదృశం చేష్టతే స్వస్యాః ప్రకృతే ర్జ్ఞానవా నపి,
ప్రకృతిం యాన్తి భూతాని నిగ్రహః కిం కరిష్యతి. 33

తనస్వభావానుగుణ్యవ ర్తనమె సల్పు
నరయ నెంతటివిజ్ఞాని ◆ యైనఁగాని
యఖిలజీవులు ప్రకృతినే ◆ యనుసరింతు
రౌర! నిగ్రహ మేమి సే◆యంగఁగలదు? 3౨

ఇన్ద్రియ స్యేన్ద్రియ స్యా ర్థే రాగ ద్వేషౌ వ్యవస్థితౌ,
తయో ర్న వశ మాగచ్ఛే త్తౌ హ్యస్య పరిపన్థినౌ. 3౪

ఎనఁగు ద్వేషమ్ము రాగమ్ము ◆ నిందిర్రియాళి
సర్వవిషయమ్ములందున ◆ సంగతముగ,
నట్టివానికి స్వాధీన ◆ మగుట తగదు
ఘోరశత్రువు లయ్యవి ◆ పూరుషునకు. 33

శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మా త్స్వనుష్ఠితాత్,
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః. 3౫

మాన్యముగఁజేయు నన్యధ◆ర్మంబుకంటె
స్వీయధర్మం బగుణమైన ◆ శ్రేష్ఠమౌను,
శ్రేయమౌ మరణమైన స్వ◆కీయధర్మ,
మన్యధర్మంబు మిగుల భీ◆త్యావహంబు. 3౮

అథ కేన ప్రయుక్తోఽయం పాపం చరతి పూరుషః,
అనిచ్ఛన్నపి వార్ష్ణేయ! బలాదివ నియోజితః. 36

ఇచ్ఛ యావంత లేకున్న • నీపురుషుఁడు
దేనిచేతఁ బ్రయుక్తుఁడై • పూని పాప
కార్యము లొనర్చునో బలా•త్కారముగను
భృత్యునివిధంబునఁ గృష్ణ! • వృష్ణితిలక! 37

కామ ఏష క్రోధ ఏష రజోగుణసముద్భవః,
మహాశనో మహాపాప్మా విద్ధ్యేన మిహ వైరిణమ్. 37

పార్థ! యిద్ది రజోగుణో•ద్భవమునైన
కామ, మిద్దియె క్రోధమై • క్రాలుచుండు,
నధికభక్షణమునుగల•యది, మహాఘ
మైనయది, మోక్షపథమున • కహిత మిద్ది. 38

ధూమేనావ్రియతే వహ్ని ర్యథాఽఽదర్శో మలేన చ,
యథోల్బేనావృతో గర్భ స్తథా తేనేదమావృతమ్. 38

మురికిచేతను నద్దంబు, • పొగను నిప్పు,
మావిచేతను గర్భ, మేఁ•మాడ్కిఁ గప్పఁ
బడియెనో, యట్టులే కప్పఁ•బడియె జ్ఞాన,
మధిప! యీకామమునను య•థార్థ మిద్ది. 39

ఆవృతం జ్ఞాన మేతేన జ్ఞానినో నిత్యవైరిణా,
కామరూపేణ కౌన్తేయ! దుష్పూరేణానలేన చ. ౩౯

అనఘచరిత! దుష్పూరంబు ♦ నైనయదియు,
నెఱుఁగనిదియు సంతృప్తి యొ♦కించుకేని,
యధికశతుృవు జ్ఞానికి ♦ ననవరతము,
కామ, మిద్దాన జ్ఞానంబు ♦ కప్పఁబడియె. ౩౮

ఇన్ద్రియాణి మనో బుద్ధి రస్యాధిష్ఠాన ముచ్యతే,
ఏతైర్విమోహయత్యేష జ్ఞానమావృత్య దేహినమ్. ౪౦

మనము బుద్ధీంద్రియములు కా♦మమ్మునకును
బూని వచియింపఁబడె నధి♦ష్ఠాన మనుచు,
నింద్రియమ్ముల జ్ఞానమ్ము ♦ నిద్ది కప్పి
పురుషు నుత్కటమోహమ్ము ♦ నొరయఁజేయు. ౩౯

తస్మాత్త్వమిన్ద్రియాణ్యాదౌ నియమ్య భరతర్షభ,
పాప్మానం ప్రజహి హ్యేనం జ్ఞానవిజ్ఞాననాశనమ్. ౪౧

ఫల్గునా! కాన నింద్రియ♦పంచకమ్ము
నాదియందున నీవు సం♦యమ మొనర్చి
జ్ఞానవిజ్ఞానములను నా♦శన మొనర్చు
నీయఘాకారకామంబుఁ ♦ బాయుమయ్య. ౪౦

ఇన్ద్రియాణి పరాణ్యాహురిన్ద్రియేభ్యః పరం మనః,
మనసస్తు పరా బుద్ధి ర్యో బుద్ధేః పరతస్తు సః. ४२

దేహమునకన్న శ్రేష్ఠ మిం♦ద్రియములెల్ల,
వానికన్న నుత్కృష్టమౌ ♦ మానసంబు
బుద్ధి యధికంబు మదికన్నఁ, ♦ బూజ్య మగును
దానికన్న సాక్షీభూత♦మైనయాత్మ. ४८

ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా సంస్తభ్యాత్మానమాత్మనా,
జహి శత్రుం మహాబాహో! కామరూపం దురాసదమ్. ४३

ఇటుల బుద్ధికంటె ♦ నెంతయో పరమగు
నాత్మ నెఱింగి; యాత్మ ♦ నాత్మచేత
నిగ్రహం బొనర్చి, ♦ నిగ్రహింపఁగరాని
కామరూపవైరిఁ ♦ గాల్పుమయ్య. ४२

# నాలుగవ యధ్యాయము

## జ్ఞానయోగము

ఇమం వివస్వతే యోగం ప్రోక్తవా నహమవ్యయమ్,
వివస్వాన్ మనవే ప్రాహ మను రిక్ష్వాకవేఽబ్రవీత్. ౧

అవ్యయం బైనయీయోగ • మంబుజాప్త
నకును నుపదేశ మొనరించి•నాడ, నావి
వస్వతుఁడు వచియించె వై•వస్వతునకుఁ,
గ్రిమతఁ దెల్పెను నాతఁ డి•క్ష్వాకునకును. ౧

ఏవం పరమ్పరాప్రాప్త మిమం రాజర్షయో విదుః,
స కాలేనేహ మహతా యోగో నష్టః పరంతప. ౨

పార్థ! యిట్లు పరంపరా•ప్రాప్తమైన
యీమహావిద్య రాజర్షు • లెఱిఁగిరయ్య!
అగుకతన చాలకాల మీ•యవనియందు
నష్టమయ్యెను దన్మహో•త్కృష్టవిద్య. ౨

స ఏవాయం మయా తేఽద్య యోగః ప్రోక్తః పురాతనః,
భక్తోఽసి మే సఖా చేతి రహస్యం హ్యేతదుత్తమమ్. 3

అత్యమితయోగ్యము మహారహస్యమైన
యీసనాతనయోగంబు నిపుడు నీకుఁ
దెలియఁబలికితి, నా కీవు చెలిమికాఁడ
వగుటచేతను, భక్తుండ వగుటచేత. 3

అపరం భవతో జన్మ పరం జన్మ వివస్వతః,
కథ మేత ద్విజానీయాం త్వ మాదౌ ప్రోక్తవానితి. ४

నీకుఁ బూర్వమె జన్మించె నీరజాప్తుఁ,
డభ్యుదయ మొంది తీ విప్పు డంబుజాక్ష!
యిట్టిచో నాది నీయోగ మినున కీవు
సల్పితిని బోధ, యన నెట్లు నమ్మతింతు ? ४

బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున,
తా న్యహం వేద సర్వాణి న త్వం వేత్థ పరంతప. ౫

అర్జునా! నీకు నాకును నంతరించి
పోయె నెన్నెన్నొ జన్మముల్ పూర్వమందు,
సర్వ మెఱుఁగుదు నేను, దజ్జన్మములను
నీ వెఱుంగవు నిశ్చయ, మించుకేని. ౫

అజోఽపిసన్నవ్యయాత్మా భూతానామీశ్వరోఽపి సన్,
ప్రకృతిం స్వామధిష్ఠాయ సమ్భవామ్యాత్మమాయయా. ౬

అజుఁడ నైన, నవ్య♦యాత్మకుండను నైన,
భూతములకు నేఁ బ్రభుండనైన,
స్వప్రకృతిని నాదు♦స్వాధీనముగఁ జేసి,
యాత్మమాయ జనన ♦ మందుచుందు. ౬

యదాయదాహి ధర్మస్య గ్లాని ర్భవతి భారత,
అభ్యుత్థానమధర్మస్య తదాఽఽత్మానం సృజామ్యహమ్. ౭

ఎప్పుడెప్పు డధర్మంబు ♦ వృద్ధిఁజెందు,
సరవి ధర్మంబునకు హాని ♦ సంఘటిల్లు,
నప్పుడప్పుడు నన్ను నే ♦ నాత్మమాయ
సంభవముఁజేయుచుందు నో♦సవ్యసాచి! ౭

పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్,
ధర్మసంస్థాపనార్థాయ సమ్భవామి యుగేయుగే. ౮

సాధువితతిని రక్షణ♦సలుపుకొఱకు,
మించి దుర్మార్గులను సంహ♦రించుకొఱకు,
ధరణి ధర్మసంస్థాపన ♦ జరుపుకొఱకు,
నుద్భవించుచు నుండెద ♦ యుగయుగంబు. ౮

జన్మ కర్మ చ మే దివ్య మేవం యో వేత్తి తత్త్వతః,
త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మామేతి సోఽర్జున. ౯

ఎవ్వఁ డతిదివ్య మైన నా • యిట్టిజన్మ
కర్మములను యథార్థంబు•గా నెఱుంగు,
నీశరీరంబుఁ బాసియు • నింక నతఁడు
పొందఁగాఁబోఁడు జన్మంబుఁ, • బొందు నన్నుఁ. ౯

వీతరాగభయక్రోధా మన్మయా మా ముపాశ్రితాః,
బహవో జ్ఞానతపసా పూతా మద్భావ మాగతాః. ౧౦

వీతరాగభయక్రోధ•చేతసులయి
యాశ్రయించియు మన్మయు•లైన నెల్ల
వారు విజ్ఞానమనెడుత•పంబుచేత
నధికపూతాత్ములగుచు న•న్నందిరయ్య! ౧౦

యే యథా మాం ప్రపద్యన్తే తాం స్తథైవ భజామ్యహమ్,
మమ వర్త్మానువర్తన్తే మనుష్యాః పార్థ! సర్వశః. ౧౧

ఏవ్వ రేగతి నన్ గ్రహి•యించుచుందు
రే నను గ్రహించెద వారి•కెల్ల నటులె,
సర్వవిధములచేత నీ • జనసమూహ
మరుగుచుందురు నామార్గ • మనుసరించి. ౧౧

కాంక్షన్తః కర్మణాం సిద్ధిం యజన్త ఇహ దేవతాః,
క్షిప్రం హి మానుషే లోకే సిద్ధిర్భవతి కర్మజా. ౧౨

ఇహమునఁ గర్మఫలముల ♦ నిచ్ఛగించు
వారలెల్లఁ గొల్చెదరు దే♦వతలఁగూర్చి;
కర్మసంభవ మగుసిద్ధి ♦ కలుగుచుండు
కవ్వడీ! వేగ మర్త్యలో♦కమ్మునందు. ౧౨

చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మవిభాగశః,
తస్య కర్తార మపి మాం విద్ధ్యకర్తార మవ్యయమ్. ౧౩

ఫల్గునా! గుణకర్మవి♦భాగవశత
సలిపితిని సృష్టి నాలుగు♦కులము లేన,
కర్తనైనను నేను ద♦త్కర్మమునకు,
నవ్యయుండ నకర్తన♦టం చెఱుంగు. ౧౩

న మాం కర్మాణి లిమ్పన్తి న మే కర్మఫలే స్పృహా,
ఇతి మాం యోఽభిజానాతి కర్మభిర్న స బధ్యతే. ౧౪

కవ్వడీ! నన్ను నంటవు ♦ కర్మ లెపుడు,
తత్ఫలస్పృహ నాకు సుం♦తయును లేదు,
ఈప్రకారమ్ముగా నెవ్వ♦డెఱుఁగు నన్ను
గర్మములచేత నాతండు ♦ కట్టువడఁడు. ౧౪

ఏవం జ్ఞాత్వా కృతం కర్మ పూర్వైరపి ముముక్షుభిః,
కురు కర్మైవ తస్మాత్త్వం పూర్వైః పూర్వతరం కృతమ్. ౧౫

పూర్వ మిద్ది గ్రహించి ము ♦ ముక్షువితతి
చేత సయితము కర్మలు ♦ సేయఁబడియె,
నక్కతనఁ బూర్వికులచేత ♦ నాచరింపఁ
బడిన ప్రాక్కర్మములను జ ♦ ల్పఁదగు నీవు. ౧౫

కిం కర్మ కి మకర్మేతి కవయోఽప్యత్ర మోహితాః.
తత్తే కర్మ ప్రవక్ష్యామి యజ్జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్.

కర్మ మన నేమి? యెట్టి ద ♦ కర్మ మనఁగ?
ననెడువిషయంబు గూర్చు మో ♦ హంబు కవుల
కేని, నెద్దానిఁ గని యందె ♦ దీవు ముక్తి,
యట్టికర్మాంశముంగూర్చి ♦ యాలకింపు. ౧౬

కర్మణో హ్యపి బోద్ధవ్యం బోద్ధవ్యం చ వికర్మణః,
అకర్మణశ్చ బోద్ధవ్యం గహనా కర్మణో గతిః. ౧౭

కర్మమన నెద్ది? యెయ్య ద ♦ కర్మ మనఁగ?
నెట్టిది? వికర్మ నాఁగను; ♦ నీతివిషయ
ములయథార్థమ్ము తెలియఁగా ♦ వలయు నిజము
కర్మగతుల నెఱుంగుట ♦ గహన మగును. ౧౭

కర్మణ్యకర్మ యః పశ్యే దకర్మణి చ కర్మ యః,
స బుద్ధిమాన్మనుష్యేషు స యుక్తః కృత్స్నకర్మకృత్. ౧౮

కవ్వడి! యకర్మభావంబు • కర్మమందుఁ,
గర్మభావంబు నెవ్వఁ డ•కర్మమందుఁ,
గాంచు; నాతఁడె యోగిలో•కమున యోగి,
యఖిలకర్మలఁ జేయువాఁ • డతఁడ యగును. ౧౮

యస్య సర్వే సమారమ్భాః కామసఙ్కల్పవర్జితాః,
జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం తమాహుః పండితం బుధాః. ౧౯

కామసంకల్పవర్జిత•కర్మ లెవ్వఁ
డాచరించునో; జ్ఞానాగ్ని • కాహుతి యగు
నెవనికర్మలు, వానినే • యెల్లబుధులు
పండితోత్తముఁ డంచును • బల్కుచుందు౹. ౧౯

త్యక్త్వా కర్మఫలాసఙ్గం నిత్యతృప్తో నిరాశ్రయః,
కర్మణ్యభిప్రవృత్తోఽపి నైవ కిఞ్చి త్కరోతి సః. ౨౦
నిరాశీ ర్యతచిత్తాత్మా త్యక్తసర్వపరిగ్రహః,
శారీరం కేవలం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్. ౨౧

ఎవ్వాఁడు కర్మఫ•లేచ్ఛను విడనాడు,
నెవ్వాఁడు నిత్యసం•తృప్తుఁ డగునో,

ఎవ్వాఁడు కాంక్షింప, ♦ డేవిధాశ్రియమునుఁ
నెవ్వాఁడు కోర్కెల ♦ నెల్ల వీడు,
నెవ్వాఁడు చిత్తాత్మ ♦ లెల్లవేళల నిజ
స్వాధీన మొందఁగా ♦ నల్పుకొనునొ,
ఎవ్వాఁడు వర్జించు ♦ నెల్లవిధములైన
సంగ్రహమ్ములను ని♦స్సంశయముగ,
నట్టివాఁడు కర్మంబుల ♦ నాచరించు
వాఁడె యైనను జేయని♦వాఁడె యగును,
జేయుచుండియుఁ గర్మల, ♦ జీవయాత్ర
కై రవంతైనఁ గిల్బిష ♦ మందఁబోఁడు. ౨౦

యదృచ్ఛాలాభసన్తుష్టో ద్వన్ద్వాఽతీతో విమత్సరః,
సమ స్సిద్ధా వసిద్ధౌ చ కృత్వాపి న నిబధ్యతే. ౨౨

ఫల్గున! యదృచ్ఛమైనలా♦భమ్ముచేతఁ
దృప్తుఁడై, ద్వంద్వములకు న♦తీతుఁడగుచు
సముఁడు సిద్ధ్యసిద్ధులను, మ♦త్సరములేని
యాతఁ డొనరించినను గర్మ ♦ లంటువడఁడు. ౨౧

గతసఙ్గస్య ముక్తస్య జ్ఞానావస్థితచేతసః,
యజ్ఞాయాచరతః కర్మ సమగ్రం ప్రవిలీయతే. ౨౩

సక్తినిఁ బరిత్యజించియు, ♦ ముక్తి నంది,
జ్ఞానచేతసుఁ డగుచు, య♦జ్ఞమ్ముకొఱకుఁ

గర్మ లొనరించువాని కా◆కర్మములు స
మగ్రముగఁ బ్రవిలీయము ◆ నందుచుండు. ౨౨

బ్రహ్మార్పణం బ్రహ్మహవి ర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతమ్,
బ్రహ్మైవ తేన గన్తవ్యం బ్రహ్మకర్మసమాధినా. ౨౪

బ్రహ్మమేయర్పణం బగు, ◆ బ్రహ్మమె యగు,
బ్రహ్మకర్మసమాధిచేఁ ◆ బడయుఫలము,
నగుహవిస్సును బ్రహ్మంబె, ◆ యగును బ్రహ్మ
మల్ల బ్రహ్మాగ్ని బ్రహ్మచే ◆ నైన హుతము. ౨౩

దైవ మే వాపరే యజ్ఞం యోగినః పర్యుపాసతే,
బ్రహ్మాగ్నా వపరే యజ్ఞం యజ్ఞేనై వోపజుహ్వతి. ౨౫

పార్థ! కొందఱు యోగులు ◆ పర్యుపాస
న మొనర్తురు దైవయ◆జ్ఞమ్ము ప్రీతి,
యజ్ఞమును యజ్ఞ మనియ బ్ర◆హ్మాగ్నియందు
నాహుతియొనర్చెదరు కొంద ◆ ఱధికభక్తి. ౨౪

శ్రోత్రాదీనీన్ద్రియాణ్యన్యే సంయమాగ్నిషు జుహ్వతి,
శబ్దాదీ న్విషయా నన్యేఽపీన్ద్రియాగ్నిషు జుహ్వతి. ౨౬

ఎలమి కొందఱు శ్రోత్రాది◆ కేంద్రియములఁ
జల్పుచున్నారు హోమంబు ◆ సంయమాగ్ని,
వేల్చుచున్నారు శబ్దాది◆విషయములను
పార్థ! కొందఱు నింద్రియ◆వహ్నియందు. ౨౫

సర్వాణీన్ద్రియకర్మాణి ప్రాణకర్మాణి చాపరే,
ఆత్మసంయమయోగాగ్నౌ జుహ్వతి జ్ఞానదీపితే. ౨౭

కడఁగి సర్వేంద్రియమ్ములఁ ♦ గర్మములను
బ్రాణకర్మలఁ గొందఱు ♦ భవ్యమతిని
వ్రేల్చెదరు జ్ఞానదీప్తమై ♦ వెలయునట్టి
యాత్మసంయమయోగాగ్ని♦యందుఁ బార్థ! ౨౭

ద్రవ్యయజ్ఞాస్తపోయజ్ఞా యోగయజ్ఞాస్తథాఽపరే,
స్వాధ్యాయజ్ఞానయజ్ఞాశ్చ యతయ స్సంశితవ్రతాః. ౨౮

జ్ఞానయజ్ఞమ్ము యోగయ♦జ్ఞమ్ము ద్రవ్య
యజ్ఞమును, గొంద ఱెలమి స్వా♦ధ్యాయయజ్ఞ
మును, దపోయజ్ఞ మొనరింతు ♦ రనఘచరిత!
సంశితవ్రతు లింద్రియ♦జయులు నగుచు. ౨౮

అపానే జుహ్వతి ప్రాణం ప్రాణేఽపానం తథాఽపరే,
ప్రాణాఽపానగతీ రుద్ధ్వా ప్రాణాయామపరాయణాః. ౨౯
అపరే నియతాహారాః ప్రాణాన్ ప్రాణేషు జుహ్వతి,
సర్వేఽప్యేతే యజ్ఞవిదో యజ్ఞక్షపితకల్మషాః. ౩౦

కొంద ఱపానమ్మునందుఁ బ్రాణమ్మును
హోమమ్ముఁ జేయుచు♦నున్నవారు

కొందఱు ప్రాణమ్ము నం దపానమ్ము ను
హోమంబుఁ జేయుచు నున్నవారు
పూరక రేచకమ్మును గుంభ కాఖ్య ప్రా
ణాయామముల ర క్తిఁ జేయువారు
కొంద అపాన మిం పొందఁ బ్రాణము నడ్డి
హోమంబుఁ జేయుచు నున్నవారు
కొంద అశనమ్ము నియతిగాఁ గొనియుఁ బ్రాణ
మందుఁ బ్రాణమ్ము హోమంబు నాచరించు
చున్నవారలు; వీ రెల్ల రెన్న యజ్ఞ
విదులు, యజ్ఞక్షపితపాపవృత్తు లౌర! ౨౮

యజ్ఞశిష్టామృతభుజో యాన్తి బ్రహ్మ సనాతనమ్,
నాయం లోకోఽ స్త్యయజ్ఞస్య కుతోఽన్యః కురుసత్తమ. ౩౧

యజ్ఞశిష్టామృతముఁ గొని నట్టివారు
పడయఁగలరు సనాతన బ్రహ్మపదము,
యజ్ఞముల నొనరింపని యట్టివారి
కిహమె లేదన్నఁ బరలోక మెట్లు లబ్బు? ౨౯

ఏవం బహువిధా యజ్ఞా వితతా బ్రహ్మణో ముఖే,
కర్మజా న్విద్ధి తా న్సర్వా నేవం జ్ఞాత్వా విమోక్ష్యసే. ౩౨

అర్జునా! యిట్లు పూర్వోక్త మైనయజ్ఞ
వితతి బ్రహ్మముఖమ్మున వితతమయ్యె.

నాసమ స్తంబు కర్మజ ♦ మంచు నెఱుఁగు,
తెలియ నీవిధి మోక్షమ్ము ♦ గలుగఁగలదు. ౩౦

శ్రేయాన్ ద్రవ్యమయాద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః పరంతప,
సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే. ౩౩

ద్రవ్యమయయజ్ఞమునకంటెఁ ♦ దనరుచుండు
జ్ఞానయజ్ఞంబె శ్రేయమై ♦ సవ్యసాచి!,
సర్వకర్మలు నఖిలమా ♦ జ్ఞానమందుఁ
బరిసమా ప్తంబు నొందునం ♦ చరయుమయ్య! ౩౧

తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా,
ఉపదేక్ష్యన్తి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః. ౩౪

ఆశ్రయించియుఁ దత్త్వార్థ ♦ మరసినట్టి
జ్ఞానులకు భక్తితో సమ♦స్కార సేవ
లాచరించియుఁ, దెలియని ♦ వడిగి తెలిసి
కొనుమ! యుపదేశ మొనరింతు ♦ రనఘ! వారుఁ ౩౨

యద్జ్ఞాత్వా న పున ర్మోహ మేవం యాస్యసి పాణ్డవ,
యేన భూతా న్యశేషేణ ద్రక్ష్యస్యాత్మన్యథో మయి. ౩౫

పాండవా! యట్టిజ్ఞానంబుఁ ♦ బడసితేని
యిట్టిమోహంబు నందఁబో ♦ వీవు తిరిగి,

జీవులను నాత్మయందు ని♦శ్శేషముగను
జూడఁగలవు, నాయందునఁ ♦ జూడఁ గలవు. 33

అపిచే దసి పాపేభ్య స్సర్వేభ్యః పాపకృత్తమః,
సర్వం జ్ఞానప్లవేనైవ వృజినం స న్తరిష్యసి. 3౬

యథైధాంసి సమిద్ధోఽగ్ని ర్భస్మసాత్కురుతేఽర్జున,
జ్ఞానాగ్ని స్సర్వకర్మాణి భస్మసా త్కురుతే తథా. 32

పాపకర్మలకంటెను ♦ బాపి వైన
దాటఁగల వఘ మీజ్ఞాన♦తరణిచేత,
దారువుల నెట్లు గాల్చునో ♦ దహ్యవహ్ని,
కాల్చు నట్టులె జ్ఞానాగ్ని ♦ కర్మములను. 3౮

న హి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే,
తత్స్వయం యోగసంసిద్ధః కాలే నాత్మని విన్దతి. 3౮

జ్ఞానమున కిహమందున ♦సదృశమైన
యదియునుం, బావనం బైన ♦యదియు లేదు,
దానినిఁ సిద్ధయోగి కా♦లానుగుణ్య
ముగను దనయందె పొందు సం♦పూర్ణముగను. 3౯

శ్రద్ధావాన్ లభతే జ్ఞానం తత్పరస్సంయతేన్ద్రియః,
జ్ఞానం లబ్ధ్వా పరాం శాన్తి మచిరేణాధిగచ్ఛతి. ౩౯

శ్రద్ధగలవాఁడు, నింద్రియ • సంయమంబుఁ
గల్గువాఁడు, తత్పరతను • గల్గువాఁడు,
జ్ఞానమును బొందుచున్నాఁడు; • జ్ఞానలబ్ధుఁ
డై పరమశాంతిఁ బొందుఁ దా • నచిరముననె. ౩౬

అజ్ఞశ్చాశ్రద్ధధానశ్చ సంశయాత్మా వినశ్యతి,
నాయం లోకోఽస్తి న పరో న సుఖం సంశయాత్మనః. ౪౦

అజ్ఞుఁడగువాఁడు, శ్రద్ధలే • నట్టివాఁడు,
సంశయాత్ముండు నిజము నా•శమ్ము నొందు;
సంశయాత్మున కరయ నీ•జగమె లేదు,
లేదు పరమును, సుఖమును • లేదు లేదు. ౩౭

యోగసన్న్యస్తకర్మాణం జ్ఞానసంఛిన్నసంశయమ్,
ఆత్మవన్తం న కర్మాణి నిబధ్నన్తి ధనఞ్జయ. ౪౧

కవ్వడీ! యోగసన్న్యస్త•కర్ముఁ డగుచు
జ్ఞానసంఛిన్నసంశయుఁ•డైన దృఢత
రాత్మునిం, బుణ్యపాపక•ర్మాళి యించు
కేని బంధింపఁగాఁజాల • దెట్టితఱిని. ౩౮

తస్మాదజ్ఞానసమ్భూతం హృత్ స్థం జ్ఞానాసినాఽఽత్మనః,
ఛిత్త్వైనం సంశయం యోగ మాతిష్ఠోత్తిష్ఠ భారత. ౪౨

కాన ఖండింపుమా జ్ఞాన•ఖడ్గమునను
ఫల్గునా! యవివేకసం•భవమునైన
నీమనస్స్థసంశయమును • నిశ్చయముగ,
నాచరింపుమ! యోగమ్ము, • ననికి లెమ్మ.! ౩౯

# అయిదవ అధ్యాయము

## కర్మసన్న్యాసయోగము

సన్న్యాసం కర్మణాం కృష్ణ! పునర్యోగం చ శంససి,
యచ్ఛ్రేయ ఏతయోరేకం తన్మే బ్రూహి సునిశ్చితమ్. ౧

చేయుమా యోగ మంచును • జెప్పుచుంటి,
వొక్కపరి కృష్ణ! నీవె యిం•కొక్కతటిని,
కర్మసన్న్యాసము వచింపఁ•గడఁగుచుంటి,
వేది శ్రేయంబొ వచియింపు • మిందు నాకు. ౧

సన్న్యాసః కర్మయోగశ్చ నిఃశ్రేయసకరావుభౌ,
తయోస్తు కర్మసన్న్యాసాత్కర్మయోగో విశిష్యతే. ౨

కవ్వడీ! కర్మయోగంబు • కర్మరహిత
యోగములు రెండిటను మోక్ష • మొదవు నయ్యా,
కాని కర్మసన్న్యాసయో•గంబుకంటెఁ
గర్మయోగంబె శ్రేష్ఠమౌఁ • గద తలంప. ౨

జ్ఞేయస్స నిత్యసన్న్యాసీ యో న ద్వేష్టి న కాఙ్క్షతి,
నిర్ద్వన్ద్వోహి మహాబాహో! సుఖం బన్ధాత్ప్రముచ్యతే. 3

తెలియుమా ద్వేషరాగము ♦ ల్గలుగనట్టి
యాతఁడే నిత్యసన్న్యాసి ♦ యంచుఁ బార్థ!
ద్వంద్వములకు నతీతుఁడై ♦ తనరువాఁడు
విడువఁబడు సుఖముగ బంధ♦వితతినుండి. 3

సాంఖ్యయోగౌ పృథగ్బాలాః ప్రవదన్తి న పణ్డితాః,
ఏక మప్యాస్థిత స్సమ్యగుభయో ర్విన్దతే ఫలమ్. ౪

కర్మసాంఖ్యయోగంబులఁ ♦ గల్గు భిన్న
ఫలము లంచును పామరు ♦ ల్పలుకుచుంద్రు,
కాని పల్కరు పండితుల్, ♦ పూని రెంట
నొకటి యొనరింపఁ బొందుగా ♦ నుభయఫలము. ౪

యత్సాఙ్ఖ్యైః ప్రాప్యతే స్థానం తద్యోగై రపి గమ్యతే,
ఏకం సాఙ్ఖ్యం చ యోగం చ యః పశ్యతి స పశ్యతి. ౫

సాంఖ్యసిద్ధాంతులకు నెట్టి ♦ స్థాన మబ్బుఁ
గర్మయోగుల కద్దియే ♦ కలుగుచుండుఁ,
గాన నెవ్వండు రెండుయో♦గముల నేక
ఫలము నిడు నంచుఁ జూచునో♦ వాఁడె జ్ఞాని. ౫

సన్న్యాసస్తు మహాబాహో! దుఃఖ మాప్తుమయోగతః,
యోగయుక్తో మునిర్బ్రహ్మ న చిరేణాధిగచ్ఛతి. ౬

అరయ యోగంబులేక స◆న్న్యాసమంద
నధికదుఃఖమ్మునకు హేతు◆వై తనర్చు;
యోగయుక్తుండునౌ మౌని ◆ యొందుచుండు
నచిరకాలమ్ముననె బ్రహ్మ ◆ మార్యవినుత ! ౬

యోగయుక్తో విశుద్ధాత్మా విజితాత్మా జితేన్ద్రియః,
సర్వభూతాత్మభూతాత్మా కుర్వన్నపి న లిప్యతే. ౭

యోగయుక్తుండు, విజితేంద్రియుండు, శుద్ధ
హృదయుఁడును, విజితాత్ముండు, ◆ నిఖిలభూత
ములను నాత్మసమమ్ముగాఁ ◆ దలఁచువాఁడు
కర్మము లొనర్పలిప్తుండు ◆ గాఁడు కాఁడు. ౭

నైవ కిఞ్చిత్కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్,
పశ్యఞ్ శృణ్వఞ్ స్పృశఞ్ జిఘ్రన్నశ్నన్గచ్ఛఞ్ స్వపఞ్ శ్వసన్. ౮
ప్రలపఞ్ విసృజన్ గృహ్ణన్నున్మిషన్నిమిషన్నపి,
ఇన్ద్రియాణీన్ద్రియార్థేషు వర్తన్త ఇతి ధారయన్. ౯

వీక్షించు, చాఘ్రాణ◆వృత్తి నెసంగుచు,
భక్షణఁజేయుచు, ◆ భాషణంబు

లాడుచు, నడుచుచు, ◆ ననవరతోచ్ఛ్వాస
నిశ్వాసముల రెంటి ◆ నిర్వహించు,
చక్షిద్వయము ముకు◆ళావస్థ నుంచుచు,
వికసింపఁజేయుచు, ◆ వినుచునుండి,
స్పృశియించుచును, గ్రహి◆యించుచు, విడుచుచు,
బహుళనిద్రావస్థఁ ◆ బరగుచుండి,
యెలమి తత్త్వమెఱుంగు యో◆గీశ్వరుండు
నింద్రియార్థమ్ములందున ◆ నింద్రియములు
బూనుచుండెవర్తన, మేను◆గా నోకించు
కేని, యని చిత్తశుద్ధి నూ◆హించి మనును. ౮

బ్రహ్మణ్యాధాయ కర్మాణి సఙ్గం త్యక్త్వా కరోతి యః,
లిప్యతే న స పాపేన పద్మపత్ర మివామ్భసా. ౧౦

ఎవఁడు బ్రహ్మార్పణ మొనర్చి ◆ యెల్లకర్మ
వితతి, నాసక్తి వీడి, కా◆వించునొక్కొ;
వాఁడు నీరమ్ముచేఁ బద్మ◆పత్రి మటుల
నఘచయమ్ములచే నుంత ◆ యంటువడఁడు. ౯

కాయేన మనసా బుద్ధ్యా కేవలై రిన్ద్రియై రపి,
యోగినః కర్మ కుర్వన్తి సఙ్గం త్యక్త్వాఽఽత్మశుద్ధయే. ౧౧

యోగిజనములు మమకార ◆ మొంద కెపుడు
కాయమున బుద్ధి నింద్రియ◆గణముచేత

మానసముచేత వివిధక•ర్మముల, శ్రీద్ధ
నాత్మసంశుద్ధికొఱకునై • యాచరింతుర్. ౧౦

యుక్తః కర్మఫలం త్యక్త్వా శాన్తిమాప్నోతి నైష్ఠికీమ్,
అయుక్తః కామకారేణ ఫలే సక్తో నిబధ్యతే. ౧౨

యోగి కర్మఫలమ్ములు • నుజ్జగించి,
పారమార్థికశాంతినిఁ • బడయుచుండుఁ,
గామకారత్వమున సక్తిఁ • గలిగి, ఫలము
లంద యుక్తుండు బంధితుఁ • డగును పార్థ! ౧౧

సర్వకర్మాణి మనసా సన్న్యస్యాఽఽస్తే సుఖం వశీ,
నవద్వారే పురే దేహే నైవ కుర్వన్న కారయన్. ౧౩

మనముచే సర్వకర్మల • మానివైచి
తాను జేయకఁ జేయింపఁ • బూన కెపుడు
ధర జితేంద్రియుఁ డీనవ•ద్వారనగర
మనఁదగిన దేహమున సుఖ • మందుచుండు. ౧౨

న కర్తృత్వం న కర్మాణి లోకస్య సృజతి ప్రభుః,
న కర్మఫలసంయోగం స్వభావస్తు ప్రవర్తతే. ౧౪

కన్తి! ప్రభుఁడు లోక•కర్తృత్వనిర్మాత
గాఁడు, కర్మములను • గలుగఁజేయఁ,

డాఫలానురక్తి ♦ నతఁడు సృజింపలేఁ;
దన్ని మాయవల్ల ♦ నావహిల్లు. ౧౩

నాదత్తే కస్యచి త్పాపం న చైవ సుకృతం విభుః,
అజ్ఞానేనావృతం జ్ఞానం తేన ముహ్యన్తి జన్తవః. ౧౫

కాఁడు బాధ్యుండు నీశుఁ డే♦నాఁడు, నొకని
పాపపుణ్యంబులకుఁ, గప్పఁ♦బడుచునుండు
జ్ఞాన మజ్ఞానమున, నిందు♦చే నరతతి
పడుచునున్నారు మోహజం♦బాలమునను. ౧౪

జ్ఞానేన తు తదజ్ఞానం యేషాం నాశిత మాత్మనః,
తేషా మాదిత్యవజ్జ్ఞానం ప్రకాశయతి తత్పరమ్. ౧౬

ఆత్మవిజ్ఞానమున నాశ ♦ మందఁజేయఁ
బడునొ యేరియజ్ఞానంబు ♦ పాండుతనయ!,
వారిజ్ఞానంబు సూర్యుని♦వలెను, దత్ప
రం బయినదానిఁ జేయు వి♦రాజితముగ. ౧౫

తద్బుద్ధయ స్తదాత్మాన స్తన్నిష్ఠా స్తత్పరాయణాః,
గచ్ఛ న్త్యపునరావృత్తిం జ్ఞాననిర్ధూతకల్మషాః. ౧౭

జ్ఞాననిర్ధూతకిల్బిషు ♦ లైనవార
లాపరబ్రహ్మనిష్ఠత♦దాత్ము లగుచుఁ
దత్పరాయణులై బుద్ధి ♦ దానియందె
కల్గి యపునరావృత్తినిఁ ♦ గాంతురయ్య. ౧౬

విద్యావినయసమ్పన్నే బ్రాహ్మణే గవి హస్తిని,
శుని చైవ శ్వపాకే చ పణ్డితా స్సమదర్శినః. ౧౮

వినయవిద్యాఢ్యుఁ డైనబ్రాహ్మణునియందు
ధేనువులయందునను మదద్విరదములను
శ్వానబృందమ్మునందున శ్వపచునందుఁ
బండితులు సమదర్శులై పరగువారు ౧౮

ఇహైవ తైర్జితస్సర్గో యేషాం సామ్యే స్థితం మనః,
నిర్దోషం హి సమం బ్రహ్మ తస్మాద్బ్రహ్మణి తే స్థితాః. ౧౯

ఎవరిమనము సామ్యమ్మునం దెసఁగు, వార
లిహమునందె జన్మమ్ము జయింతురయ్య !
సమము నైన బ్రహ్మం బదోషమ్ము నగుట
ఫల్గునా! వార లున్నారు బ్రహ్మమందు. ౧౯

న ప్రహృష్యేత్ప్రియం ప్రాప్య నోద్విజేత్ప్రాప్య చాప్రియమ్,
స్థిరబుద్ధిరసమ్మూఢో బ్రహ్మవిద్బ్రహ్మణి స్థితః. ౨౦

బ్రహ్మసంస్థితుఁ డైనట్టి బ్రహ్మవిదుఁడు
మోహవర్జితుఁడై స్థిరబుద్ధి గల్గి,
పొందియుఁ బ్రియమ్ము, తోషమ్ము నొందఁబోఁడు;
అప్రియం బంది వ్యసనంబు నందఁబోఁడు. ౨౦

బాహ్యస్పర్శేష్వసక్తాత్మా విన్దత్యాత్మని యత్సుఖమ్,
స బ్రహ్మయోగయుక్తాత్మా సుఖమక్షయమశ్నుతే. ౨౧

బాహ్యశబ్దాదులకు నెల్ల ♦ బాహ్యుఁ డగుచు
నాత్మయందున నేసుఖ ♦ మందునో? క్కొ?
బ్రహ్మయోగయుక్తాత్ముఁడై ♦ వరలునతఁడు
అక్షయం బైనసౌఖ్యంబు ♦ నందుచుండు. ౨౦

యే హి సంస్పర్శజా భోగా దుఃఖయోనయ ఏవ తే,
ఆద్యన్తవన్తః కౌన్తేయ! న తేషు రమతే బుధః. ౨౨

పార్థ! స్పర్శాదివిషయసం♦భవము లైన
సుఖము లాద్యంతవంతముల్ ♦ సుమ్మి నమ్ము,
కాన నయ్యవి యతిదుఃఖ♦కారణములు
బుధులు సక్తినిఁ జెంద రా♦భోగములను. ౨౧

శక్నోతీహైవ యస్సోఢుం ప్రాక్శరీరవిమోక్షణాత్,
కామక్రోధోద్భవం వేగం స యుక్తస్స సుఖీ నరః. ౨౩

కవ్వడీ! దేహమోక్షమ్ము♦కంటె ముందు
నెవఁడు సహియింపఁగల్గునో ♦ యిహమునందె
క్రోధకామోద్భవం బైన ♦ ఘోరవేగ,
మానరుఁడె సుఖవంతుఁడు ♦ నతఁడె యోగి. ౨౨

యోఽన్తస్సుఖోఽన్తరారామ స్తథాన్తర్జ్యోతి రేవ యః,
స యోగీ బ్రహ్మనిర్వాణం బ్రహ్మభూతోఽధిగచ్ఛతి. ౨౪

అంతరారాముఁ డంతస్సు♦ఖాఢ్యుఁ డెవఁడొ,
అటులె యెవ్వఁ డంతర్జ్యోతి ♦ యగునొ, యట్టి
యోగియే బ్రహ్మభూతుఁడై ♦ యొందుచుండు
భావుకం బైన బ్రహ్మని♦ర్వాణపదము. ౨౩

లభన్తే బ్రహ్మనిర్వాణ మృషయః క్షీణకల్మషాః,
ఛిన్నద్వైధా యతాత్మాన స్సర్వభూతహితే రతాః. ౨౫

క్షీణకల్మషులును బరి♦చ్ఛిన్నసంశ
యమ్ముగలవారు నియతాత్మ ♦ లఖిలభూత
హితమునం దనురాగులై ♦ యెసఁగుఋషులు
బ్రహ్మనిర్వాణభాగ్యముఁ ♦ బడయఁగలరు. ౨౪

కామక్రోధవియుక్తానాం యతీనాం యతచేతసామ్,
అభితో బ్రహ్మనిర్వాణం వర్తతే విదితాత్మనామ్. ౨౬

క్రోధకామవియుక్తులో ♦ సాధుచరిత!
ఆత్మరూపంబు నెఱిఁగిన♦యట్టివారు;
నియతచేతస్కులౌ యతి♦నివహమునకు,
బ్రహ్మనిర్వాణ మంతటఁ ♦ బ్రబలియుండు. ౨౫

స్పర్శాన్కృత్వాబహిర్బాహ్యాంశ్చక్షుశ్చైవాన్తరే భ్రువోః,
ప్రాణాపానౌ సమౌ కృత్వా నాసాభ్యన్తరచారిణౌ. ౨౭

యతేన్ద్రియమనోబుద్ధి ర్ముని ర్మోక్షపరాయణః,
విగతేచ్ఛాభయక్రోధో య స్సదా ముక్త ఏవ సః. ౨౮

భోక్తారం యజ్ఞతపసాం సర్వలోకమహేశ్వరమ్,
సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాన్తిమృచ్ఛతి.

బాహ్యమౌ స్పర్శము ♦ ల్వర్జించి, భ్రూమధ్య
మందున దృష్టిని, ♦ బొందుపరచి
నాసికాంతరవర్త♦నంబు గావింపఁ బ్రా
ణాపానముల సమా♦నము లొనర్చి,
పూని బుద్ధిని మన♦మ్మును నింద్రియంబుల
స్వాధీన మగునట్లు ♦ సంతరించి,
భయమును నిచ్ఛయుఁ బాసి, ♦ క్రోధమ్ము వి
సర్జించి, మోక్షప్ర♦సక్తుఁ డగుచు,
మునియు నగువాఁడు మోక్షస♦న్ముక్తుఁ డగును
యజ్ఞతపములకును భోక్త ♦ యైనవాని
నఖిలలోకమహేశ్వరుఁ ♦ డైనవాని
సకలహితునిగ నెఱిఁగినఁ; ♦ శాంతి నందు. ౨౯

# ఆఱవ యధ్యాయము

## ఆత్మసంయమయోగము

అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మ కరోతి యః,
స సన్న్యాసీ చ యోగీ చ న నిరగ్ని ర్నచాక్రియః. ౧

ఎవఁడు కర్మఫలం బాశ్రి♦యింపకుండఁ
జేయునో కార్యకర్మముల్ ♦ బాయకుండ,
వాఁడె కర్మపరిత్యాగి ♦ వాఁడె యోగి,
కాఁడు లుప్తాగ్నిజపతపః♦కర్ముఁ డతఁడు. ౧

యం సన్న్యాసమితి ప్రాహుర్యోగం తం విద్ధి పాణ్డవ,
న హ్యసన్న్యస్తసఙ్కల్పో యోగీ భవతి కశ్చన. ౨

అర్జునా ! యెద్ది సన్న్యాస ♦ మనిరో బుధులు
యద్దియే యోగలక్షణ ♦ మని తలంపు
మొగి నసన్న్యస్తసంకల్పుఁ ♦ డొకఁడేని
కాఁడు గద వాస్తవమ్ముగాఁ ♦ గర్మయోగి. ౨

ఆరురుక్షోర్మునే ర్యోగం కర్మ కారణ ముచ్యతే,
యోగారూఢస్య తస్యైవ శమః కారణ ముచ్యతే. ౩

జ్ఞానయోగాధిరోహణా • సక్తిఁ దగులు
మునికిఁ గర్మంబు కారణ • మని యెఱుంగు,
మఱయు జ్ఞానాధిగతుఁ డైన • యట్టిమునికి
సర్వకర్మనివృత్తియే • సాధనంబు. ౩

యదా హి చేన్ద్రియార్థేషు న కర్మ స్వనుషజ్జతే,
సర్వసఙ్కల్పసన్న్యాసీ యోగారూఢ స్తదోచ్యతే. ౪

ఎప్పుడు నింద్రియార్థముల • నించుక యాస్థ వహింపకుండునో,
యెప్పుడు సర్వకర్మముల • నెంతయు సక్తినిఁ జెందకుండునో,
యప్పుడె యెల్లకామ్యముల•యందుఁ బరాఙ్ముఖవర్తనుం డటం,
చప్పుడె సిద్ధయోగి యని•యార్యులచే వచియింపఁగాఁబడున్. ౪

ఉద్ధరేదాత్మనాఽఽత్మానం నాత్మానమవసాదయేత్,
ఆత్మైవ హ్యాత్మనో బన్ధు రాత్మైవ రిపు రాత్మనః. ౫

ఆత్మ నుద్ధరింపఁగవలె • నాత్మచేత,
నాత్మ నొందింపగాఁ గూడ • దధమగతిని;
బంధు వౌ సుమ్మి తనకు లోఁ•బడినయాత్మ,
ప్రబలశత్రువు తనకు లోఁ•బడనియాత్మ. ౫

బన్ధురాత్మాఽఽత్మనస్తస్య యేనాత్మైవాత్మనా జితః,
అనాత్మనస్తు శత్రుత్వే వర్తేతాత్మైవ శత్రువత్. ౬

ఏమనమ్ము జయించు దేహేంద్రియముల,
నామనమ్మున దేహేంద్రియములు బంధు
వటుల వర్తించు, గానిచో నామనంబు
శత్రువట్లపకారంబు సలుపుచుండు. ౬

జితాత్మనః ప్రశాన్తస్య పరమాత్మా సమాహితః,
శీతోష్ణసుఖదుఃఖేషు తథా మానావమానయోః. ౭

పూని జితాత్మకుండగుచుఁ బొల్చి, ప్రశాంతమున న్వెలుంగున
వ్వానికి, బ్రహ్మమెప్పుడుఁ బ్రవర్తిలుచుండు సమాహితమ్మునై
మానము శీత ముష్ణ మవమానము దుఃఖసుఖమ్ములున్ సమం
బౌనని యెంచి, నెమ్మనమునందున నెంతయు నుత్సహించెడున్. ౭

జ్ఞానవిజ్ఞానతృప్తాత్మా కూటస్థో విజితేన్ద్రియః,
యుక్త ఇత్యుచ్యతే యోగీ సమలోష్టాశ్మకాఞ్చనః. ౮

జ్ఞానవిజ్ఞానతృప్తాత్ముఁ డైనవాఁడు
అనఘ! కూటస్థుఁడు జితేంద్రియాకులుండు
స్వర్ణలోష్టాశ్మములయందు సముఁడు నైన
యోగి వచియింపఁబడు యుక్తుఁడనుచు.

సుహృన్మిత్రార్యుదాసీనమధ్యస్థ ద్వేష్యబన్ధుషు,
సాధుష్వపి చ పాపేషు సమబుద్ధి ర్విశిష్యతే. ౯

మేలుసల్పునతనియందు • మిత్రునందుఁ
పక్షపాతరహితసాధు • బంధులందు
నహితమధ్యస్థకిల్బిషు,లందు ద్వేష్యు
లందు సమబుద్ధిఁ బరగెడు•నతఁడె యోగి. ౯

యోగీ యుఞ్జీత సతత మాత్మానం రహసి స్థితః,
ఏకాకీ యతచిత్తాత్మా నిరాశీ రపరిగ్రహః. ౧౦

అధిప! యేకాకియై, నియ•తాత్మచిత్తుఁ
డై, పరిగ్రహ మందక, • యాశ వీడి
యధివసించి, యేకాంతంబు•నందు, యోగి
యాత్మ నిగ్రహించఁగవలె • ననవరతము. ౧౧

శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిరమాసన మాత్మనః,
నాత్యుచ్ఛ్రితం నాతినీచం చేలాజినకుశోత్తరమ్. ౧౧

తత్రైకాగ్రం మనః కృత్వా యతచిత్తేన్ద్రియక్రియః,
ఉపవిశ్యాసనే యుఞ్జ్యాద్యోగ మాత్మవిశుద్ధయే. ౧౨

అతిపరిశుద్ధమౌ సమత•లాంతరసీమ, గుశాజినాంబర
స్థితవిమలాసనంబుఁ గయి•సేసి, తిరంబుగఁగూరుచుండియుఀ,

మతిబిగియించియుంచి, నియమమ్ముగఁజిత్తమునింద్రియక్రియల్
జతనమొనర్పఁగావలె నిజమ్ముగ యోగము నాత్మశుద్ధికై. ౧౧

సమం కాయశిరోగ్రీవం ధారయ న్నచలం స్థిరః,
సంప్రేక్ష్య నాసికాగ్రం స్వం దిశశ్చానవలోకయన్. ౧౩

ప్రశాన్తాత్మా విగతభీర్బ్రహ్మచారివ్రతే స్థితః,
మనస్సంయమ్య మచ్చిత్తో యుక్త ఆసీత మత్పరః. ౧౪

యుఞ్జన్నేవం సదాఽఽత్మానం యోగీ నియతమానసః,
శాన్తిం నిర్వాణపరమాం మత్సంస్థా మధిగచ్ఛతి. ౧౫

కాయమ్ము శిరమును గంఠం బొకించుక
చలియింపఁగానీక సమత నిల్పి,
స్థిరవర్తియై దిశల్ పరికింప, కాత్మీయ
నాసాగ్రమున దృష్టి నాటఁ జేసి,
యమలశాంతాత్ముఁడై హతభీతుఁడై బ్రహ్మ
చర్యవ్రతాచారధుర్యుఁ డగుచుఁ,
జిత్తమ్ము నాయందె హత్తించి భావించి,
మనము లెస్సగ సంయమం బొనర్చి,
నియతమానసుఁడై సదా నెగడు యోగి
వర్యుఁ డాత్మసమాధానవర్తి యగుచు,
నాయధీనమోక్షోత్కృష్టమా యమేయ
శాంతి నందుచు నుండు నిస్సంశయంబు. ౧౨

నాత్యశ్నతస్తు యోగోఽస్తి న చైకాన్తమనశ్నతః,
న చాతిస్వప్నశీలస్య జాగ్రతో నైవ చార్జున. ౧౬

అతిగ భుజియించువానికి, ♦ నల్పభోజ
నునకు, బహుళసుషుప్తినిఁ ♦ గనెడువాని,
కసలె నిద్దురనొందని ♦ యాతనికినిఁ,
బార్థ! యీదివ్యయోగంబు ♦ పట్టువడదు. ౧౩

యుక్తాహారవిహారస్య యుక్తచేష్టస్య కర్మసు,
యుక్తస్వప్నావబోధస్య యోగో భవతి దుఃఖహా. ౧౭

యుక్తాహారవిహారికి,
యుక్తస్వప్నావబోధ ♦ యుక్తాత్మునకుఁ,
యుక్తమగు కర్మచేష్టికి,
యుక్తం, బీదుఃఖరహిత ♦ యోగము, విజయా! ౧౮

యదా వినియతం చిత్త మాత్మన్యేవావతిష్ఠతే,
నిస్పృహస్సర్వకామేభ్యో యుక్త ఇత్యుచ్యతే తదా. ౧౮

ఎట్టితఱి నైమ్మనము నిగ్రహింపఁబడియు,
నర్జునా! యాత్మయందున ♦ నధివసించు,
నెట్టియెడఁ గామములు నాశ ♦ లెల్ల వీడు,
నవు డతని యోగి యని బుధు ♦ లాడుచుంద్రు. ౧౯

యథా దీపో నివాతస్థో నేఙ్గతే సోపమా స్మృతా,
యోగినో యతచిత్తస్య యుఞ్జతో యోగమాత్మనః. ౧౯

గాలిలేనిస్థలిఁ దీప•కళిక చలన
మంద వెట్టుల, నావిధ • మాత్మయోగ
నియమితాంతఃకరణవృత్తి • నెగడు యోగి,
కార్యులు వచించి, రది యుదా•హరణ మనుచు. ౧౯

యత్రోపరమతే చిత్తం నిరుద్ధం యోగసేవయా,
యత్ర చై వాత్మనాఽఽత్మానం పశ్యన్నాత్మని తుష్యతి. ౨౦

సుఖమాత్యన్తికం యత్తద్బుద్ధిగ్రాహ్యమతీన్ద్రియమ్,
వేత్తి యత్ర న చైవాయం స్థితశ్చలతి తత్త్వతః. ౨౧

యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాధికం తతః,
యస్మిన్ స్థితో న దుఃఖేన గురుణాఽపి విచాల్యతే. ౨౨

ఏయవస్థను మనం • బీయోగసేవ ని
గ్రహియింపఁబడి యుప•రతినిఁ జెందు,
నేయవస్థను నాత్మ•చే యలపరమాత్మ
నాత్మయందునఁ జూచు • చలరుచుండు,
నేయవస్థను సక•లేంద్రియాగోచర
మై బుద్ధి నెఱుఁగు సౌ•ఖ్యమ్మునందు,
నేయవస్థాస్థితుఁ • డౌయోగికులమణి
తత్త్వరూపమునుండి • తరలఁ బోవఁ

డెట్టిలాభ మొంది • యితరలాభంబుల
దానికన్న నధిక•తరము గాంచు
నెంచఁ, డెద్ది యాశ్ర•యించి దుఃఖంబుల
నొందెనేనిఁ జలన • మొందఁబోఁడు. ౧౭

తం విద్యాద్దుఃఖసంయోగవియోగం యోగసంజ్ఞితమ్,
స నిశ్చయేన యోక్తవ్యో యోగోఽనిర్విణ్ణచేతసా. ౨౩

అట్లు పూర్వోక్త మహావ్యస•నాదికములఁ
దగులకుంటయె యోగాఖ్యఁ • దనరుచుండు,
నట్టియోగంబు దుఃఖంబు • నందఁబోని
చిత్తమున, నిశ్చయమ్మునఁ • జేర్పనగును. ౧౮

సఙ్కల్పప్రభవాన్ కామాం స్త్యక్త్వా సర్వానశేషతః,
మనసై వేన్ద్రియగ్రామం వినియమ్య సమన్తతః. ౨౪

విడిచి సంకల్పమునఁ బ్రభ•వించినట్టి
కామములనెల్ల సాంగమ్ము•గా; మనమ్ము
వలన నిందిరియవర్గమ్ము • వశముఁ జేసి
కొనియు, నావల యోగమ్ముఁ • గూర్పవలయు. ౧౯

శనైశ్శనైరుపరమేద్బుద్ధ్యా ధృతిగృహీతయా,
ఆత్మసంస్థం మనః కృత్వా న కిఞ్చిదపి చిన్తయేత్. ౨౫

అమితధైర్యగృహీతమై•నట్టి బుద్ధి
చేతను, మనంబు నాత్మసం•స్థిత మొనర్చి,

యల్లనల్లన నుపరతి • నందఁజేయ
వలయుఁ, గాసంత చింతింప • వలనుపడదు. ౨౦

యతో యతో నిశ్చరతి మనశ్చఞ్చలమస్థిరమ్,
తత స్తతో నియమ్యైతదాత్మన్యేవ వశం నయేత్. ౨౬

అస్థిరమ్మును చంచల • మైనమనము
సంచరించునో యేయేవి • షయములందు,
వానినుండి మరల్చియుఁ • బూని దాని
నాత్మవశ మొనరింపఁగా • నగును జుమ్మి. ౨౧

ప్రశాన్తమనసం హ్యేనం యోగినం సుఖముత్తమమ్,
ఉపైతి శాన్తరజసం బ్రహ్మభూతమకల్మషమ్. ౨౭

బ్రహ్మభూతుఁడు శాంతభా • వమ్మువాఁడు
నల రజోగుణవర్జితుం • డఘువిదూరుఁ
డైనయోగిని నుత్తమ • మైనసుఖము
తనకుఁ దా వచ్చి పొందు య • థార్థముగను. ౨౨

యుఞ్జన్నేవం సదాఽఽత్మానం యోగీ విగతకల్మషః,
సుఖేన బ్రహ్మసంస్పర్శమత్యన్తం సుఖమశ్నుతే. ౨౮

పూని యీవిధి, నిరతంబు • మానసంబు
సంయమం బొనరించియు. • సర్వపాప
రహితుఁ డౌ యోగి, కాంచుచు • బ్రహ్మ, మధిక
సుఖము నందుచు నున్నాఁడు • సులభవృత్తి. ౨౩

సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాఽఽత్మని,
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః. ౨౯

సకలభూతమ్ములందున ♦ సముఁడు నగుచు,
యోగయుక్తాత్మకుండయి, ♦ యుర్వి నఖిల
భూతములయందు నాత్మఁ ద♦ద్భూతకోటి
నాత్మయందున, వీక్షించు♦నయ్య ! పార్థ ! ౨౮

యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి,
తస్యాహం న ప్రణశ్యామి స చ మే న ప్రణశ్యతి. ౩౦

ఎవఁడు సర్వత్ర నన్నుఁ జూచు, ♦ నెవఁడు విశ్వ
మంత నాయందె వీక్షించు ♦ చలరుచుండు;
వాని కే నదృశ్యుండ నె♦ప్పటికిఁ గాను,
వాఁడు నాకు నదృశ్యుఁ డె♦ప్పటికిఁ గాఁడు. ౨౯

సర్వభూతస్థితం యో మాం భజత్యేకత్వ మాస్థితః,
సర్వథా వర్తమానోఽపి స యోగీ మయి వర్తతే. ౩౧

ఎవఁడు భేద మెఱుంగ కొ♦క్కింత, సకల
భూతములఁ దేజరిలు నన్నుఁ ♦ బూజసేయు,
వాఁ డనేకవిధమ్ముల ♦ వర్తనమ్ము
సేయుచుండియు, నాయందె ♦ చెలఁగుచుండు. ౩౦

ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున,
సుఖం వా యది వా దుఃఖం స యోగీ పరమో మతః. 32

విజయ! యెవ్వాఁడు సుఖదుఃఖ వితతియందుఁ
దన్నువోలె సమస్తభూతమ్ములందుఁ
గన్గొనుచునుండు, సమబుద్ధి గల్గి, యతఁడె
పరమయోగి యటంచును బలుకఁబడును. ౩౨

యోఽయం యోగస్త్వయా ప్రోక్తః సామ్యేన మధుసూదన,
ఏతస్యాహం న పశ్యామి చఞ్చలత్వాత్ స్థితిం స్థిరామ్. 33

మాధవా! త్వన్ముఖోక్తసమత్వ మనెడు
యోగ, మేను చాంచల్యమ్ము నొందుకతన,
దీని సుస్థిరమాస్థితి యే నొకించు
కైనఁ, దెలియంగఁజాల యథార్థ మిద్ది. ౩౩

చఞ్చలం హి మనః కృష్ణ! ప్రమాథి బలవద్దృఢమ్,
తస్యాహం నిగ్రహం మన్యే వాయోరివ సుదుష్కరమ్. 34

నిలుకడలేని దించుకయు, నిగ్రహసాధ్యముగాదు, చిక్కఁగన్
గాలిపెడి, దెంతయో దృఢము, గోకులపాల! మనమ్ము; దీనినిన్
సలుపనిరోధమెమ్మెయి నశక్య, మటంచని యూహఁజేతునే
నెలమిని, మారుతమ్మునను నేఁ యరికట్ట తరంబ దేరికిన్. ౩౪

అసంశయం మహాబాహో! మనో దుర్నిగ్రహం చలమ్,
అభ్యాసేన తు కౌన్తేయ వైరాగ్యేణచ గృహ్యతే. ౩౫

ఓమహాభుజ! కౌంతేయ! ◆ యీమనమ్ము
చంచల మనిగ్రహమ్ము ని◆స్సంశయమ్ము,
గాని, యభ్యాసమున విరా◆గమ్ము వలన
నల్పఁగావచ్చు, దాని వ◆శమ్ముగాఁగ. ౩౦

అసంయతాత్మనా యోగో దుష్ప్రాప ఇతి మే మతిః,
వశ్యాత్మనా తు యతతా శక్యోఽవాప్తుముపాయతః. ౩౬

ఆత్మసంయమవిరహితుఁ ◆ డైనవాని,
కిమ్మహాయోగ మెపుడు ల◆భ్యమ్ము గాదు;
గాని, దృఢయత్నవశ్యాత్మ◆కలితునకును
బ్రాప్త మగునని తలఁతు ను◆పాయమునను. ౩౧

అయతిః శ్రద్ధయోపేతో యోగాచ్చలితమానసః,
అప్రాప్య యోగసంసిద్ధిం కాం గతిం కృష్ణ గచ్ఛతి. ౩౭

శ్రద్ధ గలిగియు నియమానుసారి గాక,
యోగసంచలితాత్ముఁడై ◆ యొప్పువాఁడు,
యోగసంసిద్ధి నొందక ◆ నోమహాత్మ!
కాంచనాంబర! వాఁ డెట్టి◆గతిని బొందు? ౩౨

కచ్చిన్నోభయవిభ్రష్ట శ్ఛిన్నాభ్రమివ నశ్యతి,
అప్రతిష్ఠో మహాబాహో! విమూఢో బ్రహ్మణః పథి. ౩౮

ఏతం మే సంశయం కృష్ణ! ఛేత్తుమర్హస్యశేషతః,
త్వదన్యస్సంశయస్యాస్య ఛేత్తా న హ్యుపపద్యతే. ౩౯

సరసిజనేత్ర! బ్రహ్మపదసంగతిమాధ్యమునందుపూరుషుం,
డిరుతెగలందు భ్రష్టత వహించి నిరాశ్రయుఁడై, చలత్పయో
ధరములమాడ్కిఁ దాఁ జెడఁడె? తథ్యమ, నాకిటువంటిసందియం
బరయఁగఁదీర్పగాఁదగిన యాతఁడవీవె;త్వదన్యుఁడుండునే? ౩౩

పార్థ! నైవేహ నాముత్ర వినాశ స్తస్య విద్యతే,
న హి కల్యాణకృత్కశ్చిద్దుర్గతిం తాత! గచ్ఛతి. ౪౦

పార్థ! యీయోగమార్గవిభ్రష్టునకును
నిహపరమ్ముల నాశన మెప్పుడు లేదు,
నాయనా! భావుకమ్ము లొనర్చు వ్యక్తి
యొక్కఁడేని కుత్సితగతి నొందఁడుగద! ౩౪

ప్రాప్య పుణ్యకృతాం లోకానుషిత్వా శాశ్వతీస్సమాః,
శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే. ౪౧

అర్జునా! యోగపతనంబు నందువాఁడు
పుణ్యకర్మ్మలలోకముల్ పొంది, పెక్కు
వత్సరము లుండి, యాచారవంతులైన
భాగ్యవంతులయిండ్ల సంభవము నందు. ౩౫

అథవా యోగినామేవ కులే భవతి ధీమతామ్,
ఏతద్ధి దుర్లభతరం లోకే జన్మ యదీదృశమ్. ౪౨

ఆవిధిఁ గాకుండిన, వి
ద్యావిదు లౌ యోగిజనమ♦హాన్వయమునఁ దా
నావిర్భవించు; నియ్యది
భావింపఁగ లోకమందు ♦ బహుదుర్లభమౌ. ౩౬

తత్ర తం బుద్ధిసంయోగం లభతే పౌర్వదైహికమ్,
యతతే చ తతో భూయస్సంసిద్ధౌ కురునన్దన. ౪౩

అచ్చటం బూర్వదైహిక ♦ మైనయట్టి
బుద్ధిసంయోగభాగ్యంబుఁ ♦ బొందుసుమ్ము,
మఱలఁ దత్పూర్వసంస్కార♦మహిమవలనఁ
జేయు యత్నంబు జ్ఞానసం♦సిద్ధికొఱకు. ౩౭

పూర్వాభ్యాసేన తేనైవ హ్రియతే హ్యవశోఽపి సః,
జిజ్ఞాసురపి యోగస్య శబ్దబ్రహ్మాతివర్తతే. ౪౪

భ్రష్టయోగి ప్రాక్సంభవా♦భ్యాసమునను
విషయనిగ్రహమొనరించి, ♦ వివశహృదయుఁ
డయ్యు యోగజిజ్ఞాసువు ♦ నైనవాఁడు,
అనఘ! మించు శబ్దబ్రహ్మ♦మును జయించి. ౩౮

ప్రయత్నాద్యతమానస్తు యోగీ సంశుద్ధకిల్బిషః,
అనేకజన్మసంసిద్ధ స్తతో యాతి పరాం గతిమ్. ౪౫

అర్జునా! చేయుచును యోగి • యత్నములను,
బాపసంఘవిముక్తుఁడై, • బహుళజన్మ
సంస్కృతిఁ, సిద్ధినొందియు • సరవి నంతఁ
బొందు నౌర! మహోత్కృష్ట • మోక్షపదము. ౩౯

తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపి మతోఽధికః,
కర్మిభ్యశ్చాధికో యోగీ తస్మాద్యోగీ భవార్జున. ౪౬

తాపసులకంటె, జ్ఞానస • ద్ధర్మవిదుల
కంటెఁ, గర్మిష్ఠకంటెను, • ఘనుఁ డటంచుఁ
దలఁపఁబడె యోగి; కాన నో • ధరణినాథ!
యత్న మొనరింపుమా! యోగి • వగుట కీవు. ౪౦

యోగినామపి సర్వేషాం మద్గతేనాన్తరాత్మనా,
శ్రద్ధావాన్ భజతే యో మాం స మే యుక్తతమో మతః.

అర్జునా! మద్గతంబైన • యంతరాత్మ,
నెవఁడు విశ్వాసియై భజి • యించు నన్ను,
నాతఁడే సర్వయోగిజ • నాళియందు
యుక్తతముఁ డంచు మన్మది • నూహఁ జేతు. ౪౧

# ఏడవయధ్యాయము

## విజ్ఞానయోగము

మయ్యాసక్తమనాః పార్థ! యోగం యుఞ్జన్మదాశ్రయః,
అసంశయం సమగ్రం మాం యథా జ్ఞాస్యసి తచ్ఛృణు. ౧

పార్థ! చిత్తంబు నాయందె ♦ పాదుకొల్పి,
యోగము ఘటించుచు, మదాశ్రి♦యుండ వగుచు,
నెటు సమగ్రుండ నగునన్ను ♦నెఱుఁగఁగలవొ!
తీఱె శంకలు, విను దానిఁ ♦ దెల్పువాఁడ. ౧

జ్ఞానం తేఽహం సవిజ్ఞానమిదం వక్ష్యామ్యశేషతః,
యజ్జ్ఞాత్వానేహ భూయోఽన్య జ్జ్ఞాతవ్య మవశిష్యతే. ౨

ఎద్ది గ్రహియింప, ముక్తికై ♦ యింకఁ దెలియ
నన్యవిషయ మొక్కించుక♦మైన లేదొ,
అట్టివిజ్ఞానసంయుక్త ♦ మైనజ్ఞాన
మును వచించెద సాకల్య♦ముగను వినుమ! ౨

మనుష్యాణాం సహస్రేషు కశ్చి ద్యతతి సిద్ధయే,
యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః. 3

కన నరసహస్రములయం దొ♦కానొకండు,
సిద్ధికొఱకయి యత్నంబుఁ ♦ జేయుచుండు,
నటుల యత్నించుసిద్ధుల♦యందు నన్ను
నేయొకఁడొ నిశ్చయమ్ముగా ♦ నెఱుఁగఁగలఁడు. 3

భూమిరాపో౽నలో వాయుః ఖం మనో బుద్ధిరేవ చ,
అహఙ్కార ఇతీయం మే భిన్నా ప్రకృతి రష్టధా. ౪

అవని, యుదకము, నగ్నియు, ♦ ననిల, మాక
స, మ్మహంకారమును, మాన♦సమ్ము, బుద్ధి
యనఁగ నెనిమిదివిధముల ♦ నయ్యె భేద
మస్మదీయప్రకృతి, యోపృ♦థాత్మజాత ! ౪

అపరేయమితస్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరామ్,
జీవభూతాం మహాబాహో! యయేదం ధార్యతే జగత్. ౫

ఇది నికృష్టంబు, దీనికి ♦ నితర మగుచుఁ
బరమునై జీవభూతమై ♦ పరగుచును, ధ
రించు నెయ్యది సకలప్ర♦పంచ మెల్ల,
నట్టియస్మత్ప్రకృతి గనుమా! కిరీటి! ౫

ఏతద్యోనీని భూతాని సర్వాణీత్యుపధారయ,
అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రళయ స్తథా. ౬

కర్త్రి! యీ రెండుప్రకృతులె • కారణములు
సర్వభూతమ్ములకును; నీ • జగతి కెల్ల,
ప్రభవమునకును మఱియును • బ్రళయమునకుఁ
గారణం బేనె యాదు ని • క్కమ్ము నమ్ము! ౬

మత్తః పరతరం నాన్యత్కిఞ్చిద స్తి ధనఞ్జయ,
మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ. ౭

ఓధనంజయ! నాకంటె • యుత్తమ మగు
నన్యకారణ మావంత • యైన లేదు,
యీజగంబెల్ల నాయందె • యెనఁగుచుండు,
దారమునఁ గూర్చఁబడిన ర • త్నంబులట్లు.

రసోఽహమప్సు కౌన్తేయ ప్రభాఽస్మి శశిసూర్యయోః,
ప్రణవస్సర్వవేదేషు శబ్దః ఖే పౌరుషం నృషు. ౮
పుణ్యో గన్ధః పృథివ్యాం చ తేజశ్చాస్మి విభావసౌ,
జీవనం సర్వభూతేషు తపశ్చాస్మి తపస్విషు. ౯

సలిలములందుఁ గల్గురుచి, • చంద్రదినేశులఁ గల్గు కాంతియున్,
యిలఁ గలపుణ్యగంధమును, • యెల్లరిజీవన, మగ్ని తేజమున్,
అలరు తపస్వులందు తప, • మాపురుషావళిపౌరుషమ్ము, ని
ర్మలనిగమంబులన్ బ్రణవ • మంత్రము, నింగి రవంబు, నేనయా.

బీజం మాం సర్వభూతానాం విద్ధి పార్థ! సనాతనమ్,
బుద్ధి ర్బుద్ధిమతామస్మి తేజ స్తేజస్వినా మహమ్. ౧౦

నే సనాతనుండ, నిఖలభూతములకు
బీజ మేన నూ, వివేకశక్తి
యుతులబుద్ధి యేన, యుర్వి తేజస్వుల
తేజ మేన యంచుఁ దెలిసికొనుమ. ౯

బలం బలవతాం చాహం కామరాగవివర్జితమ్,
ధర్మావిరుద్ధో భూతేషు కామోఽస్మి భరతర్షభ! ౧౧

అర్జునా ! బలవంతులదైన కామ
రాగవర్జితమైన బలమ్ము నేన,
ధరణి భూతౌఘములయందు ధర్మబద్ధ
మైనకామంబు నేనె యంటం చెలుంగు. ౧౦

యే చైవ సాత్త్వికా భావా రాజసా స్తామసాశ్చ యే,
మత్త ఏవేతి తాన్విద్ధి న త్వహం తేషు తే మయి. ౧౨

సాత్వికమున రాజసతామసములవలనఁ
గల్గుభావముల్ నాచేతఁ గల్గినవియె
కాని; తద్భావములయందు నేను లేను,
అమరుచుండును నాయందె యవియు నెల్ల. ౧౧

త్రిభి ర్గుణమయై ర్భావై రేభి స్సర్వమిదం జగత్,
మోహితం నాభిజానాతి మామేభ్యః పర మవ్యయమ్.    ౧౩

గుణమయంబగు తద్భావకోటిచే, వి
మోహితం బైన లోకమ్ము భూవరేణ్య!
వానికి విలక్షణుండ నవ్యయుఁడనైన
నన్నుఁ దెలియంగ నేర దెన్నటికి నైన.    ౧౨

దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా,
మామేవ యే ప్రపద్యన్తే మాయామేతాం తరన్తి తే.    ౧౪

అరయ దైవీయమును త్రిగుణాత్మకమ్ము
నైన నామాయ దాట శక్యమ్ము గాదు,
ఏరు శరణమ్ముఁ బొందుచున్నారొ నన్ను,
వారలే దీని దాటెడువారు విజయ!    ౧౩

న మాం దుష్కృతినో మూఢాః ప్రపద్యన్తే నరాధమాః,
మాయయాపహృతజ్ఞానా ఆసురం భావమాశ్రితాః.    ౧౫

పాపకర్ములు నవివేకభారవహులు,
మాయచే నెఱుకను బాయుమానవులును,
ఆసురంబగు భావమ్ము నాశ్రయించి
నన్ను భజియింపఁ గోర రో నరవరేణ్య!    ౧౪

చతుర్విధా భజన్తే మాం జనాస్సుకృతినోఽర్జున!
ఆర్తో జిజ్ఞాసురర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ. ౧౬

ఆర్తుఁడగువాఁడు, జిజ్ఞాసు ♦ వైనవాఁడు,
నర్థకాముండు, జ్ఞానియై♦నట్టివాఁడు,
పూన్కి నీనాల్గువిధముల♦పుణ్యజనులు,
నన్ను భజియించుచున్నా ర♦నారతంబు. ౧౭

తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తి ర్విశిష్యతే,
ప్రియో హి జ్ఞానినోఽత్యర్థ మహం స చ మమ ప్రియః. ౧౭

నిక్కముగ వీరిలోపల ♦ నిత్యయోగి
ముఖ్యభక్తుండునౌ జ్ఞాని ♦ ముఖ్యతముఁడు,
అధికమైనట్టిప్రియుఁడ నే ♦ నట్టిజ్ఞాని;
కతఁడుగూడ ప్రియుండు నా ♦ కమితముగను. ౧౮

ఉదారా స్సర్వ ఏవైతే జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్,
ఆస్థిత స్స హి యుక్తాత్మా మామేవానుత్తమాం గతిమ్. ౧౮

ఈ చతుర్విధభక్తు లు♦త్కృష్టు, లైన
నేఁ దలంచెద నాజ్ఞాని ♦ నేనె యనుచు,
నతఁడు యుక్తాత్ముఁడై నన్నె ♦ యమలమైన
ప్రాప్యపదమని నమ్మియుఁ ♦ బడయుచుండు. ౧౯

బహూనాం జన్మనామన్తే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే,
వాసుదేవ స్సర్వమితి స మహాత్మా సుదుర్లభః. ౧౯

జ్ఞానినై బహుజన్మముల్ • చనినపిదప,
నఖిలమును వాసుదేవుఁడె • యంచు నెంచి,
పొందుచున్నాఁడు నన్ను నా•నందముగను,
అతఁడ యగు దుర్లభుండు మ•హాత్ముఁ డనఁగ. ౧౮

కామైస్తైస్తైర్హృతజ్ఞానాః ప్రపద్యన్తేఽన్యదేవతాః,
తం తం నియమమాస్థాయ ప్రకృత్యా నియతాస్స్వయా. ౨౦

పార్థ! యాత్మీయమైన స్వ•భావమునను
నియతులగుచు, నాయా కామ•నివహములను
నపహృతజ్ఞానులై, నియ•మాస్థితులయి,
యన్యదేవతలను గొల్తు • రయ్య జనులు. ౧౯

యో యో యాం యాం తనుం భక్తశ్శ్రద్ధయార్చితుమిచ్ఛతి,
తస్య తస్యాచలాం శ్రద్ధాం తామేవ విదధామ్యహమ్. ౨౧

ఎవ్వఁ డేయేయభిమతాళి • నిచ్ఛగించి
యర్చన మొనర్చునో విగ్ర•హముల భక్తి,
నతనికిని వానియందున • నట్టిశ్రద్ధ
నేనె స్థిరముగఁ జేయుచు•న్నాను ధ్రువము. ౨౦

స తయా శ్రద్ధయా యుక్త స్తస్యారాధన మీహతే,
లభతే చ తతః కామా న్మయైవ విహితా న్హితాన్.

అట్టిశ్రద్ధాసమన్వితుఁ • డగుచు నతఁడు
సవ్యసాచి! తదర్చనా•సక్తిఁ దనరు,
మత్కృతంబౌ నభీష్టకా•మములఁ దన్మ
ఖమ్ము నను నె పొందుచుండు ని•క్కమ్ముగాను. ౨౨

అన్తవత్తు ఫలం తేషాం తద్భవత్యల్పమేధసామ్,
దేవాన్ దేవయజో యాన్తి మద్భక్తా యాన్తి మామపి.

అల్పబుద్ధులు నగు కొంద • అన్యదేవ
తలను బూజించి వారినే • గలియఁగలరు,
అంతమొందుఁ దదీయఫ•లాదులెల్ల,
నాదుభక్తులు పొందుచు•న్నారు నన్నె. ౨౩

అవ్యక్తం వ్యక్తి మాపన్నం మన్యన్తే మామబుద్ధయః,
పరం భావ మజానన్తో మమావ్యయమనుత్తమమ్. ౨౪

అవ్యయము నుత్తమో త్తమ•మైన నాదు
భావ మెఱుఁగని మూఢులో • పాండుతనయ!
ఔర! యూహించుచుండు ర•వ్యక్తు నన్ను
వ్యక్తిసంపన్నుఁడై నట్టి • వానిఁగాఁగ. ౨౫

నాహం ప్రకాశస్సర్వస్య యోగమాయాసమావృతః,
మూఢోఽయం నాభిజానాతి లోకో మామజమవ్యయమ్.

కాను నే సర్వమునకు ప్ర॰కాశకుండ,
కవ్వడీ ! మూఢమైన లో॰కం బదెల్ల
యోగమాయాసమావృత ॰ మొంది నన్ను
నవ్యయునిగాఁగ నజునిఁగా ॰ నరయలేదు. ౨౫

వేదాఽహం సమతీతాని వర్తమానాని చాఽర్జున,
భవిష్యాణి చ భూతాని మాం తు వేద న కశ్చన. ౨౬

ఉన్నవానిని, మఱియును ॰ జన్నవాని,
నెన్నగా ముందు రాఁబోవు॰చున్నవాని,
నెఱుఁగు దే నెల్లభూతాళి; ॰ నెఱుఁగఁజాలఁ
డొక్కఁడైనను నను భువి ॰ నిక్కముగను. ౨౬

ఇచ్ఛాద్వేషసముత్థేన ద్వన్ద్వమోహేన భారత,
సర్వభూతాని సమ్మోహం సర్గే యాన్తి పరంతప. ౨౭

ద్వేషమున నిచ్చచేఁ గల్గి ॰ వెలయునట్టి
ద్వంద్వమోహమ్ముచేత భూ॰తమ్ము లెల్ల,
సర్గసమయంబునందు నో॰సవ్యసాచి!
పొందుచున్నవి సమ్మోహ॰మును దలంప. ౨౭

యేషాం త్వన్తం గతం పాపం జనానాం పుణ్యకర్మణామ్,
తే ద్వన్ద్వమోహనిర్ముక్తా భజన్తే మాం దృఢవ్రతాః. ౨౮

పుణ్యకర్మల నాశంబుఁ • బొందు నెవరి
పాపచయ, మట్టివారలు • ద్వంద్వమోహ
ముక్తులై, నిశ్చయవ్రతా•సక్తు లగుచు,
నన్ను వీడక భజియించు•చున్నవారు. ౨౮

జరామరణమోక్షాయ మా మాశ్రిత్య యతన్తి యే,
తే బ్రహ్మ తద్విదుః కృత్స్న మధ్యాత్మం కర్మ చాఖిలమ్.

జరయు, మరణంబునుండి మో•క్షంబు నంద
నెవరు యత్నింతురో యాశ్ర•యించి నన్ను,
పార్థ! తెలియుచునున్నారు • వారు; బ్రహ్మ,
మఖిలకర్మము విస్తృతా•ధ్యాత్మ మనుచు. ౨౯

సాధిభూతాధిదైవం మాం సాధియజ్ఞం చ యే విదుః,
ప్రయాణకాలేఽపి చ మాం తే విదుర్యుక్తచేతసః. 30

భూవరా! యధిభూతాధి•దైవతాధి
యజ్ఞములతోడఁ గూడిన•యట్టినన్ను
నెవరు గ్రహియింతురో వార • లెల్ల యుక్త
హృదయులై తుదితఱి నన్ను • నెఱుఁగఁగలరు. ౩౦

# ఎ ని మి ద వ య ధ్యా య ము

## అక్షర పరబ్రహ్మయోగము.

కిం తద్బ్రహ్మ కి మధ్యాత్మం కిం కర్మ పురుషోత్తమ,
అధిభూతం చ కిం ప్రోక్త మధిదైవం కి ముచ్యతే. ౧

ఎద్ది తద్బ్రహ్మ? మధ్యాత్మ • మెద్ది యనఁగ?
నెద్ది కర్మంబు? నధిభూత • మెద్ది యూను?
ఎద్ది యధిదైవమని వచి•యింపఁబడును ?
పరమపురుష! జగత్పోష • భక్తతోష! ౧

అధియజ్ఞః కథం కోఽత్ర దేహేఽస్మి న్మధుసూదన,
ప్రయాణకాలే చ కథం జ్ఞేయోఽసి నియతాత్మభిః. ౨

అనఘ! యీ దేహమం దధి•యజ్ఞుఁ డెవ్వఁ ?
డేవిధమ్మున నయ్యది • యెఱుఁగ నగును?
అంత్యకాలంబునన్ నియ•తాత్ములకును
నెటుల జ్ఞేయుండ వయ్యెద • వీవు కృష్ణ ! ౨

అక్షరం బ్రహ్మ పరమం స్వభావోఽధ్యాత్మముచ్యతే,
భూతభావోద్భవకరో విసర్గః కర్మసంజ్ఞితః. 3

అర్జున! స్వభావ మధ్యాత్మ ♦ మనఁగఁ దనరు,
పరమమై తగు బ్రహ్మ మ♦క్షరము సుమ్మి,
భూతభావోద్భవకరంబు ♦ నై తనర్చు
తతవిసర్గమ్ము కర్మసం♦జ్ఞితము తలఁప. 3

అధిభూతం క్షరో భావః పురుషశ్చాధిదైవతమ్,
అధియజ్ఞోఽహమేవాత్ర దేహే దేహభృతాం వర. ४

నరవరా! యధిభూతమ్ము ♦ నాశనస్వ
భావమును గల్గునది, యధి♦దైవ మనఁగ
పురుషుఁ, డీదేహమందునఁ ♦ బగగుచుండు
నట్టి యధియజ్ఞుఁడను నేన ♦ యౌ నిజంబు. ४

అన్తకాలే చ మామేవ స్మరన్ముక్త్వా కళేబరమ్,
యః ప్రయాతి స మద్భావం యాతి నాస్త్యత్ర సంశయః. ౫

స్మరణఁజేయుచు న న్నంత్య♦సమయమందు
నెవఁడు కాయమ్ము వీడియు ♦ నేఁగు నతఁడు,
పడయుచున్నాఁడు మత్స్వరూ♦పమ్ము విజయ!
యింద సందియ మావంత♦యేని లేదు. ౫

యం యం వాపి స్మర౯ భావం త్యజత్యన్తే కళేబరమ్,
తంత మేవై తి కౌ న్తేయ! సదా తద్భావభావితః. ౬

ఎవ్వఁ డేయేస్వరూపంబు ♦ లెదఁ దలంచు
చంత్యకాలంబునందు దే♦హంబుఁ బాయు;
నతఁడు తద్భావభావితుం♦డై తదీయ
భావ మందుచున్నాఁడు ♦ పాండుతనయ! ౬

తస్మాత్సర్వేషు కాలేషు మామనుస్మర యుధ్య చ,
మయ్యర్పితమనోబుద్ధిర్మామేవై ష్యస్యసంశయమ్. ౭

నరవర! కాన నెల్లపుడు ♦ నన్నె స్మరింపుమ! నిశ్చలుండవై,
గురుతరభండనంబు నెదఁ ♦గోరి ఘటింపు, మనమ్ము బుద్ధి నీ
వరమఱ లేక నుంతయు స♦మర్పణఁజేయుమ, భక్తినా యెడ౯
నరయఁగ నన్నె చెందఁగల♦వయ్య! యసంశయ మిద్ది నమ్ముమా!

అభ్యాసయోగయుక్తేన చేతసా నాన్యగామినా,
పరమం పురుషం దివ్యం యాతి పార్థానుచింతయన్. ౮

ఓయి! కౌంతేయ! యభ్యాస♦యోగయుక్తుఁ
డగుచు నన్యంబులందున ♦ నాసలేని
స్వాంతమున, దివ్యరూపుఁ డౌ ♦ పరమపురుషుఁ
జెందుచున్నాఁడు చింతనఁ ♦ జేయు చతని. ౮

కవిం పురాణమనుశాసితార మణోరణీయాంసమనుస్మరేద్యః,
సర్వస్యధాతార మచిన్త్యరూపమాదిత్యవర్ణం తమసః పరస్తాత్.
ప్రయాణకాలే మనసాఽచలేన భక్త్యాయుక్తో యోగబలేనచైవ,
భ్రువోర్మధ్యేప్రాణమావేశ్యసమ్యక్సతంపరంపురుషముపైతిదివ్యం

సర్వజ్ఞుఁడై, సర్వ•శాసనకర్తయై,
సూక్ష్మముకంటెను • సూక్ష్మమగుచు,
సకలమ్మునకు విభ•జనకర్తయై, సనా
తనుఁ డచింతితరూప•ధారి యగుచు,
నాదిత్యవర్ణుఁడై, • యజ్ఞానమోహాంధ
కారదూరుండయి, • మీఁఱుపురుషు,
నిశ్చలస్వాంతుఁడై • నిర్మలభక్తిమై
యోగబలంబుచే • యుక్తుఁ డగుచు,
నెవఁడు భ్రూమిమధ్యమున వసి•యింపఁజేసి,
ప్రాణవాయువు, దేహంబుఁ • బాయుతఱిని
స్మరణఁజేయునో, వాఁడు త•త్పరమదివ్య
పురుషునిం బొందుచున్నాఁడు • పురుషవర్య! ౯

యదక్షరం వేదవిదో వదన్తి
విశన్తి యద్యతయో వీతరాగాః,

యదిచ్ఛన్తో బ్రహ్మచర్యం చరన్తి
తత్తే పదం సఙ్గ్రహేణ ప్రవక్ష్యే ౧౧

ఏపద మక్షరం బని సర్వేశ్వర! వేదవిదు ల్వచింతురో,
యేపద మందువారలా యతీంద్రసమూహము వీతరాగులై,
యేపదమిచ్ఛగించి ఘటియింతురొపూనికనిబ్రహ్మచర్యముఁ,
ఆపదముఁ గురించియు పృథాత్మజ! దెల్పెద సంగ్రహంబుగన్.

సర్వద్వారాణి సంయమ్య మనో హృది నిరుధ్య చ,
మూర్ధ్న్యాధాయాత్మనః ప్రాణమాస్థితో యోగధారణామ్.
ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహర న్మామనుస్మరన్,
యః ప్రయాతి త్యజ న్దేహం స యాతి పరమాం గతిమ్.

సకలేంద్రియద్వారనికరంబు లెస్సగా
మునుకొని సంయమంబుగ నొనర్చి,
సదమలహృజ్జలజాతాంతరంబున
మించి మానసము బంధించివైచి,
సరవి సహస్రారచక్రంబునందున
ప్రాణానిలంబుఁ బెంపారఁ జేసి,
యుత్తమోత్తమమైన యోగధారణమును
నధికమాశ్రిద్ధ సమాశ్రయించి,
బ్రహ్మవాచకోంకృతిముఖ్యవర్ణ మెవ్వఁ
డుచ్చరించుచు స్తుతియించు చొగిని నన్నుఁ;

నరుగుచున్నాఁడో దేహంబు • నవలఁ ద్రోసి
యాతఁ డుత్కృష్టమాగతి • నందఁగలఁడు. ౧౧

అనన్యచేతాః సతతం యో మాం స్మరతి నిత్యశః,
తస్యాహం సులభః పార్థ! నిత్యయుక్తస్య యోగినః. ౧౪

అర్జునా! యనవరత మ•నన్యబుద్ధి
నెవఁడు జీవితపర్యంత • మెంచు నన్ను,
నిత్యయుక్తుం డగుచు నట్లు • నెగడు యోగి
కమితసులభుండ నౌదు య•థార్థ మేను. ౧౨

మా ము పేత్య పునర్జన్మ దుఃఖాలయమశాశ్వతమ్,
నాప్నువన్తి మహాత్మానః సంసిద్ధిం పరమాం గతాః. ౧౫

అనఘచరిత! మహోత్కృష్ట•మైనయట్టి
యమలసంసిద్ధిఁ గనిన మ•హాత్ము లెల్ల
రఖిలదుఃఖాలయమ్మును • నస్థిరమ్ము
నగు పునర్జన్మ మెన్నటి • కందఁబోరు. ౧౩

ఆబ్రహ్మభువనాల్లోకాః పునరావర్తినోఽర్జున,
మా ముపేత్య తు కౌన్తేయ! పునర్జన్మ న విద్యతే. ౧౬

అర్జునా! బ్రహ్మలోకప•ర్యంతనిఖిల
భువనములు పునరావృత్తిఁ • బొందు నవియె,
కాని ననుఁ బొందువారు ని•క్కంబుగాను,
నెన్నటికినైన మఱి జని•యింపఁబోరు. ౧౪

సహస్రయుగపర్యన్త మహ ర్య ద్బ్రహ్మణో విదుః,
రాత్రిం యుగసహస్రాన్తాం తేఽహోరాత్రవిదో జనాః. ౧౭

ఎవ రహోరాత్రనిర్ణయ • మెఱుఁగువారో,
వేయియుగములయవధియు • వేయియుగము
లంతమును గల్గినట్టి యా • యబ్జభవుని
పవలురేల నెఱుంగు త • త్పండితాళి. ౧౫

అవ్యక్తాద్వ్యక్తయస్సర్వాః ప్రభవన్త్యహరాగమే,
రాత్ర్యాగమే ప్రలీయన్తే తత్రైవావ్యక్తసంజ్ఞకే. ౧౮

అట్టి యహరాగమమున న • వ్యక్తువలన
సకలమా వ్యక్తినివహంబు • సంభవించు,
వానిరాత్ర్యాగమమున న • వ్యక్తసంజ్ఞఁ
డై నయాతనియం దవి • యడఁగుచుండు. ౧౬

భూతగ్రామస్స ఏవాయం భూత్వా భూత్వా ప్రలీయతే,
రాత్ర్యాగమేఽవశః పార్థ! ప్రభవ త్యహరాగమే. ౧౯

పాండునందన! భూతప్ర • పంచ మెల్ల
నస్వతంత్రంబునం బుట్టు • వంది యంది,
లీల రాత్ర్యాగమమునఁ బ్ర • లీన మగును,
అట్లె ప్రభవించుచుం డహ • రాగమమున. ౧౭

పర స్తస్మాత్తు భావోఽన్యోఽవ్యక్తోఽవ్యక్తాత్సనాతనః,
య స్స సర్వేషు భూతేషు నశ్యత్సు న వినశ్యతి. ౨౦

ఇట్టు లవ్యక్తుకంబెను • నితరమై ప
రంబు నవ్యక్తము సనాత•నంబు నగుచు,
నలరు నేయక్షరబ్రహ్మ • మద్ది సర్వ
భూతము లడంగినను చెడఁ•బో దొకింత. ౧౮

అవ్యక్తోఽక్షర ఇత్యుక్త స్తమాహుః పరమాం గతిమ్,
యం ప్రాప్య న నివర్తన్తే తద్ధామ పరమం మమ. ౨౧

అక్షరంబు నవ్యక్తంబు • నని వచింపఁ
బడిమె నెయ్యది; యద్దియే • పరమగతియు,
దేనినిం బొంది వెండియుఁ • దిటిగిరారొ;
నాపరమధామ మది యంచు • నమ్ము పార్థ! ౧౯

పురుషస్స పరః పార్థ! భక్త్యా లభ్యస్త్వనన్యయా,
యస్యాన్తస్థాని భూతాని యేన సర్వమిదం తతమ్. ౨౨

ఎవనిలో నున్న వీభూత•నివహ మెల్ల,
నెవనిచే వ్యాపితంబయ్యె • నీజగమ్ము,
అపరమపూరుషు నన్య • మైనయట్టి
భక్తిభావంబుచేతఁ జే•పట్ట వచ్చు. ౨౦

యత్ర కాలే త్వనావృత్తి మావృత్తిం చైవ యోగినః,
ప్రయాతా యాన్తి తం కాలం వక్ష్యామి భరతర్షభ. ౨౩

మించి యెక్కాలమందు గ॰తించినట్టి
యోగివరులు పునర్జన్మ ॰ మొందువారొ;
యెట్టిసమయమ్మునన్ గతి॰యింప జన్మ
మొందఁగాఁ బోరొ; తత్కాల॰మును వచింతు. ౨౧

అగ్నిర్జ్యోతిరహశ్శుక్లష్షణ్మాసా ఉత్తరాయణమ్,
తత్ర ప్రయాతా గచ్ఛన్తి బ్రహ్మ బ్రహ్మవిదో జనాః. ౨౪

జ్యోతియును నగ్ని షణ్మాస॰యుక్తమైన
యుత్తరాయణ మహము శు॰క్లోచిత మగు
పథమునఁ బ్రయాతు లగునట్టి ॰ బ్రహ్మవిదులు
పొందుచున్నారు బ్రహ్మ మా॰నందముగను. ౨౨

ధూమో రాత్రిస్తథా కృష్ణ ష్షణ్మాసా దక్షిణాయనమ్,
తత్ర చాన్ద్రమసం జ్యోతి ర్యోగీ ప్రాప్య నివర్తతే. ౨౫

ఏపథము రాత్రి ధూమమ్ము ॰ కృష్ణపక్ష
దక్షిణాయనయుక్తమై ॰ తనరు, నట్టి
పథమునం దేగి చంద్రసం॰బంధ మైన
జ్యోతినిం బొంది వచ్చును॰ యోగి మరల. ౨౩

శుక్లకృష్ణే గతీ హ్యేతే జగతశ్శాశ్వతే మతే,
ఏకయా యాత్యనావృత్తి మన్యయాఽఽవర్తతే పునః. ౨౬

జగతి కీవిధి శుక్లకృష్ణపరికాశ
కమ్ము లగునిత్యమార్గము ♦ ల్గలవు రెండు,
శుక్లమార్గం బనావృత్తిఁ ♦ జూపుచుండుఁ,
గృష్ణమార్గమ్ము జన్మమ్ము ♦ నిచ్చుచుండు. ౨౬

నై తే సృతీ పార్థ జానన్ యోగీ ముహ్యతి కశ్చన,
తస్మాత్సర్వేషు కాలేషు యోగయుక్తో భవార్జున! ౨౭

ఇట్టిమార్గద్వయమ్మును ♦ నెఱుఁగుయోగి
యొక్కఁడేనియు మోహంబు ♦ నొందఁబోఁడు,
కావునఁ, గిరీటి! నీ వెల్ల♦కాలములను
యోగయుక్తుండవై యుండు ♦ టొప్పునయ్య! ౨౭

వేదేషు యజ్ఞేషు తపస్సు చైవ
దానేషు యత్పుణ్యఫలం ప్రదిష్టమ్,
అత్యేతి తత్సర్వమిదం విదిత్వా
యోగీ పరం స్థాన ముపైతి చాద్యమ్. ౨౮

వేదములందు, యజ్ఞముల, ♦ వీధ్రితపంబులయందు, సర్వదా
నాదుల నెట్టిపుణ్యఫల ♦ మౌర! ప్రదిష్టమొ; దాని కెల్లనున్
మీఁదయి, యిద్దికాదనుచు♦మించి, యథార్థమెఱింగి, యోగి, దా
నాదియునుం బరంబు నగు♦నట్టిపదంబును బొందు ఫల్గునా! ౨౮



8

# త్రొమ్మిదవ యధ్యాయము

## రాజవిద్యారాజ గుహ్యయోగము

ఇదం తు తే గుహ్యతమం ప్రవక్ష్యామ్యనసూయవే,
జ్ఞానం విజ్ఞానసహితం యద్జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్. ౧

పార్థ! దేనిఁ దెలిసి యశుభమ్మునుండి
ముక్తి నందెదవో; యట్టి ముఖ్యగుహ్య
తమము, విజ్ఞానసహితమై తనరు జ్ఞాన
మేను వచియించెద ననూయ లేని నీకు. ౧

రాజవిద్యా రాజగుహ్యం పవిత్ర మిద ముత్తమమ్,
ప్రత్యక్షావగమం ధర్మ్యం సుసుఖం కర్తు మవ్యయమ్. ౨

రాజవిద్య, గుహ్యరాజమ్ము, ధర్మ్యమ్ము,
నాచరింప సులభ, మవ్యయమ్ము,
పరమపావనమ్ము, ప్రత్యక్షసుఖబోధ
కమ్ము, నిద్ది యుత్తమమ్ము, నమ్ము. ౨

అశ్రద్దధానాః పురుషా ధర్మస్యాస్య పరంతప,
అప్రాప్య మాం నివర్తంతే మృత్యుసంసారవర్త్మని. 3

ఓ నరేంద్ర! యీయాత్మవి • జ్ఞానధర్మ
మందు విశ్వాస ముంచని • యట్టిపురుషు
లొందఁజాలక నన్ను; మృ • త్యుస్వరూప
భయదసంసారపథమునఁ • బరగుచుంద్రు. 3

మయా తత మిదం సర్వం జగదవ్యక్తమూర్తినా,
మత్ స్థాని సర్వభూతాని న చాహం తేష్వవస్థితః. ౪

పూర్ణమై యుండె, నవ్యక్త • మూర్తి నగుచు
నలరు నాచేత నీ జగం, • బఖిలభూత
వితతి నాయందె యుండె నో • విజయ! కాని
వానియందున నేనున్న • వాఁడఁ గాను. ౪

నచ మత్ స్థాని భూతాని పశ్య మే యోగమైశ్వరమ్,
భూతభృన్న చ భూతస్థో మమాత్మా భూతభావనః. ౫

భూతకోటి నాయం దుండఁ • బోవ దెపుడు,
భూతభృద్భావనమ్ములఁ • బొదలఁజేయు
చుండు నాయాత్మ వానియం • దుండఁబోవ,
దైశ్వరంబైన నాయోగ • మద్భుతంబు. ౫

యథాఽఽకాశస్థితో నిత్యం వాయుస్సర్వత్రగో మహాన్,
తథా సర్వాణి భూతాని మత్ స్థానీ త్యుపధారయ. ౬

ఎటుల సర్వత్రగంబైన ♦ యీమహాని
లంబు గగనంబునందు ని♦త్యంబు నుండు,
నాప్రకారంబు నాయందు ♦ నఖిలభూత
ములు నెసంగు నటంచును ♦ దెలియు మీవు. ౬

సర్వభూతాని కౌన్తేయ ప్రకృతిం యాన్తి మామికామ్,
కల్పక్షయే పునస్తాని కల్పాదౌ విసృజా మ్యహమ్. ౭

అర్జునా! కల్పసంక్షయ♦మందు సర్వ
భూతములు నాదు ప్రకృతినిఁ ♦ బొందుచుండు,
వానిఁ గల్పాదియందున ♦ నేనె మఱల
సృష్టి యొనరించుచున్నాఁడ ♦ స్పష్ట మిద్ది. ౭

ప్రకృతిం స్వా మవష్టభ్య విసృజామి పునః పునః,
భూతగ్రామమిమం కృత్స్నమవశం ప్రకృతేర్వశాత్. ౮

ప్రాణికోటులు తమ స్వీయ♦ప్రకృతిఁ బట్టి
ప్రకృతి కాధీనమయ్యు, న♦వశము నంది
యుండుఁ, గావున సృజియించు♦చుందు వాని
మాటిమాటికి నేను సు♦మ్మా! కిరీటి! ౮

న చ మాం తాని కర్మాణి నిబధ్నన్తి ధనఞ్జయ!
ఉదాసీనవదాసీన మసక్తం తేషు కర్మసు. ౯

ఓధనంజయ! తత్కర్మ•యూధమందు
సక్తిలేని యుదాసీను•చందమునను,
దనరుచున్న న న్నికర్మ•తతి యొకింత
బంధన మొనర్ప•జాల దబద్ధ మేల? ౯

మయాధ్యక్షేణ ప్రకృతి స్సూయతే సచరాచరమ్,
హేతునాఽనేన కౌన్తేయ! జగద్విపరివర్తతే. ౧౦

అనఘ! యధ్యక్షకుఁడ నైన•యట్టి నాక
తమున సృష్టించు సచరాచ•రమును బ్రకృతి,
యిట్టిహేతువుచేతనే • యీజగంబు
సర్వముఁ బరివర్తనంబును • సల్పుచుండె. ౧౦

అవజానన్తి మాం మూఢా మానుషీం తను మాశ్రితమ్,
పరం భావ మజానన్తో మమ భూతమహేశ్వరమ్. ౧౧

ఇందిరానందన! భూతమ•హేశ్వరమ్ము,
పరమమౌ నాదుభావమ్ము • నరయలేని
యజ్ఞు లెల్ల రౌనర్తు ర•వజ్ఞ నన్ను,
మనుజదేహాశ్రితుండ నే • నని తలంచి. ౧౧

మోఘాశా మోఘకర్మాణో మోఘజ్ఞానా విచేతసః,
రాక్షసీ మాసురీం చైవ ప్రకృతిం మోహినీం శ్రితాః. ౧౨

మోఘకర్మలు, మోఘాశ ♦ మున్గువారు,
మోఘవిజ్ఞానయుక్తులౌ ♦ మూఢమతులు,
నాసురము రాక్షసము విమో ♦ హకమునైన
ప్రకృతిని సమాశ్రయించియుఁ ♦ బరగుచుందు్ర. ౧౨

మహాత్మానస్తు మాం పార్థ! దైవీం ప్రకృతి మాశ్రితాః,
భజన్త్యనన్యమనసో జ్ఞాత్వా భూతాది మవ్యయమ్. ౧౩

దేవసంబంధమైన స్వ ♦ భావ మాశ్రి
యమ్ముగాఁ గొని, మహనీయు ♦ లఖిలజీవ
కారణుఁడ, నవ్యయుండనై ♦ మీఱు నన్నుఁ,
దెలిసి భజియింతు రన్యచిం ♦ తలను వీడి. ౧౩

సతతం కీర్తయన్తో మాం యతన్తశ్చ దృఢవ్రతాః,
నమస్యన్తశ్చ మాం భక్త్యా నిత్యయుక్తా ఉపాసతే. ౧౪

దృఢతరవ్రతులౌ జితేం ♦ ద్రియులు కొంద,
అనయము సమాధిచింతనా ♦ యత్తు లగుచు,
నను స్తుతింపుచు, మ్రొక్కుచు, ♦ నన్నుపాస్తిఁ
జేయుచున్నారు సద్భక్తిఁ ♦ బాయ కెపుడు. ౧౪

జ్ఞానయజ్ఞేన చాప్యన్యే యజన్తో మా ముపాసతే,
ఏకత్వేన పృథక్త్వేన బహుధా విశ్వతోముఖమ్. ౧౫

ద్వైతభావమ్ముచేత, నద్వైతభావ
మునను గొందఱు, విశ్వతోముఖుఁడ నంచు
జ్ఞానయజ్ఞమ్ముచేత నర్చన లొనర్చి,
బహుగతుల నన్నుఁ జేతు రుపాసనంబు. ౧౫

అహం క్రతు రహం యజ్ఞ స్స్వధాఽహ మహమౌషధమ్,
మన్త్రోఽహమహ మేవాజ్యమహమగ్ని రహం హుతమ్. ౧౬

పితాఽహమస్య జగతో మాతా ధాతా పితామహః,
వేద్యం పవిత్ర మోఙ్కార ఋ క్సామ యజు రేవ చ. ౧౭

గతిర్భర్తా ప్రభు స్సాక్షీ నివాస శ్శరణం సుహృత్,
ప్రభవః ప్రళయస్థానం నిధానం బీజ మవ్యయమ్. ౧౮

నేన సర్వక్రతునివహంబు, స్మార్త క
ర్మము నేన, పైతృకాన్నమును నేన,
నేన కృశానుండ, నేన యౌషధము, మం
త్రమ్ము నాజ్యమ్ము హుతమ్ము నేన,
నేన తల్లియుఁ దండ్రి నిఖిలలోకములకు,
నేఁ బితామహుఁడను, నేన ధాత,

నేన యోంకారమ్ము, నేన వేద్యమ్మును,
వేదమ్ము నేన, పవిత్ర మేన,
ప్రభవమును స్థితి గతియును బ్రళయ మేన,
ప్రభుఁడ భర్తను నేన, నివాస మేన,
ద్రష్టయును మిత్రుఁ డేన, నిధాన మేన,
శరణ మవ్యయమైన బీజమ్ము నేన. ౧౮

తపామ్యహమహం వర్షం నిగృహ్ణామ్యుత్సృజామి చ,
అమృతం చైవ మృత్యుశ్చ సదసచ్చాహ మర్జున. ౧౯

వర్షమును గురియించెడి వాఁడ నేన,
తన్నిరోధకుఁడను నేన, తపనుఁ డేన,
నేన యమృతంబు, మృత్యువు నేన యగుదు,
సత్తును నసత్తు నేన, నిశ్చయము పార్థ! ౧౯

త్రైవిద్యా మాం సోమపాః పూతపాపా
యజ్ఞై రిష్ట్వా స్వర్గతిం ప్రార్థయన్తే
తే పుణ్య మాసాద్య సురేన్ద్రలోక
మశ్నన్తి దివ్యాన్ దివి దేవభోగాన్. ౨౦

ఏరు, శ్రుతిత్రయార్థముల నెల్ల నెఱింగియుఁ బూతపాపులై,
కూరిమి నన్ను యజ్ఞములఁ గొల్చుచు, సోమరసంబుఁ గ్రోలి, వి
స్ఫారతరామరాలయనివాస మొనర్పఁగఁ గాంక్షఁ జేతురో;
వారలు పొంది పూజ్యమగు స్వర్గము, కాంతురు దివ్యభోగముల్.

తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం
క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి,
ఏవం త్రయీధర్మ మనుప్రపన్నా
గతాగతం కామకామా లభన్తే. ౨౧

వా రనుభవించి విపులమౌ స్వర్గసుఖము,
పుణ్యము గతింప, మఱల నీభువికి వచ్చు
చున్నవా, రిట్లె వేదప్రపన్నవిషయ
కాంక్షులు గతాగతంబులఁ గాంచుచుందురు. ౧౯

అనన్యాశ్చిన్తయన్తో మాం యే జనాః పర్యుపాసతే,
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్. ౨౨

ఏజనమ్ములు నన్ను స్మరించి గొల్తు
రన్య మెఱుఁగక, నట్టి నిత్యాభియుక్తు
లైన జనులయోగక్షేమ మనవరతము
నేనె వహియించుచున్నాఁడ నిశ్చయముగ. ౨౦

యేఽప్యన్యదేవతాభక్తా యజన్తే శ్రద్ధయాన్వితాః,
తేఽపి మామేవ కౌన్తేయ! యజన్త్యవిధిపూర్వకమ్. ౨౩

పార్థ! యెవ రన్యదేవతాభక్తు లగుచుఁ
జేయుచున్నారొ పూజ లాస్తిక్యబుద్ధి,
వా రవిధిపూర్వకంబైన భావమునను
నన్నె సేవించుచున్నా రనారతంబు. ౨౧

అహం హి సర్వయజ్ఞానాం భోక్తా చ ప్రభురేవ చ,
న తు మా మభిజాన న్తి త త్త్వేనాతశ్చ్యవన్తి తే. ౨౪

నేనె ప్రభుఁడను, భో క్తను, ॥ నిఖిలయజ్ఞ
తతికి, నెవ్వారు నన్ను య॥థార్థముగను
దెలియఁజాలరొ; వారు త॥త్ఫలమునుండి
పతన మొందుచు నున్నారు ॥ పాండుతనయ! ౨౨

యా న్తి దేవవ్రతా దేవాన్ పితౄన్ యా న్తి పితృవ్రతాః,
భూతాని యా న్తి భూ తేజ్యా యా న్తి మద్యాజినోఽపి మామ్.

దేవ తావ్రతు లగువారు ॥ దేవతలను,
భూత సేవానుర క్తులు ॥ భూతములను,
పితృగణార్చనాస క్తులు ॥ పితృగణమును,
నన్ను నాభ క్తు లందుదు ॥ రన్న! పార్థ! ౨౩

పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి,
తదహం భ క్త్యుపహృత మశ్నామి ప్రయ తాత్మనః. ౨౬

పత్రిమో, పుష్పమో, మఱి ॥ ఫల మొ, జల మొ,
భ క్తి నెవ్వాఁడు నాకు స॥ర్పణముఁ జేయు,
వాని నిశ్చలభ క్తిపూ॥ర్వకము నైన
యాఫలాదిక మెల్ల నే ॥ నారగింతు. ౨౪

యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్,
యత్తపస్యసి కౌన్తేయ! తత్కురుష్వ మదర్పణమ్. ౨౭

ఎద్ది సల్పుచునుంటివో, • యెద్ది వేల్చు
చుంటివో, యెద్ది భుజియించు • చుంటివో కొ,
యెద్ది యిచ్చుచునుంటివో, • యెట్టితప ము
నర్పుచుంటివొ, యర్పింపు • నాకు దాని. ౨౭

శుభాశుభఫలై రేవం మోక్ష్యసే కర్మబన్ధనైః,
సన్న్యాసయోగయుక్తాత్మా విముక్తో మాముపైష్యసి. ౨౮

అటుల, సన్న్యాసయోగయు • క్తాత్ముఁడ వయి,
బహుశుభాశుభఫలకర్మ • బంధనముల
మోక్ష మొందఁగఁగలవు; వి • ముక్తుఁడవయి
చెందెదవు నన్ను, సందియ • మిందు లేదు. ౨౮

సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి న ప్రియః,
యే భజన్తి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహమ్.

సర్వభూతమ్ములందున • సముఁడ నేను,
లేదు నా కప్రియుండును, • లేదు ప్రియుఁడు,
ఎవరు సద్భక్తి నను భజి • యింతురో కొ
వార లెల్లరు నాయందె • పరగుచుందు,
నేను వారలయందె యు • న్నాను విజయ! ౨౯

అపి చేత్సుదురాచారో భజతే మామనన్యభాక్,
సాధురేవ స మన్తవ్య స్సమ్యగ్వ్యవసితో హి సః. ౩౦

అతిదురాచారుఁ డయిన, నా•నన్యదేవ
తార్చకుండయి మత్సేవ • నలరెనేని,
నతఁడె సాధువర్తనుఁడు, మో•క్షార్థి యతఁడె,
ధన్యతముఁ డని తెలియఁగాఁ • దగినవాఁడు. ౨౮

క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వచ్ఛాన్తిం నిగచ్ఛతి,
కౌన్తేయ! ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి. ౩౧

అట్టిపురుషుండు వేగ ధ•ర్మాత్ముఁ డగుచు
స్థిరతరం బగుశాంతినిఁ • జెందుచుండు,
నాదుభక్తుఁ డేనాఁటికి • నాశ మొందఁ,
డంచును దృఢప్రతిజ్ఞ నీ • వాచరించు. ౨౯

మాం హి పార్థ! వ్యపాశ్రిత్య యేఽపి స్యుః పాపయోనయః,
స్త్రియో వైశ్యాస్తథాశూద్రాస్తేఽపి యాన్తి పరాం గతిమ్.

ఫల్గునా! కడుపాపసం•భవులు నైన,
నాఁడువారైన, వైశ్యశూ•ద్రాదులైన,
మించి సద్భక్తి నన్నాశ్ర•యించిరేని,
పరమధామమ్ము వారలుఁ • బడయఁగలరు. ౩౦

కిం పునర్బ్రాహ్మణాః పుణ్యా భక్తా రాజర్షయ స్తథా,
అనిత్యమసుఖం లోక మిమం ప్రాప్య భజస్వ మామ్. 33

ఇంకఁ, బుణ్యులు భక్తులై • యెసఁగు బ్రాహ్మ
ణులను, రాజర్షులను గూర్చి • పలుకనేల?
యీజగ మనిత్యము సుఖం బొ•కింత లేదు,
పొంది నను, భజియింపు మా•నందముగను. 3౧

మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు,
మామేవైష్యసి యుక్త్వైవ మాత్మానం మత్పరాయణః. 3౮

అర్చన మొనర్పు, భక్తుండ • వగుమ నాకు;
మనసు నిల్పియు నాకు న•మస్కరింపు;
మనవరత మిట్లు యాత్మ నా•యందె కూర్ప.
నందెదవు నన్నుఁ, బ్రీతుండ • వగుచు నాకు. 3౨

# పదియవ యధ్యాయము

## విభూతి యోగము

భూయ ఏవ మహాబాహో! శృణు మే పరమం వచః,
యత్తేఽహం ప్రీయమాణాయ వక్ష్యామి హితకామ్యయా.

ప్రముదితుండ వైన యోమహా•బాహు! నీకు
హితముఁ గూర్పఁగ నెంతయో • యిచ్ఛగించి
యింక నేఁ దెల్పు పరమోక్తి • యెద్ది గలదొ?
ఆలకింపుమ! స్థిరబుద్ధి • నట్టిదాని. ౧

న మే విదుస్సురగణాః ప్రభవం న మహర్షయః,
అహమాదిర్హి దేవానాం మహర్షీణాం చ సర్వశః. ౨

సురలె వైన, మహాఋషి•స్తోమ మైన,
నెఱుఁగలేరు మత్ప్రభవ మొ•కించు కైన,
నన్నివిధముల దేవమ•హర్షులకును
నాద్యుఁడను నేనె యాదు పృ•థాత్మజాత! ౨

యో మామజమనాదిం చ వేత్తి లోకమహేశ్వరమ్,
అసమ్మూఢస్స మర్త్యేషు సర్వపాపైః ప్రముచ్యతే. ౩

ఆదిలేనట్టివాఁడ, నే•నజుఁడ నంచు,
నెల్లలోకేశ్వరుఁడ నంచు, • నెవ్వఁ డెఱుఁగు;
మోహవర్జితుఁ డైన య•మ్మానవుండె
విడువఁగాఁబడు కిల్బిష•వితతినుండి. ౩

బుద్ధిర్జ్ఞానమసమ్మోహః క్షమా సత్యం దమశ్శమః,
సుఖం దుఃఖం భవో౽భావో భయం చా౽భయమేవ చ. ౪
అహింసా సమతా తుష్టిస్తపో దానం యశో౽యశః,
భవన్తి భావా భూతానాం మత్త ఏవ పృథగ్విధాః. ౫

క్షమయును, బుద్ధి, జ్ఞానమును, సత్య, మమోహము, సౌఖ్య
దుఃఖముల్,
శమము,దమమ్ము,దానముయశం,బయశమ్మనుభీత్యభీతులున్,
సమత,యహింసయున్,దపము,సంతసముంబ్రభవంబభావమున్,
విమలగుణాఢ్య! నావలనే యివి గల్గును భూతకోటికిన్. ౪

మహర్షయస్సప్త పూర్వే చత్వారో మనవస్తథా,
మద్భావా మానసా జాతా యేషాం లోకా ఇమాః ప్రజాః.

ఎవరి కీలోకమునఁ బుట్టి రెల్లప్రజలు
నట్టిభృగ్వాదిసప్తమహర్షు లెల్ల
మనుచతుష్కము మద్భావమహితు లగుచుఁ
బార్థ! నామానసమున సంభవముఁ గనిరి. ౬

ఏతాం విభూతిం యోగం చ మమ యో వేత్తి తత్త్వతః,
సో౽వికమ్పేన యోగేన యుజ్యతే నాత్ర సంశయః. ౭

కవ్వడీ! మద్విభూతియోగముల రెంటి
నెవ్వఁడు యథార్థముగ గ్రహియించువాఁడొ;
వాఁ డచలయోగమునఁ గూర్పఁబడెడువాఁడు.
సందియము సుంతయేనియు నిందు లేదు. ౭

అహం సర్వస్య ప్రభవో మ త్తస్సర్వం ప్రవర్తతే,
ఇతి మత్వా భజన్తే మాం బుధా భావసమన్వితాః. ౮

నేనె యుత్పత్తికారణ • మైనవాఁడ,
నావలన విశ్వవిశ్వమ్ము • నడచుచుండె,
నరసి యియ్యది భావస•మావృతు లయి,
నన్ను బుధు లెల్ల భజియించు • చున్నవారు. ౭

మచ్చిత్తా మద్గతప్రాణా బోధయన్తః పరస్పరమ్,
కథయన్తశ్చ మాం నిత్యం తుష్యన్తి చ రమన్తి చ. ౯

మద్గతప్రాణు లగుచు, మ•న్మానసు లయి,
మొనసి గ్రహియించు చన్యోన్య•మాగను నన్ను
నిత్యసంకీర్తనాసక్తి•నిరతు లగుచు,
నొందుచు ముదంబుఁ, గ్రీడించు•చున్నవారు. ౮

తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్,
దదామి బుద్ధియోగం తం యేన మా ముపయాన్తి, తే. ౧౦

సతతయుక్తులై, విశ్వాస•సరణి నాదు
భజనఁ జేయుచు, నేయోగ•భాగ్యగరిమఁ
బొందుచున్నారొ యన్నట్టి•బుద్ధియోగ
మేనె వారలకుం బ్రీతి • నిచ్చుచుంటి. ౯

తేషా మేవానుకమ్పార్థ మహ మజ్ఞానజం తమః,
నాశయా మ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా. ౧౧

వారిఁ గరుణింపఁగా నెంచి • పాండుపుత్ర!
ఆత్మభావసంస్థితుఁడనై • యలరు నేను,
జ్ఞానదీపంబుచేత నజ్ఞానజనిత
మైన తమ మెల్లఁ బూర్తిగా • నడఁచివైతు. ౧౦

పరం బ్రహ్మ పరం ధామ పవిత్రం పరమం భవాన్,
పురుషం శాశ్వతం దివ్య మాదిదేవ మజం విభుమ్. ౧౨

ధన్యుఁడవు, దివ్యుఁడవు, పరంధాముఁడ వని,
యాదిదేవుండ వంచును, • నజుఁడ వంచుఁ,
బ్రభుఁడవు, పవిత్రుఁడవు, పరబ్రహ్మ మనియు,
నిత్యుఁడవు, పురుషుఁడ వటంచు • నీవు కృష్ణ! ౧౧

ఆహు స్త్వా మృషయ స్సర్వే దేవర్షి ర్నారద స్తథా,
అసితో దేవలో వ్యాస స్స్వయం చైవ బ్రవీషి మే. ౧౩

దేవఋషి నారదుండును, • దేవలుండు,
నసితుఁడును, దివ్యఋషులును, • వ్యాసమౌని,
నిన్ను బూర్వోక్తవిధముగా • నెన్నుచుండ్రు,
రనఘ! స్వయముగ ననుచుంటి • వట్లె నీవు. ౧౨

సర్వ మేత దృతం మన్యే యన్మాం వదసి కేశవ,
న హి తే భగవన్ వ్యక్తిం విదు ర్దేవా న దానవాః. ౧౪

వాసుదేవ! నన్ గూర్చి యే • వాక్య మీవు
పలుకుచుంటివో, యద్ది ధ్రువం బటంచుఁ
దలఁచుచున్నాఁడ; నీమహ • త్త్వంబు దేవ!
దేవదానవులేనియుఁ • దెలియలేరు. ౧౩

స్వయమేవాత్మనాఽఽత్మానం వేత్థ త్వం పురుషోత్తమ,
భూతభావన భూతేశ దేవదేవ జగత్పతే. ౧౫

భూతభావన! భూతేశ! • భువనపాల!
దివ్యవంద్య! పురుషోత్తమ! • దేవదేవ!
ఆశ్రితావన! కృష్ణ! మ • హానుభావ!
నిన్ను నీవె యెఱుంగఁగా • నేర్తు వనఘ! ౧౪

వక్తుమర్హస్యశేషేణ దివ్యా హ్యాత్మవిభూతయః,
యాభి ర్విభూతిభి ర్లోకా నిమాం స్త్వం వ్యాప్య తిష్ఠసి. ౧౬

నీమహావిభవంబులు • నిస్తులమ్ము,
లేవిభూతులచేత నీ • వీజగముల
నావరించి యధిష్ఠించి; • తా మహత్త్వ
మెల్లఁ బేర్కొన నర్హుండ • వీవె యగుదు. ౧౫

కథం విద్యా మహం యోగిం స్త్వాం సదా పరిచిన్తయన్,
కేషు కేషు చ భావేషు చింత్యోఽసి భగవన్మయా. ౧౭

కృష్ణ! యోగీంద్ర! నిరతం బెట్లు? నిన్ను
ధ్యాన మొనరించు చేఁ దెలియంగలాఁడ;
ననఘ! యెటువంటిభావంబు లందు నీవు
ధ్యాన మొనరింప నాచేతఁ దగుదు వయ్య? ౧౮

విస్తరేణాత్మనో యోగం విభూతిం చ జనార్దన,
భూయః కథయ తృప్తి ర్హి శృణ్వతో నాస్తి మేఽమృతమ్.

ఓ జనార్దన! భవదీయయోగమహిమ,
తతవిభూతియు, నెల్ల విస్తారముగను
మఱలఁ దెల్పుమ! నీవాక్యమధురరసము
నెంత గ్రోలినఁ దృప్తి యొవంత లేదు. ౧౯

హంత తే కథయిష్యామి దివ్యా హ్యాత్మవిభూతయః,
ప్రాధాన్యతః కురుశ్రేష్ఠ! నాస్త్యంతో విస్తరస్య మే. ౧౯

అనఘ! కురువంశదీప! దివ్యంబులైన
యస్మదీయలసన్మహత్త్వాతిశయము,
లంతముల్ లేని వైన, నే నా మహత్త్వ
మును వచించెద విను నీకు ముఖ్యముగను. ౨౦

అహ మాత్మా గుడాకేశ! సర్వభూతాశయస్థితః,
అహమాదిశ్చ మధ్యం చ భూతానా మంత ఏవ చ. ౨౦

ఆదిత్యానామహం విష్ణు ర్జ్యోతిషాం రవి రంశుమాన్,
మరీచి ర్మరుతా మస్మి నక్షత్రాణా మహం శశీ. ౨౧

వేదానాం సామవేదోఽస్మి దేవానా మస్మి వాసవః,
ఇన్ద్రియాణాం మనశ్చాస్మి భూతానా మస్మి చేతనా. ౨౨

రుద్రాణాం శంకర శ్చాస్మి విత్తేశో యక్షరక్షసామ్,
వసూనాం పావక శ్చాస్మి మేరు శ్శిఖరిణా మహమ్. ౨౩

అఖిలభూతహృదంత•రాత్మను నేనె. భూ
తముల కాద్యంతమ•ధ్యంబు లేనె,
యాదిత్యులందు వి•ష్ణ్వాదిత్యుఁడను నేనె,
చందు్రుఁడనేన న•క్షత్రములను,
తేజస్సులందు నం•భోజమిత్రుఁడ నేనె,
నేనె మరీచి న•నిలములందు,
నింద్రియంబుల మాన•సేంద్రియం బేనె, వే
దమ్ముల సామవే•దమ్ము నేనె,
జీవులను దెల్వి, సురలందు • జిష్ణుఁ డేనె,
యష్టవసువులయం దగ్ని, • నదు్రిలందు
మేరు వేనె, గుహ్యకులఁ గు•బేరుఁ డేనె,
శంకరుఁడ నేనె రుదు్రిల, • సవ్యసాచి! ౧౯

పురోధసాం చ ముఖ్యం మాం విద్ధి పార్థ బృహస్పతిమ్,
సేనానీనా మహం స్కంద స్సరసా మస్మి సాగరః. ౨౪

అర్జునా! నేఁ బురోహితు లందు శ్రేష్ఠుఁ
డా గురుండను, సేనాను లందుఁ గాంచ
హారణుఁడను నేనె, సరసు లయందు నుదధి
నేనె, యంచు నెఱుంగుమా! నీదుమదిని. ౨౦

మహర్షీణాం భృగు రహం గిరా మస్మ్యేక మక్షరమ్,
యజ్ఞానాం జపయజ్ఞో౽స్మి స్థావరాణాం హిమాలయః. ౨౫

అశ్వత్థ స్సర్వవృక్షాణాం దేవర్షీణాం చ నారదః,
గంధర్వాణాం చిత్రరథ స్సిద్ధానాం కపిలో మునిః. ౨౬

ఉచ్చైశ్శ్రవస మశ్వానాం విద్ధి మా మమృతోద్భవమ్,
ఐరావతం గజేంద్రాణాం నరాణాం చ నరాధిపమ్. ౨౭

ఋషులందు భృగుమహాఋషి నేనె, వాక్కుల
యందు నేనే ప్రణవాక్షరంబు,
నచలంబులందు హిమావనీధర మేనె,
యజ్ఞమ్ములను జపయజ్ఞ మేనె,
సర్వవృక్షముల నశ్వత్థవృక్షం బేనె,
కపిలుండ నే సిద్ధగణములందు,

నిర్జరఋషులందు • నేనె నారదుఁడఁ, జి
త్రరథుండ నేనె గంధర్వులందు,
నశ్వనికరమందు • నమృతోద్భవోచ్చైశ్శ్ర
వంబుఁ, గరుల సురగజంబు నేనె,
మానవాళియందు • మానవాధీశుండ
నేనె, యం చెఱుంగు • నిశ్చయముగ. ౨౭

ఆయుధానా మహం వజ్రం ధేనూనా మస్మి కామధుక్
ప్రజన శ్చాస్మి కందర్ప స్సర్పాణా మస్మి వాసుకిః. ౨౮
అనంతశ్చాస్మి నాగానాం వరుణో యాదసా మహమ్,
పితౄణా మర్యమా చాస్మి యమ స్సంయమతా మహమ్. ౨౯
ప్రహ్లాదశ్చాస్మి దైత్యానాం కాలః కలయతా మహమ్,
మృగాణాం చ మృగేంద్రోఽహం వైనతేయశ్చ పక్షిణామ్.

ఆయుధనిచయంబునందు వజ్రం బేన,
ధేనువులను గామధేను వేన,
వాసుకి నేఁ సర్పములఁ, బ్రజోద్భవ
కారణుం డగు శంబరారి నేన,
నేన యనంతుఁడ • నిఖిలనాగముల, యా
దస్సులలోఁ బాశధారి నేన,
సంయములందున • శమనుండ నేన, య
ర్యముఁడను బితరులయందు నేన,

సర్వమృగములయందుఁ గేసరిని నేన,
నేన ప్రహ్లాదుఁడను దైత్యనివహమందుఁ,
బక్షిసముదాయమందు సుపర్ణుఁ డేన,
గణికులను గాల మేన నిక్కము కిరీటి! ౨౨

పవనః పవతా మస్మి రామ శ్శస్త్రభృతా మహన్,
ఝషాణాం మకరశ్చాస్మి స్రోతసా మస్మి జాహ్నవీ. 3౧

పావన మొనర్చువారిలోఁ బవనుఁ డేను,
శస్త్రధరులందు శ్రీరామచంద్రుఁ డేను,
భవ్యభాగీరథిని నేఁ బ్రవాహములను,
ప్రకటజలజంతువుల మకరంబు నేను. ౨3

సర్గాణా మాదిరంతశ్చ మధ్యం చైవాహ మర్జున,
అధ్యాత్మవిద్యా విద్యానాం వాదః ప్రవదతా మహమ్. 3౨
అక్షరాణా మకారోఽస్మి ద్వంద్వ స్సామాసికస్య చ,
అహమే వాక్షయః కాలో ధాతాఽహం విశ్వతోముఖః. 33
మృత్యుస్సర్వహరశ్చాహ ముద్భవశ్చ భవిష్యతామ్,
కీర్తిః శ్రీర్వాక్చ నారీణాం స్మృతి ర్మేధా ధృతిః క్షమా.

సర్గంబులకు నాదిసంహారమధ్యముల్,
ప్రథితవిద్యలయందు బ్రహ్మవిద్య,
వాదించువారిలో వాదంబు, ద్వంద్వస
మాసంబు నెల్లసమాసములను,

విశ్వతోముఖుఁడయి • వెల్గొందుధాత, య
క్షరములయందు న•కారవర్ణ,
మక్షయకాలంబు, • నఖిలసంహారమృ
త్యువు, భావికాలభూ•తోద్భవంబు,
సతులయందున లక్ష్మియు, • శారదాంబ,
స్మృతియు, విమలయశంబును, • ధృతియు నేన,
యరయ బుద్ధియు, నోరిమి • యన్ని నేన
యగుచునున్నాను నిక్కువ•మా కిరీటి! ౩౪

బృహత్సామ తథా సామ్నాం గాయత్రీ ఛందసా మహమ్,
మాసానాం మార్గశీర్షోఽహ మృతూనాం కుసుమాకరః.
ద్యూతం ఛలయతా మస్మి తేజ స్తేజస్వినా మహమ్,
జయోఽస్మి వ్యవసాయోఽస్మి స త్త్వం స త్త్వవతా మహమ్.
వృష్ణీనాం వాసుదేవోఽస్మి పాండవానాం ధనంజయః,
మునీనా మప్యహం వ్యాసః కవీనా ముశనా కవిః. 32

సామంబులను బృహ•త్సామవేదము, ఋతు
సంతానమందు వ•సంతఋతువు,
మాసంబులందున • మార్గశీర్షంబును,
ధన్యగాయత్రి ఛం•దంబులందు,
సత్వాఢ్యులందున • సత్వంబు, వంచక
సాధనంబుల ద్యూత•సాధనంబు,

నుద్యోగవంతుల • యుద్యోగగరిమ, తే
జస్వుల తేజంబు, • జయుల జయము,
నర్జునుఁడు పాండవులయందు, • యాదవులను
వాసుదేవుండు, మునులందు • వ్యాసమౌని,
కవులయందున మేటిభా•ర్గవుఁడ నేనె,
యగుచునున్నాను నిక్కువ•మౌ కిరీటి! ౩౭

దండో దమయతా మస్మి నీతి రస్మి జిగీషతామ్,
మౌనం చైవాస్మి గుహ్యానాం జ్ఞానం జ్ఞానవతా మహమ్.

దండన మొనర్పువారల • దండనీతి,
ప్రథితవిజయేచ్ఛగలవారి • రాజనీతి,
మౌనము గోప్యములయందు, • జ్ఞానయుతుల
జ్ఞానమును నేనె యౌదు; ని•జమ్ము విజయ! ౩౮

యచ్చాపి సర్వభూతానాం బీజం తదహ మర్జున,
న తద స్తి వినా యత్స్యా న్మయా భూతం చరాచరమ్.

ఏది సర్వభూతములకు • నాదికార
ణంబొ; యయ్యది నేనె యౌ, • నన్ను విడచి
యీ చరాచరభూతాళి • నెద్ది లేదు.
భరతవంశపవిత్ర! యో•పాండుపుత్ర! ౩౯

నాంతోఽస్తి మమ దివ్యానాం విభూతీనాం పరంతప,
ఏష తూద్దేశతః ప్రోక్తో విభూతే ర్విస్తరో మయా. ౪౦

ధన్యమా మద్విభూతివిస్తారములకు
నర్జునా! పార మొక్కింతయైన లేదు,
బాపురె! వచించినాఁడ సంక్షేపముగను
నీ మహత్త్వవిశేషంబు • లేను నీకు. ౨౮

యద్యద్విభూతిమత్సత్త్వం శ్రీమదూర్జిత మేవ వా,
తత్తదేవావగచ్ఛ త్వం మమ తేజోఽంశసంభవమ్. ౪౧

క్షితిని నైశ్వర్యయుతము, నూర్జితసహితము,
ననఘచరిత! శ్రీమంతమ్ము • నై తనర్చు
నార! యేసత్వనికరంబు, లవియు నెల్ల
నాదు తేజోంశభవములు • నాఁగఁ దలఁపు! ౨౯

అథవా బహునైతేన కిం జ్ఞాతేన తవార్జున,
విష్టభ్యాహమిదం కృత్స్న మేకాంశేన స్థితో జగత్. ౪౨

ఇంతగా నీకుఁ జెప్పఁగా • నేల మఱియు
నీ వెఱింగినదానిచే • నేమి గల్గు?
నేకపాదమ్ముచేత నే • నీసమస్త
జగతి వ్యాపించియుంటి నిస్సంశయంబు. ౩౦

# పదునొకండవ యధ్యాయము

## విశ్వరూపసందర్శనయోగము

మదనుగ్రహాయ పరమం గుహ్య మధ్యాత్మసంజ్ఞితమ్,
యత్త్వయోక్తం వచస్తేన మోహోఽయం విగతో మమ. ౧

కమలనేత్ర! నాయం దను • గ్రహముతోడ
నీవు బోధించినట్టి యు • త్కృష్టగుహ్య
మైన, నధ్యాత్మసంజ్ఞచే • నలరువాక్య
వితతి, నాదైనమోహంబు • విగత మయ్యె. ౧

భవాప్యయౌ హి భూతానాం శ్రుతౌ విస్తరశో మయా,
త్వత్తః కమలపత్రాక్ష మాహాత్మ్య మపి చావ్యయమ్. ౨

ప్రాణికోటుల సంభవ • ప్రళయములను,
నవ్యయం బగు నీదుమా • హాత్మ్యములను,
తెలియఁజేసితి జలజాక్ష! • తేటగాను,
విన్నవాఁడను వీనుల • విందుగాను. ౨

ఏవమేతద్యథాఽఽత్థ త్వ మాత్మానం పరమేశ్వర,
ద్రష్టు మిచ్ఛామి తే రూప మైశ్వరం పురుషోత్తమ. ౩

నీవు పల్కిన దంతయు • నిక్కవంబు,
పల్కినట్టు లదెంతయుఁ • బరగు చుండు
నద్భుతైశ్వర్య మైన నీ • యలఘుమూర్తి
కనులపండువుగాఁ జూచు • కాంక్ష గలిగె. ౩

మన్యసే యది తచ్ఛక్యం మయా ద్రష్టుమితి ప్రభో,
యోగేశ్వర! తతో మే త్వం దర్శయాత్మాన మవ్యయమ్.

అద్ది దర్శింప నాకు సా◆ధ్యం బటంచు,
నూహఁ జేసెదవేని యో ◆ యోగిచంద్ర!
అవ్యయంబైన త్వన్మూర్తి ◆ నమితదయను
నాకు దర్శింపఁ జేయు మ◆నాథనాథ! ౪

పశ్య మే పార్థ! రూపాణి శతశోఽథ సహస్రశః,
నానావిధాని దివ్యాని నానావర్ణాకృతీని చ. ౫

భిన్న మారూపములును, వి◆భిన్న వర్ణ
ములును, దివ్యతమంబులై ◆ వెలయునట్టి
శతసహస్రనానావిధా◆కృతులతోడఁ
దనరు, న న్గాంచుమయ్య! పృ◆థాకుమార! ౫

పశ్యాఽఽదిత్యాౝ వసూౝ రుద్రా నశ్వినౌ మరుత స్తథా,
బహూన్యదృష్టపూర్వాణి పశ్యాఽఽశ్చర్యాణి భారత. ౬

పార్థ! వసువుల, రుద్రుల, ◆ వాయువులను,
నశ్వినులను, నాదిత్యుల, ◆ నరయఁ బూర్వ
మెపుడుఁ గాంచని చిత్రంబు ◆ లీవుఁ జూడఁ
గలవు నాయందుఁ బలురక◆మ్ములు నిజమ్ము. ౬

ఇహైకస్థం జగత్కృత్స్నం పశ్యాద్య సచరాచరం,
మమ దేహే గుడాకేశ! యచ్చాన్యద్ద్రష్టు మిచ్ఛసి. ౭

అర్జునా ! యిట్టి నాదు దేహాంబునందు
నార ! యేకస్థమై యలరారుచున్న,
సకలసచరాచరప్రపంచంబు, నింక
నెద్ది కాంక్షింతువో! దాని నెల్లఁ గనుము! ౭

న తు మాం శక్యసే ద్రష్టు మనేనైవ స్వచక్షుసా,
దివ్యం దదామి తే చక్షుః పశ్య మే యోగ మైశ్వరమ్. ౮

చూడలే వీ స్వకీయ చక్షువులతోడ
నీవు నను గాన నేను నీ కిచ్చువాఁడ
దివ్యదృష్టి, విలోకింపు భవ్య మైశ్వ
రం బయిన నాదు యోగభాగ్యంబు నిపుడు. ౮

ఏవ ముక్త్వా తతో రాజన్! మహాయోగేశ్వరో హరిః,
దర్శయామాస పార్థాయ పరమం రూప మైశ్వరమ్. ౯

అంబికేయ! యిట్టులాడి యోగేశ్వరుఁ
డైన వాసుదేవుఁ డర్జునునకుఁ
బరమమైనయట్టి పరమేశ్వరాకార
దర్శనంబు నంత దయ నొసంగె. ౯

అనేకవక్త్రనయన మనేకాద్భుతదర్శనమ్,
అనేకదివ్యాభరణం దివ్యానేకోద్యతాయుధమ్. ౧౦

అది యనేకవిధంబు లౌ • యాననముల,
నక్షుల, ననేక దివ్యోద్య•తాయుధములఁ,
దగ ననేకవిచిత్రసం•దర్శనములఁ,
బహువిధాభరణముల సం•భరితమయ్యె.

దివ్యమాల్యామ్బరధరం దివ్యగన్ధానులేపనమ్,
సర్వాశ్చర్యమయం దేవ మనన్తం విశ్వతోముఖమ్. ౧౧

దివ్యమాల్యాంబరధరంబు, • దివ్యపరిమ
ళానులేపనసంయుక్త, • మవ్యయంబు,
విశ్వతోముఖ, మాశ్చర్య•విశ్రుత, మ్మ
నంతమా దేవునాకృతి • నతఁడు గాంచె. ౧౧

దివి సూర్యసహస్రస్య భవే ద్యుగపదుత్థితా,
యది భా స్సదృశీ సా స్యా ద్భాసస్తస్య మహాత్మనః. ౧౨

ఆకసంబున భానుస•హస్ర మేక
కాలమందున నుదయంబుఁ • గాంచెనేని,
నట్టికాంతిపుంజం బావ•హిల్లు నొక్కొ
యద్దిమే యుద్దియా నా మ•హాత్ముప్రభకు. ౧౨

తత్రైకస్థం జగత్కృత్స్నం ప్రవిభక్త మనేకధా,
అపశ్య ద్దేవదేవస్య శరీరే పాండవ స్తదా. ౧౩

ఫల్గునుం డవలోకించె • బహువిధముల
నేర్పరుపఁబడ్డ సర్వమౌ • నీ జగంబు,
దేవదేవుని యా దివ్య• దేహమందు,
నార ! యేకస్థమైయున్న •యట్టిదిగను. ౧౩

తత స్స విస్మయావిష్టో హృష్టరోమా ధనఞ్జయః,
ప్రణమ్య శిరసా దేవం కృతాఞ్జలి రభాషత. ౧౪

అప్పు డర్జునుఁ డతివిస్మ•యంబు దోపఁ,
బులక లుదయింపఁ దనువునఁ, • దలను వంచి,
హస్తముల మోడ్చి, భక్తియు•తాంతరాత్మ,
నాపరాత్పరునకు మ్రొక్కి • యనియె నిట్లు. ౧౪

పశ్యామి దేవాం స్తవ దేవ! దేహే
సర్వాం స్తథా భూతవిశేషసఙ్ఘాన్,
బ్రహ్మాణ మీశం కమలాసనస్థ
మృషీంశ్చ సర్వా నురగాంశ్చ దివ్యాన్. ౧౫

దేవ! నీ దేహమందున • దేవతలను,
నఖిలభూతమ్ములను, గమ•లాసనస్థుఁ
డీశుఁడైనట్టి బ్రహ్మను, • నెల్లఋషులఁ,
గాంచుచున్నాఁడ దివ్యోర•గముల నేను. ౧౫

అనేక బాహూదరవక్త్రనేత్రం పశ్యామి త్వాం సర్వతోఽనన్తరూపం,
నాన్తం నమధ్యం నపున స్తవాదిం పశ్యామి విశ్వేశ్వర విశ్వరూప. ౧౬

ఓయి! విశ్వనాథ! • యుదరము ల్ముఖములు
కనులు చేతు లెన్నొ • కల్గినట్టి
యీ యనంతరూప • మేఁ గంటి నెల్లెడఁ
గాని, తుదయు మొదలుఁ • గానుపడదు. ౧౬

కిరీటినం గదినం చక్రిణం చ తేజోరాశిం సర్వతో దీప్తిమన్తం,
పశ్యామి త్వాం దుర్నిరీక్షం సమన్తా ద్దీప్తానలార్క–ద్యుతి మప్రమేయం.౧౭

గదలును కిరీటములును జ • క్రములుఁదాల్చి
యంతటఁ బ్రదీప్త మొంది దీ • ప్తానలార్క–
తుల్యమై, దుర్నిరీక్ష్యమై; • ద్యుతులనిండి
యప్రమేయమౌ నీ రూప • మనఘ! కంటి. ౧౭

త్వ మక్షరం పరమం వేదితవ్యం త్వ మస్య విశ్వస్య పరంనిధానం,
త్వ మవ్యయ శ్శాశ్వతధర్మగోప్తా సనాతన స్త్వం పురుషో మతో మే.౧౮

అవ్యయుఁడవు, వేద్యుండవు, • నక్షరుఁడవు,
నఖిలవిశ్వమ్మునకుఁ బర • మాశ్రయుఁడవు,
సకలధర్మరక్షకుఁడవు, • శాశ్వతుఁడవు,
నరయఁ దగినసనాతన • పురుషుఁ డీవు. ౧౮

అనాదిమధ్యాన్త మనన్తవీర్య మనన్తబాహుం శశిసూర్యనేత్రమ్,
పశ్యామి త్వాం దీప్తహుతాశవక్త్రం స్వతేజసా విశ్వ మిదం తపన్తమ్. ౧౯

ఆదిమధ్యాంతములు లేక • యధిక బాహు
యుతుఁడ వగుచు, ననంతవీ•ర్యుండవగుచు,
నర్కచంద్రాక్షుఁడవు, జ్వలి•తాగ్నిముఖుఁడ
వై, స్వతేజమ్ముచేత నీ•యఖిలవిశ్వ
మును దపింపఁజేసెడు భాతిఁ • గనెద నిన్ను. ౧౯

ద్యావాపృథివ్యో రిద మన్తరం హి వ్యాప్తం త్వయైకేన దిశశ్చ సర్వాః,
దృష్ట్వాఽద్భుతం రూప ముగ్రం తవేదం లోకత్రయం ప్రవ్యథితం మహాత్మన్.
అమీ హి త్వాం సురసఙ్ఘా విశన్తి కేచి ద్భీతాః ప్రాఞ్జలయో గృణన్తి,
స్వస్తీత్యుక్త్వా మహర్షిసిద్ధసఙ్ఘాః స్తువన్తి త్వాం స్తుతిభిః పుష్కలాభిః. ౨౧

ఆకాశవిశ్వంభ•రాంతర భాగంబు
సర్వంబు నిఖిలది•క్సంతతులును
తానకనైకప్ర•భావలసన్మూర్తి
నీరంధ్రితరమయి • నిండియుండెఁ
బరమాద్భుతంబైన • భవదుగ్రరూపంబుఁ
గనియు లోకంబెల్ల • వణఁకుచుండె
సకలమౌ నీ సుర•సంఘంబులెల్లరు
నిన్నుఁ బ్రవేశించు•చున్నవారు
ప్రాంజలులునై విభీతిని • బ్రస్తుతించు
చున్నవారలు కొందఱు • నిన్ను దేవ !
స్వస్తిఁబల్కుచు ఋషిసిద్ధ•సమితియెల్లఁ
బొగడుచుండిరి సంస్తుతి • పుష్కలముగ. ౨౦



10

రుద్రాదిత్యా వసవో యే చ సాధ్యా విశ్వేఽశ్వినౌ మరుతశ్చోష్మపాశ్చ,
గన్ధర్వ యక్షాసురసిద్ధసఙ్ఘా వీక్షన్తే త్వాం విస్మితా శ్చైవ సర్వే. ౨౨

రుద్రు లాదిత్య సాధ్యమ॰రుద్గణంబు,
నఖిలపితృ దేవతలును, వి॰శ్వేశ్వినులును,
యక్షగంధర్వవసుసిద్ధు॰ లసురచయము,
నిన్ను విస్మితులై కాంచు ॰ చున్నవారు. ౨౧

రూపం మహత్తే బహువక్త్రనేత్రం మహాబాహో! బహుబాహూరుపాదం,
బహూదరం బహుదంష్ట్రాకరాళందృష్ట్వాలోకాః ప్రవ్యథితా స్తథాఽహం.

బహుముఖమ్ములు, నేత్రముల్ ॰ పాదములును,
నుదరములు, ఘోరదంష్ట్రలు ॰ నూరువులును,
హ స్తములు, గల నీదు మ॰హాకృతిఁ గని
వెఱపుఁ గొనుచుంటి నేను నీ॰విశ్వమెల్ల. ౨౨

నభస్స్పృశం దీప్తమనేకవర్ణం వ్యాత్తాననం దీప్తవిశాలనేత్రమ్,
దృష్ట్వా హి త్వాం ప్రవ్యథితాన్తరాత్మా ధృతిం న విన్దామి శమం చ విష్ణో.

అగణితవిచిత్రదీప్తులు ॰ గగనమంటఁ,
బాఱఁ దెఱచిన మొగములు, ॰ ప్రజ్వరిల్లు
గొప్పకను లొప్ప, నినుఁ గని; ॰ గొంటి భీతి,
నేను ధృతిని శమమ్మును ॰ బూనకుంటి. ౨౩

దంష్ట్రాకరాళానిచ తే ముఖాని దృష్ట్వైవ కాలానలసన్నిభాని,
దిశో న జానే న లభే చ శర్మ ప్రసీద దేవేశ! జగన్నివాస! ౨౫

స్ఫారదంష్ట్రాకరాళమై ♦ మీఱి ప్రళయ
కాలవహ్నినిభంబౌ ముఖములఁ గాంచి,
తెలియకుంటి దిశల్, సౌఖ్య ♦ మొలయనైతి,
దేవదేవ! ప్రసన్నుండ ♦ వీవు గమ్మ! ౨౫

అమీ చ త్వాం ధృతరాష్ట్రస్య పుత్రాః సర్వే సహైవావనిపాలసఙ్ఘైః,
భీష్మో ద్రోణస్సూతపుత్త్రస్తథాఽసౌ సహాస్మదీయైరపి యోధముఖ్యైః.
వక్త్రాణి తే త్వరమాణా విశన్తి దంష్ట్రాకరాళాని భయానకాని,
కేచిద్విలగ్నా దశనాన్తరేషు సన్దృశ్యన్తే చూర్ణితైరుత్తమాఙ్గైః.

సరసిజనేత్ర! కూడియు వి♦శాంపతు లెల్లరతోడఁ గౌరవుల్
శరగురుఁ, డంగభూధవుఁడు ♦ శాంతనవుండు, మదీయయోధు లె
ల్లరుత్వర, ఘోరదంష్ట్రలఁజె♦లంగుత్వదాస్యములందుఁజొచ్చిరా,
శిరములునల్గఁ; గొంద ఱటు ♦ జిక్కిరి నీ రదనాంతరంబులన్. ౨౭

యథా నదీనాం బహవోఽమ్బువేగాః సముద్రమేవాభిముఖా ద్రవన్తి,
తథా తవామీ నరలోకవీరా విశన్తి వక్త్రాణ్యభివిజ్వలన్తి. ౨౮

శౌర! యెట్లు నదీప్రవా♦హంబు లెల్ల
నభిముఖంబై సముద్రంబు♦నందుఁ జొచ్చు,
నట్లె, యాశూరులు ప్రవేశ♦మందుచుండి
రంతటను వెల్గు నీ మోము♦లందు దేవ! ౨౮

యథా ప్రదీప్తం జ్వలనం పతఙ్గా విశన్తి నాశాయ సమృద్ధవేగాః,
తథైవ నాశాయ విశన్తి లోకా స్తవాపి వక్త్రాణి సమృద్ధవేగాః. ౨౯

ఏవిధిఁ బతంగములు నశియించుకొఱకు
నతిరయమ్మునఁ జొచ్చు తీక్ష్ణానలమున,
నట్లె, భూతంబులు వినాశమందుకొఱకు
క్షిప్రగతి నీదుముఖములఁ జేరుచుండె. ౨౭

లేలిహ్యసే గ్రసమానస్సమన్తా ల్లోకా న్సమగ్రాన్ వదనైర్జ్వలద్భిః,
తేజోభి రాపూర్య జగ త్సమగ్రం భాస స్తవోగ్రాః ప్రతపన్తి విష్ణో. ౩౦

జ్వలితముఖముల మ్రింగుచు సకలజనుల,
నల్పుచుంటివి సర్వ మాస్వాదనంబు,
నీ మహోగ్రతేజశ్ఛవు ల్నిఖిలజగము
నిండి తపియింపఁగాఁ జేయుచుండె కృష్ణ! ౨౮

ఆఖ్యాహి మే కో భవానుగ్రరూపో నమోస్తు తే దేవవర ప్రసీద,
విజ్ఞాతుమిచ్ఛామి భవన్తమాద్యం నహి ప్రజానామి తవ ప్రవృత్తిం. ౩౧

దేవ! నాకు ప్రసన్నుండవీవు గమ్మ!
నే నమస్కృతియొనరింతు; నీ ప్రవృత్తి
నెఱుఁగ, భీషణరూపుండ వెవఁడ వీవు;
తెలియఁగోరు దాద్యుని నిను దెలుపుమయ్య! ౨౯

కాలోఽస్మి లోకక్షయకృత్ప్రవృద్ధో లోకాన్ సమాహర్తుమిహ ప్రవృత్తః,
ఋతేఽపి త్వాం న భవిష్యన్తి సర్వే యేఽవస్థితాః ప్రత్యనీకేషు యోధాః. 32

తస్మాత్త్వముత్తిష్ఠ యశో లభస్వ జిత్వా శత్రూన్ భుంక్ష్వ రాజ్యం సమృద్ధమ్,
మయైవైతే నిహతాః పూర్వమేవ నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్. 33

ఈ ప్రపంచక్షయ • హేతువై యభివృద్ధిఁ
బొందెడు కాలరూ•పుండ నేను
సర్వలోకంబుల • సంహార మొనరింప
సంసిద్ధుఁ డైన యీ•సమయమందుఁ
బ్రత్యనీకస్థిత•బహుళయోధాగ్రణుల్
నీవు చంపకయున్న • నెగడఁబోవ
రింతకుపూర్వమే • యీ నీదు శాత్రవ
నికరంబు నాచేత • నిహతమయ్యె,
నర్జున! నిమిత్తమాత్రుండ • వగుము! లెమ్మె!
ఆలమందున దుర్యోధ•నాదిశత్రు
వర్గమును గెల్చి సద్యశః•ప్రభల మించి,
యనుభవింపు! సమృద్ధరా•జ్యంబు నెల్ల. ౩౦

ద్రోణఞ్చ భీష్మఞ్చ జయద్రథఞ్చ కర్ణం తథాఽన్యానపి యోధవీరాన్,
మయా హతాంస్త్వం జహి మా వ్యథిష్ఠా యుధ్యస్వ జేతాసి రణే సపత్నాన్.

సంహారింపుమ! నాచేతఁ • జంపఁబడిన
భీష్మగురుకర్ణసైంధవ•వీరతతిని,
లెమ్మె! జాగేల? నింక భ•య మ్మదేల?
సలుపుమ! రణమ్ము, వైరుల • గెలువఁగలవు. ౩౧

ఏతచ్ఛ్రుత్వా వచనం కేశవస్య కృతాఞ్జలి ర్వేపమానః కిరీటీ,
నమస్కృత్వా భూయఏవాహ కృష్ణం సగద్గదం భీతభీతః ప్రణమ్య. ౩౫

వడవడ వడంకు పార్థుండు, ♦ వాసుదేవు
వాక్యములు విని యంజలి•బద్ధుఁడగుచుఁ,
బ్రణుతు లొనరించి, యత్యంత•భయముతోడ
నెలుఁగు రాల్పడ వినయుఁడై ♦ యిట్టులనియె. ౩౨

స్థానే హృషీకేశ తవ ప్రకీర్త్యా జగత్ప్రహృష్యత్యనురజ్యతే చ,
రక్షాంసి భీతాని దిశో ద్రవన్తి సర్వే నమస్యన్తి చ సిద్ధసఙ్ఘాః. ౩౬

ఓ జగదీశ! యిట్టి పురు•షోత్తమమూర్తివి నీవు గావునన్,
ఈజగమెల్ల నిన్ను స్తుతి•యించుచు సంతసమందుచుండె; ను
ద్వేజతరానురక్తిఁగనె,•దివ్యులుఁ సిద్ధులు, మ్రొక్కుచుండి రా
తేజముఁ బాసి, దానవులు•దిక్కులఁ బర్విడుచుండిరి భీతులై. ౩౩

కస్మాచ్చ తే న నమేరన్ మహాత్మన్ గరీయసే బ్రహ్మణోఽప్యాదికర్త్రే,
అనన్త! దేవేశ! జగన్నివాస! త్వ మక్షరం సదస త్తత్పరం యత్. ౩౭

త్వ మాదిదేవః పురుషః పురాణ స్త్వమస్య విశ్వస్య పరం నిధానమ్,
వేత్తాఽసి వేద్యఞ్చ పరఞ్చ ధామ త్వయా తతం విశ్వ మనన్తరూప! ౩౮

అధికుఁడౌ బ్రహ్మకు ♦ నాదికర్తవు నీవ,
యఖిలజగద్వ్యాపి ♦ వగుదు వీవ,
యక్షరుండవు నీవ, ♦ యవ్యయుండవు నీవ,
సదసత్పరంబైన ♦ స్వామి వీవ,

యాది దేవుఁడవు లో♦కావాసుఁడవు నీవ,
విభుఁడవు నీవ, స♦ద్వేత్త వీవ,
తత విశ్వపరమని♦ధానమ్ము నీవ, సం
తతవేద్యమా పరం ♦ ధామ మీవ,

ఓ యనంతరూప! ♦ యో దేవదేవ! పు
రాణపురుష! యోమ♦హానుభావ!
యిట్టినీకు పూజ♦ లేపొద్దుసల్పి, న
మస్కరించ కెవరు ♦ మానువారు? ౩౪

వాయు ర్యమోఽగ్ని ర్వరుణశ్శశాఙ్కః, ప్రజాపతి స్త్వం ప్రపితామహశ్చ,
నమో నమస్తేఽస్తు సహస్రకృత్వః పునశ్చ భూయోఽపి నమో నమస్తే. ౩౯

చంద్రుఁ డనలుండు, వరుణప్ర♦జాపతులును,
దండధరుఁడు వాయువు, ప్రపి♦తామహుండు,
నెల్లరును నీవె గాన, నీ♦ కెఱుఁగువాఁడ,
మఱలమఱలను వేనవేల్♦మాఱు లనఘ! ౩౫

నమః పురస్తాదథ పృష్ఠతస్తే నమోఽస్తు తే సర్వతఏవ సర్వ,
అనన్తవీర్యామితవిక్రమస్త్వం సర్వం సమాప్నోషి తతోఽసి సర్వః. ౪౦

ముందువెనుకల నన్నివై♦పులనునుండి
యే నొనర్తు నమస్కృతు ♦ లివిగొ కృష్ణ!
అమితదివ్యవిక్రమ! నీవు ♦ నఖిలమునను
నిండియుండుట సర్వాఖ్య ♦ నెగడినావు. ౩౬

సఖేతి మత్వా ప్రసభం యదుక్తం హే కృష్ణ ! హే యాదవ ! హే సఖేతి,
అజానతా మహిమానం తవేదం మయా ప్రమాదాత్ప్రణయేన వాఽపి.
యచ్చావహాసార్థ మసత్కృతోఽసి విహారశయ్యాసనభోజనేషు,
ఏకోఽథవా ప్యచ్యుత! తత్సమక్షం తత్ క్షామయే త్వా మహ మప్రమేయమ్.

ఏ నీదుమాహాత్మ్య • మిదివఱ కెఱుఁగక
నజ్ఞత్వమునఁ బ్రణ•యమున నేని
యాదవా ! శ్రీకృష్ణ ! • యనుఁగునెచ్చెలికాఁడ !
యంచు సంబోధించి • తయ్య ! నిన్ను,
అనఘ ! దేవేశ ! నీ•వప్రమేయుఁడ వని
యించుకేనియు మది • నెన్న కెపుడు
నాహారశయ్యావి•హారాసనాదుల
నిను దిరస్కారంబు • నెఱపినాఁడ,
నీదు ప్రత్యక్షమందున • నీపరోక్ష
మందునను జేసితిని పరి•హాస మేను,
నెన్ని యోసారు లీ వవి • యెల్ల మఱచి
కరుణ క్షమియింపు మిదె నమ•స్కారశతము. 32

పితాఽసి లోకస్య చరాచరస్య త్వమస్య పూజ్యశ్చ గురుర్గరీయాన్,
న త్వత్సమోఽస్త్యభ్యధికః కుతోఽన్యో లోకత్రయేఽప్యప్రతిమప్రభావ. 43
తస్మాత్ ప్రణమ్య ప్రణిధాయకాయం ప్రసాదయే త్వామహమీశ మీడ్యమ్,
పితేవ పుత్రస్య సఖేవ సఖ్యుః ప్రియః ప్రియాయాఽర్హసి దేవ! సోఢుమ్.

సచరాచర ప్రపం•చమునకుఁ దండ్రివి
నీవ, పూజార్హుండ • వీవ దేవ!

సర్వోత్తముం డగు • సద్గురుండవు, జగ
త్త్రియమునందు సమాన•రహితుఁడీవ
సర్వసర్వంసహా•చక్రాధిపుఁడ వీవ
యప్రతిమప్రభా•వాఢ్యుఁ డీవ
యీశ్వరుండవు నీవ • యెల్లలోకమ్ముల,
కీడ్యుండ వయ్యును • నెనఁగె దీవ
హరి ! ప్రసన్నుండ వగుమ జో•హారొనర్తుఁ
బ్రియుఁడు ప్రియురాలి, మిత్రుండు • ప్రియవయస్యు,
తండ్రి తనయు దోసంగుల • దయ సహించు
నట్లు నాతప్పుల క్షమింపు•మా ముకుంద ! ३८

అదృష్టపూర్వం హృషితోఽస్మి దృష్ట్వా భయేనచ ప్రవ్యథితం మనో మే,
తదేవ మే దర్శయ దేవ ! రూపం ప్రసీద దేవేశ ! జగన్నివాస. ४५

దేవ! యెన్నఁడుఁ గనని నీ•దివ్యమూర్తి
గాంచి నే ముదమందితిఁ • గాని యిపుడు
వ్యథిత మయ్యెను నామది • భయముచేతఁ
బరమకృప! నీదుపూర్వరూ•పంబుఁ జూపు. ३९

కిరీటినం గదినం చక్రహస్తమిచ్ఛామి త్వాం ద్రష్టుమహం తథైవ,
తేనైవ రూపేణ చతుర్భుజేన సహస్రబాహో భవ విశ్వమూర్తే! ४६

అనఘ! యోవిశ్వమూర్తి! స•హస్రబాహు !
నాల్గుముఖములతోడ, న•నర్ఘమకుట
శంఖచక్రగదాశార్ఙ్గ•సక్తమైన
నీదుపూర్వాకృతిఁజూడ • నేఁ దలంతు. ४०

మయా ప్రసన్నేన తవార్జునేదం రూపం పరం దర్శిత మాత్మయోగాత్,
తేజోమయం విశ్వ మనన్త మాద్యం యన్మే త్వద న్యేన న దృష్టపూర్వమ్.

అధిక తేజోమయోత్కృష్ట • మంత్యరహిత,
మాద్య మీవిశ్వరూపంబు, • నాత్మయోగ
మునఁ బ్రసాదించితిని నీకు • మున్ను దీని
నర్జునా! తిలకింపలే • దన్యు లెవరు. ౪౧

న వేదయజ్ఞాధ్యయనై ర్నదానై ర్నచ క్రియాభి ర్నతపోభిరుగ్రైః
ఏవంరూపశ్శక్య అహం నృలోకే ద్రష్టుం త్వద న్యేన కురుప్రవీర. ౪౨

వేదయజ్ఞాధ్యయనదాన•విధులచేతఁ
గఠినతపములచేతను • గర్మములను,
నైన వీక్షింప శక్యంబుఁ•గాని దీని
నీకుఁ జూపితి నీనర•లోకమందు. ౪౨

మా తే వ్యథా మాచవిమూఢభావో దృష్ట్వా రూపం ఘోరమీదృఙ్మమేదమ్,
వ్యపేతభీః ప్రీతమనాః పున స్త్వం త దేవ మే రూప మిదం ప్రపశ్య. ౪౯

ఈభయంకరమా రూప • మీవు గాంచి
భయము నొందకు, మూఢభా•వంబు వలదు,
చూపెదను నాదు తొలిరూపుఁ • జూడు మింక,
భయము వీడియు, సంతోష•భరితమతిని. ౪౩

ఇత్యర్జునం వాసుదేవ స్తథోక్త్వా స్వకం రూపం దర్శయామాస భూయః,
ఆశ్వాసయామాస చ భీత మేనం భూత్వా పునస్సౌమ్యవపుర్మహాత్మా.౫౦

ఆంబికేయ! కృష్ణుఁ • డర్జును కటు దెల్పి,
సౌమ్యదేహాయు క్త•సహజరూప
మా మహాత్ముఁ డప్పు • డాతనికినిఁ జూపి,
యూరడించె భయము • తీఱిపోవ. ౪౪

దృష్ట్వేదం మానుషం రూపం తవ సౌమ్యం జనార్దన!
ఇదానీ మస్మి సంవృ త్త స్సచేతాః ప్రకృతిం గతః. ౫౧

ఓజనార్దన! లోకేశ! • యోమహాత్మ!
యీపరిసన్న మానుష దేహ • మేను గాంచి,
స్వస్థతను బొందితిని, స్వభా•వంబుఁ గంటి,
ననఘ! చైతన్య మిప్పు డే • నందినాఁడ. ౪౫

సుదుర్దర్శ మిదం రూపం దృష్టవా నసి యన్మమ,
దేవా అప్యస్య రూపస్య నిత్యం దర్శనకాఙ్క్షిణః. ౫౨

శ్వేతవాహన! నీవు వీ•క్షించి తెట్టి
నాస్వరూపమ్ము, దాని న•నారతమ్ము
నిచ్ఛగింతురు గనుఁగొన • నెల్లసురలు,
చూడఁగ నశక్య మియ్యది • సూనృతంబు. ౪౬

నాహం వేదై ర్నతపసా న దానేన నచేజ్యయా,
శక్య ఏవంవిధో ద్రష్టుం దృష్టవానసి మాం యథా. ౫౩

ఏప్రకారంబుగాఁ గంటి • వీవు నన్ను,
నట్టిదా విశ్వరూపంబు • నందు నన్నుఁ
దపములను, వేదములచేత • దానములను,
యజ్ఞములచేతఁ జూడ సా • ధ్యంబు గాదు. ౭౭

భక్త్యా త్వనన్యయా శక్య అహ మేవంవిధోఽర్జున,
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుంచ పరంతప! ౫౪

ఇట్టివిశ్వరూపముఁ దాల్చి • నట్టి నన్ను
నరిభయంకర! విజయ! య • నన్య మైన
భక్తిభావమ్ముచేతను • బడయనగును,
దెలిసికొననగుఁ, జూడఁగా • వలనుపడదు. ౭౮

మత్కర్మకృన్మత్పరమో మద్భక్త స్సఙ్గవర్జితః,
నిర్వైర స్సర్వభూతేషు యస్సమామేతి పాణ్డవ! ౫౫

నానిమిత్తంబు కర్మలఁ • బూని, నాకు
భక్తుఁడై, నేనె యుత్తమ • పదమటంచు
సంగసంవర్జితుండయి, • సర్వభూత
విహితుఁ డగువాఁడె, పొందును • విజయ! నన్ను. ౭౯

# పండ్రెండవయధ్యాయము

## భక్తియోగము

ఏవం సతతయుక్తా యే భక్తాస్త్వాం పర్యుపాసతే,
యే చాప్యక్షరమవ్యక్తం తేషాం కే యోగవిత్తమాః. ౧

ఓ హృషీకేశ! సతతసం◆యుక్తులై, యు
పాసనం బొనరింతు రే ◆ భక్తవర్యు;
లెవ్వ రవ్యక్తు నక్షరు ◆ నెలమిఁ గొల్తు,
రందు యోగవిత్తము లెవ్వ◆రో మహాత్మ! ౧

మయ్యావేశ్య మనో యే మాం నిత్యయుక్తా ఉపాసతే,
శ్రద్ధయా పరయోపేతాస్తే మే యుక్తతమా మతాః. ౨

అర్జునా! నెమ్మనం బెవ ◆ రహరహంబు
పరమమౌ శ్రద్ధ నాయందుఁ ◆ బాదుకొల్పి
సేవఁ జేయు సమాహిత◆చిత్తు లగుచు
నట్టివార లుత్తము లంచు ◆ నభిమతంబు. ౨

యే త్వక్షర మనిర్దేశ్య మవ్యక్తం పర్యుపాసతే,
సర్వత్రగ మచిన్త్యఞ్చ కూటస్థ మచలం ధ్రువమ్. ౩
సన్నియమ్యేన్ద్రియగ్రామం సర్వత్ర సమబుద్ధయః,
తే ప్రాప్నువన్తి మామేవ సర్వభూతహితే రతాః. ౪

ఏరు, సమానబుద్ధు లయి◆యింద్రియనిగ్రహణం బొనర్చి, గం
భీర మచింత్య, మవ్యయము ◆ విశ్వపరీవృత, మక్షరంబు, వి
స్ఫార,మనిర్ణయంబును,ధ్రు◆వంబచలంబయియొప్పుబ్రహ్మముఁ
గోరి,యుపాస్తిఁ జేయు,నల◆ కోవిదులొందుదు రర్జునా! ననున్. ౩

క్లేశో౽ధికతర స్తేషా మవ్యక్తాసక్తచేతసామ్,
అవ్యక్తా హి గతిర్దుఃఖం దేహవద్భి రవాప్యతే. ౫

అట్టియవ్యక్తసక్తాంత•రాత్ములకును
నధికతరమైనక్లేశంబు • లావహిల్లు,
నంగదలు గల్గకుండ దే•హాభిమాను
లకుఁ బరబ్రహ్మనిష్ఠ దు•ర్లభము పార్థ! ౪

యేతు సర్వాణి కర్మాణి మయి సన్న్యస్య మత్పరాః,
అనన్యేనైవ యోగేన మాం ధ్యాయన్త ఉపాసతే. ౬
తేషామహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్,
భవామి న చిరాత్పార్థ మయ్యావేశితచేతసామ్. ౭

అరయఁగ, నేనె సద్గతి య•టంచుఁ దలంచి,యనన్యయోగసు
స్థిరమతి సర్వకర్మములఁ • జేయుచు నర్పణ నాకు, నిల్పినం
బరమున బుద్ధి నాయెడ,ను•పాసనసల్పెదు రేరు, మృత్యుసం
సరణమహాబ్ధినుండియు వె•సన్ దరియింపఁగఁజేతు వారలన్. ౫

మయ్యేవ మన ఆధత్స్వ మయి బుద్ధిం నివేశయ,
నివసిష్యసి మయ్యేవ అత ఊర్ధ్వం న సంశయః. ౮

నీ మనము నిల్పు నాయందె, • నీదుబుద్ధి
సక్త మొనరింపు నాయెడ, • సవ్యసాచి!
యాచరించిన నట్లు, దే•హాంతమందుఁ
బొందెదవు నన్ను; సందియ•మింత లేదు. ౬

అథ చిత్తం సమాధాతుం న శక్నోషి మయి స్థిరమ్,
అభ్యాసయోగేన తతో మా మిచ్ఛాప్తుం ధనఞ్జయ. ౯

అటుల చిత్తంబు నాయందు • నధివసింపఁ
జేయ స్థిరముగ శక్యమై • జెలఁగదేని;
యో ధనంజయ! యభ్యాస • యోగముగను
నన్నుఁ బొందఁగఁగోరు మ • నారతంబు. ౭

అభ్యాసేఽప్యసమర్థోఽసి మత్కర్మపరమో భవ,
మదర్థ మపి కర్మాణి కుర్వన్ సిద్ధి మవాప్స్యసి. ౧౦

అలవడదయేని శక్తి య • భ్యాసమునకు
సర్వకర్మలు నాకయి • నిర్వహింపు,
నానిమిత్తము కర్మల • నడపుచుంటి
వేని; సిద్ధినిఁ బొందెద • వీవు విజయ! ౮

అథైతదప్యశక్తోఽసి కర్తుం మద్యోగ మాశ్రితః,
సర్వకర్మఫలత్యాగం తతః కురు యతాత్మవాన్. ౧౧

నానిమిత్తము కర్మల • నడపుటకును
నీవశక్తుండ వగుదేని • నిశ్చయముగ,
నాశ్రయించియు మద్యోగ; • మాత్మనిగ్ర
హమునఁ గర్మఫలత్యాగి • వగుము! నీవు. ౯

శ్రేయో హి జ్ఞానమభ్యాసాత్ జ్ఞానా ద్ధ్యానం విశిష్యతే,
ధ్యానాత్కర్మఫలత్యాగస్త్యాగాచ్ఛాన్తిరనన్తరమ్.  ౧౨

కన్తి! యభ్యాసయోగంబు♦కంటె, జ్ఞాన
ముత్తమము; దానికంటెను ♦ యోగ్యమగును
ధ్యాన మద్దానికిని ఫల♦త్యాగమెన్న
శ్రేష్ఠమగు, శాంతి మఱియును ♦ శ్రేయమిదును.  ౧౦

అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవ చ,
నిర్మమో నిరహఙ్కార స్సమదుఃఖసుఖః క్షమీ.  ౧౩
సంతుష్టస్సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః,
మయ్యర్పితమనోబుద్ధి ర్యో మద్భక్త స్స మే ప్రియః.  ౧౪

అఖిలభూతమ్ములయెడ ♦ కద్వేషి, మిత్రుండు,
పరమదయాళువు ♦ ప్రముదితుండు,
నధికనిష్ఠాత్ముఁ డ♦హంకారమమకార
వర్జితుండు, క్షమాను♦వర్తనుండు
సుకమును దుఃఖమ్ము ♦ నొకభంగిఁ గనువాఁడు,
నిర్మలమా దృఢ♦నిశ్చయుండు
ఋజుమార్గచరుఁడు, స♦ర్వేంద్రియనిగ్రహ
వ్యాపారపారీణుఁ♦డైనవాఁడు
యోగసక్తాంతరంగుండు, ♦ త్యాగధనుఁడు
స్వాంతమును బుద్ధి నాకు న♦ర్పణముఁ జేయు
నట్టివాఁడును, మద్భక్తుఁ ♦ డైనవాఁడు
నాకుఁ బ్రియుఁడైనవాఁడు సు♦మ్మా కిరీటి!  ౧౧

యస్మాన్నోద్విజతే లోకో లోకాన్నోద్విజతే చ యః,
హర్షామర్షభయోద్వేగై ర్ముక్తో యస్స చ మే ప్రియః. ౧౫

ఎవనిచే జగం బొ•కింత భీతిల్లదు,
ఎవఁడు జగముచేత • నించుకేని
భయముఁ గనఁ డమర్ష•భయసముద్వేగహ
ర్షాతిరిక్తుఁ డిష్టుఁ • డతఁడె నాకు. ౧౫

అనపేక్ష శ్శుచిర్దక్ష ఉదాసీనో గతవ్యథః,
సర్వారమ్భపరిత్యాగీ యో మద్భక్త స్స మే ప్రియః. ౧౬

అర్జునా! యనపేక్షకుం • డధికశుచియు,
నతిసమర్థుఁ డుదాసీనుఁ • డభిమతార్థ
విముఖుఁ డపగతవ్యథుఁడును, • విమలభక్తుఁ
డెవ్వఁ డతఁడు ప్రియుం డటం • చెఱుఁగు, నాకు. ౧౬

యో న హృష్యతి న ద్వేష్టి న శోచతి న కాఙ్క్షతి,
శుభాశుభపరిత్యాగీ భక్తిమాన్ యస్స మే ప్రియః. ౧౭

తోస మందక, పొందక • దుఃఖ మెపుడు,
వీడి కాంక్షల, ద్వేషంబు•జాడఁ బోక,
మొగి శుభాశుభములనుండి • ముక్తుఁ డగుచు
నను భజించెడిభక్తుండె • నాకుఁ బ్రియుఁడు. ౧౭

సమశ్శత్రౌ చ మిత్రే చ తథా మానావమానయోః,
శీతోష్ణసుఖదుఃఖేషు సమస్సఙ్గవివర్జితః. ౧౮
తుల్యనిన్దాస్తుతిర్మౌనీ సంతుష్టో యేన కేనచిత్,
అనికేతః స్థిరమతి ర్భక్తిమాన్ మే ప్రియో నరః. ౧౯

శత్రుసంఘమ్మును • మిత్రసంఘమ్మును
సమబుద్ధిఁ గాంచెడు • సాధుమూర్తి,
సౌఖ్యదుఃఖమ్ముల • సర్వకార్యమ్ముల
సమబుద్ధిఁ గాంచెడు • సాధుమూర్తి,
శీతంబు నుష్ణంబు • సిద్ధ్యసిద్ధ్యాదుల
సమబుద్ధిఁ గాంచెడు • సాధుమూర్తి,
మానావమానము • ల్మఱియు నిందాస్తుతుల్
సమబుద్ధిఁ గాంచెడు • సాధుమూర్తి,
తృప్తుఁ డైనవాఁడు, • దృఢతరచిత్తుండు,
మౌనరతుఁడు, నాశ • మానువాఁడు,
నాశ్రయమ్ములేని • యట్టి యోగ్యతముండు,
విమలభక్తుఁ డతఁడు • ప్రియుఁడు నాకు. ౧౫

యే తు ధర్మ్యామృతమిదం యథోక్తం పర్యుపాసతే,
శ్రద్దధానా మత్పరమా భక్తాస్తేఽతీవ మే ప్రియాః. ౨౦

అర్జునా ! నేనె సద్గతి • యంచు నమ్మి
వేడ్క ధర్మ్యామృతమ్మును • విశ్వసించి;
నను యథోక్తమ్ముగ, నుపాస • నమ్మ్మ సలుపు
నట్టిభక్తు లతిప్రియు • లయ్య! నాకు. ౧౬

# పదుమూడవ యధ్యాయము

## క్షేత్రక్షేత్రజ్ఞవిభాగయోగము

ప్రకృతిం పురుషఞ్చైవ క్షేత్రం క్షేత్రజ్ఞమేవ చ,
ఏతద్వేదితు మిచ్ఛామి జ్ఞానం జ్ఞేయఞ్చ కేశవ. ౧

కేశవా! యెద్ది ప్రకృతి నా? • క్షేత్ర మెద్ది?
యెవఁడు పురుషుండు? క్షేత్రజ్ఞుఁ • డెవ్వఁ డగును?
ఎయ్యదియు జ్ఞానమన? జ్ఞేయ • మెద్ది యనఁగ?
నీ సమస్తం బెఱుంగ నే • నిచ్ఛగింతు. ౧

ఇదం శరీరం కౌన్తేయ! క్షేత్ర మిత్యభిధీయతే,
ఏతద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః. ౨

అర్జునా! క్షేత్రమే దేహ•మనఁగఁ బరఁగు,
నెవఁడు దీనిని నిజముగా • నెఱుఁగువాఁడొ,
యట్టి యాతఁడె క్షేత్రజ్ఞుఁ • డగు నటంచు
నరసి పల్కిరి తద్విదు • లైనవారు. ౨

క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత,
క్షేత్రక్షేత్రజ్ఞయోర్జ్ఞానం యత్తత్ జ్ఞానం మతం మమ. ౩

ఎల్లక్షేత్రమ్ములందున • నెసఁగియుండు
నట్టి క్షేత్రజ్ఞు నన్నుఁగా • నరయుమయ్య!
క్షేత్రమును మఱి క్షేత్రజ్ఞుస్థితి నెఱుంగు
నదియ, జ్ఞానం బటంచు మ•దభిమతంబు. ౩

తత్ క్షేత్రం యచ్చ యాదృక్చ యద్వికారి యతశ్చ యత్,
సచ యో యత్ప్రభావశ్చ తత్సమాసేన మే శృణు. ౪

ఎద్ది క్షేత్రమ్ము? అయ్యది • యెట్టులగును?
ఏవికారము లలదియా? • నెటులఁ బుట్టు?
నెవ్వఁ డగును క్షేత్రజ్ఞుఁడు? • ఎట్టిదగును?
తత్ప్రభావమ్ము; వినుము! క్లుప్తముగఁ బార్థ! ౪

ఋషిభిర్బహుధా గీతం ఛన్దోభి ర్వివిధైః పృథక్,
బ్రహ్మసూత్రపదైశ్చైవ హేతుమద్భి ర్వినిశ్చితైః. ౫

ఋషివరులచేత నద్ది య•నేకగతుల
వివిధఛందమ్ములం బృథ•గ్విధముగాఁగ
హేతుమద్వినిశ్చితములై • యెసఁగు నట్టి
బ్రహ్మసూత్రపదమ్ములఁ • బల్కఁబడియె. ౫

మహాభూతాన్యహఙ్కారో బుద్ధిరవ్యక్త మేవ చ,
ఇన్ద్రియాణి దశైకఞ్చ పఞ్చ చేన్ద్రియగోచరాః. ౬

ఇచ్ఛా ద్వేష స్సుఖం దుఃఖం సఙ్ఘాత శ్చేతనా ధృతిః,
ఏతత్ క్షేత్రం సమాసేన సవికార ముదాహృతమ్. ౭

బుద్ధ్యహంకారములు, మహా•భూతములు, వి
షయము లైదు, నవ్యక్త మిం•ద్రియదశైక
మిచ్ఛ, ద్వేషార్తిసౌఖ్యముల్ • ధృతియు, చేత
నమ్ము సంఘాతవికృతియు•క్తమ్ముగాను
క్షేత్రమంచును నిదియెల్లఁ • జెప్పఁబడియె. ౬

అమానిత్వ మదమ్భిత్వ మహింసా క్షాన్తి రార్జవమ్,
ఆచార్యోపాసనం శౌచం స్థైర్య మాత్మవినిగ్రహః. ౮

ఇన్ద్రియార్థేషు వైరాగ్య మనహఙ్కార ఏవ చ,
జన్మమృత్యుజరావ్యాధిదుఃఖదోషానుదర్శనమ్. ౯

అసక్తిరనభిష్వఙ్గః పుత్రదారగృహాదిషు,
నిత్యఞ్చ సమచిత్తత్వ మిష్టానిష్టోపపత్తిషు. ౧౦

మయి చానన్యయోగేన భక్తిరవ్యభిచారిణీ,
వివిక్తదేశసేవిత్వ మరతి ర్జనసంసది. ౧౧

అధ్యాత్మజ్ఞాననిత్యత్వం తత్త్వజ్ఞానార్థదర్శనమ్,
ఏతత్ జ్ఞాన మితి ప్రోక్త మజ్ఞానం యదతోఽన్యథా. ౧౨

ఆర్జవమ్ము నహింస • యాత్మనిగ్రహ మమా
నిత్వం బదంభిత్వ • నియతశుచిత
స్థైర్యమ్ము క్షాంతి యా•చార్యసేవన మన
హంకార మింద్రియా•ర్థాదివిరతి
వ్యాధియు భవమృత్యు•వార్ధక్యదుఃఖదో
షానుదర్శన మభి•ష్వంగవికృతి
యాత్మజదారగృ•హాదులందు విరక్తి
సమత యిష్టానిష్ట•సమితి నెపుడు
నరతి జనతతి, విజనస్థ•లాశ్రియ మ్మ
నన్యయోగత నాయందు • నచలభక్తి

నిత్యభావ మాధ్యాత్మిక • నిరతి, యర్థ
దర్శనమ్ము తత్త్వజ్ఞాన • దర్శనమ్ము
నిదియ జ్ఞానమ్ము; సజ్ఞాన • మితరమెల్ల. ౭

జ్ఞేయం యత్తత్ప్రవక్ష్యామి యద్జ్ఞాత్వాఽమృతమశ్నుతే,
అనాదిమత్పరం బ్రహ్మ న సత్తన్నాస దుచ్యతే. ౧౩

ఎద్ది జ్ఞేయము, యెద్దాని • నెఱిఁగి యమృత
మం దనాదిపరబ్రహ్మ • మదియ సుమ్మి;
కా దసత్తును, అయ్యది • కాదు సత్తు;
దానిఁ గూర్చి వచించెద • నేను వినుమ! ౮

సర్వతఃపాణిపాదం తత్సర్వతోఽక్షిశిరోముఖమ్,
సర్వతశ్శ్రుతిమల్లోకే సర్వ మావృత్య తిష్ఠతి. ౧౪

అంతటను బాణి పాద నే•త్రాళి గల్గి
యంతటను శ్రోత్రమస్తకా•స్యములు గల్గి
యంతటను నావృతంబయి • యలరునట్టి
బ్రహ్మ ముండును సర్వప్ర•పంచమందు. ౯

సర్వేన్ద్రియగుణాభాసం సర్వేన్ద్రియవివర్జితమ్,
అసక్తం సర్వభృచ్చైవ నిర్గుణం గుణభోక్తృ చ. ౧౫

పార్థ! సర్వేన్ద్రియగుణాభి•భాసమయ్యుఁ
దనరు సర్వేంద్రియవివర్జి•తమ్ము నయ్యు
సర్వభృతమగు నద్ది య•సక్తమయ్యు
ననుభవించును గుణముల • నగుణి యయ్యు. ౧౦

బహిర న్తశ్చ భూతానా మచరం చర మేవ చ,
సూక్ష్మత్వా త్తదవిజ్ఞేయం దూ రస్థం చా న్తికే చ తత్.

జంగమస్థావరంబయి • సర్వభూత
బాహ్యామధ్యస్థమై యొప్పు; • బహుళసూక్ష్మ
మగుటకతన నవిజ్ఞేయ • మగుచు, దూర
గతము నంతికస్థంబయి • గాలిచుండు. ౧౧

అవిభ క్తం చ భూ తేషు విభ క్తమివ చ స్థితమ్,
భూతభ ర్తృ చ తద్ జ్ఞేయం గ్రసిష్ణు ప్రభవిష్ణు చ. ౧౭

ఆపరబ్రహ్మ మవిభ క్త•మై, సమ స్త
జీవతతియందునను బరి•చ్ఛిన్నమైన
భాతి నున్నది సూ! భూత•భరణసంభ
వగ్రహణక ర్తయని యెన్న • బరగు నిద్ది. ౧౨

జ్యోతిషామపి తజ్జ్యోతి స్తమసః పర ముచ్యతే,
జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం హృది సర్వస్య నిష్ఠితమ్. ౧౮

అర్జునా! జ్యోతులకు జ్యోతి•యై, తమిస్ర
పటలబాహ్యమ్ము, జ్ఞానమ్ము • పరివిమలమ్ము
జ్ఞానగమ్యమ్ము, జ్ఞేయమ్ము • సకలహృదయ
సంస్థితమ్మైన దిద్ది ని•స్సంశయమ్ము. ౧౩

ఇతి క్షేత్రం తథా జ్ఞానం జ్ఞేయం చోక్తం సమాసతః,
మద్భక్త ఏతద్విజ్ఞాయ మద్భావాయోపపద్యతే. ౧౮

ఈవిధమ్మున క్షేత్రమ్ము, • నావిధమున
జ్ఞానమును, మఱి జ్ఞేయమ్ము • సంగ్రహముగఁ
బలుకఁగాఁబడెఁ; దెలిసి మ•ద్భక్తుఁడిద్ది
పార్థ ! తగియుండు నాదు భా•వమ్ముకొఱకు. ౧౮

ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభావపి,
వికారాంశ్చ గుణాంశ్చైవ విద్ధి ప్రకృతిసమ్భవాన్. ౨౦

అర్జునా! ప్రకృతిపురుషు • లనఁగఁ బరగు
నివి యనాదు లటంచు నీ • వెఱుఁగుమయ్య!
నమ్మమ! గుణమ్ములును వికా•రమ్ములెల్ల
భవము నొందినవానిఁగాఁ • బ్రకృతివలన. ౧౯

కార్యకారణకర్తృత్వే హేతుః ప్రకృతిరుచ్యతే,
పురుషస్సుఖదుఃఖానాం భోక్తృత్వే హేతురుచ్యతే. ౨౧

కార్యకారణకర్తృత్వ•కారణమ్ము
ప్రకృతియంచు వక్కా•ణింపఁ•బడియె నూవె!
పురుషుఁడే సుఖదుఃఖము • లొందుటందు
హేతుభూతుం డటంచు నీ • వెఱుఁగుమయ్య! ౨౦

పురుషః ప్రకృతిస్థో హి భుఙ్క్తే ప్రకృతిజాన్ గుణాన్,
కారణం గుణసఙ్గోఽస్య సదసద్యోనిజన్మసు. ౨౧

ప్రకృతియందుండి పురుషుండు, • ప్రకృతివలనఁ
బుట్టినట్టిగుణమ్ములఁ • బొందుచుండుఁ
గాన, హేతువు పురుషుగు•ణానురక్తి
శక్రసుత ! సదసద్యోని•జన్మములకు. ౧౭

ఉపద్రష్టాఽనుమన్తా చ భర్తా భోక్తా మహేశ్వరః,
పరమాత్మేతి చాప్యుక్తో దేహేఽస్మిన్ పురుషః పరః. ౨౨

తగ మహేశ్వరుఁడును, నుప•ద్రష్టకుండు,
భోక్తయును, భర్తయును నను•మోదకుండు
పార్థ ! పరమాత్మ యని పల్కఁ•బడెడు నట్టి
పురుషుఁ డుత్కృష్టుఁ డీ దేహ•మున ధ్రువమ్ము. ౧౮

య ఏనం వేత్తి పురుషం ప్రకృతిం చ గుణైస్సహ,
సర్వథా వర్తమానోఽపి న స భూయోఽభిజాయతే. ౨౩

ఎవ్వఁ డీవిధి పురుషుని, • నెల్లగుణ స
హితము నైనట్టి ప్రకృతిని • నెఱుఁగు; వాఁడు
వర్తమానుఁడై సర్వదా • పరగెనేని
పుట్టువందఁడు తిరిగి మో•ప్పట్టునందు. ౧౯

ధ్యానేనాత్మని పశ్యన్తి కేచిదాత్మానమాత్మనా,
అన్యే సాఙ్ఖ్యేన యోగేన కర్మయోగేన చాపరే. ౨౪

ఆత్మచేతను నాత్మను • నాత్మయందుఁ
గాంతురి కొందఱు, ధ్యానయో•గమ్ముచేతఁ
గాంతురి కొందఱు సాంఖ్యయో•గమ్ముచేతఁ
గాంతురి కొందఱు కర్మయో•గమ్ముచేత. ౨౦

అన్యే త్వేవమజానన్తః శ్రుత్వాఽన్యేభ్య ఉపాసతే,
తేఽపి చాతితరన్త్యేవ మృత్యుం శ్రుతిపరాయణాః. ౨౬

ఇంకఁ, గొంద ఱజానంతు • నీ విధమునఁ
దెలియనేరక, నన్యబో•ధల నుపాస్తి
భక్తి సల్పుచునున్నారు, • వారుగూడ
దాటెదరు మృత్యువును యథా•ర్థంబుగాను. ౨౧

యావత్సఞ్జాయతే కిఞ్చిత్సత్త్వం స్థావరజఙ్గమమ్,
క్షేత్రక్షేత్రజ్ఞసంయోగాత్తద్విద్ధి భరతర్షభ. ౨౭

జంగమస్థావరంబైన • స్వల్పసత్త్వ
మెంతవఱ కుద్భవంబందు, • నంతవఱకు
ప్రకృతిపురుషులకలయిక•వలన నద్ది
కలుగుచున్నదియే యంచుఁ • దలఁపుమయ్య ! ౨౨

సమం సర్వేషు భూతేషు తిష్ఠన్తం పరమేశ్వరమ్,
వినశ్యత్స్వవినశ్యన్తం యః పశ్యతి సపశ్యతి. ౨౮

సకలభూతమ్ములందున • సమముగాను
బరగు పరమేశు, నెవ్వాఁడు • ప్రాణితతి న
శించుచున్ననుగాని, న•శించనట్లు
గాంచుచున్నాఁడొ; యాతఁడే • కాంచువాఁడు. ౨౩

సమం పశ్యన్హి సర్వత్ర సమవస్థితమీశ్వరమ్,
న హినస్త్యాత్మనాఽఽత్మానం తతో యాతి పరాంగతిమ్. ౨౯

సమత నెల్లెడఁ బరగు నీ•శ్వరునిఁ జూచు
చున్నవాఁ డాత్మచే నాత్మ • నెన్నటికిని;
హింస నొనరింపఁగాఁ బోవఁ • డింద్రతనయ!
ఆతఁ డుత్కృష్టమౌగతి • నందువాఁడు. ౨౪

ప్రకృత్యైవ చ కర్మాణి క్రియమాణాని సర్వశః,
యః పశ్యతి తదాఽఽత్మానమకర్తారం స పశ్యతి. ౩౦

ఎవఁడు కర్మలఁ బ్రకృతిచే • నెల్లగతులఁ
జేయఁబడుచున్నభాతి వీ•క్షించు నెప్పు
డప్పు డాతఁడు క్షేత్రజ్ఞు • నన్నిగతులఁ
గాంచుచున్నాఁడు పార్థ! య•కర్తగాను. ౨౫

యదా భూతపృథగ్భావ మేకస్థ మనుపశ్యతి,
తత ఏవ చ విస్తారం బ్రహ్మ సమ్పద్యతే తదా. 30

ఎపుడు భూతపృథగ్భావ ♦ మేకసంస్థి
తమ్ముగాఁ గాంచునో; విస్తారమ్ము నాత్మ
కతమునను గల్గు నంచును ♦ గాంచు నెపుడు
అప్పుడే తాను బ్రహ్మంబ ♦ యగుఁ దలంప. ౨౯.

అనాదిత్వాన్నిర్గుణత్వాత్పరమాత్మాఽయ మవ్యయః,
శరీరస్థోఽపి కౌన్తేయ న కరోతి న లిప్యతే. 31

ఆద్యరహితుండు నిర్గుణుఁ ♦ డవ్యయుండు
గాన పరమాత్మ; యున్నను ♦ కాయమందుఁ
గర్మముల నొనరింపఁ డెక్కాలమునను
కాఁడు లిప్తుండు తత్ఫలకాండమందు. ౨౭

యథా సర్వగతం సౌక్ష్మ్యా దాకాశం నోపలిప్యతే,
సర్వత్రావస్థితో దేహే తథాఽఽత్మా నోపలిప్యతే. 33

అంతటను నేవిధమ్మున ♦ నాకసంబు
నలముకొనియుండినను, సూక్ష్మ ♦ మగుటకతన
నంటకుండునో, యట్టులే ♦ యంటకుండు
నాత్మ దేహమ్మ నంతట ♦ నడరియున్న. ౨౮

యథా ప్రకాశయత్యేకః కృత్స్నం లోకమిమం రవిః,
క్షేత్రం క్షేత్రీ తథా కృత్స్నం ప్రకాశయతి భారత. 38

జగము లన్నింటి నొక్కఁడా • జలజహితుఁడు
ఎటుఁ బ్రకాశింపఁ జేయునో; • అటులె సర్వ
దేహములను క్షేత్రజ్ఞుండు • తేజరిల్లఁ
జేయుచున్నాఁడు; నిక్కువ • మోయి! విజయ! ౨౯

క్షేత్రక్షేత్రజ్ఞయో రేవ మన్తరం జ్ఞానచక్షుషా,
భూతప్రకృతిమోక్షం చ యే విదుర్యాన్తి తే పరమ్. 39

అర్జునా! యిట్లు దేహిదే•హాంతరమును
భూతమాయావిమోక్షమ్ము, • పూజ్యమైన
జ్ఞానదృష్టి గ్రహించెడు • జ్ఞాను లెవరొ;
వారలే పొందుదురు పర•బ్రహ్మ మెలమి. 30

# పదునాల్గవయధ్యాయము

## గుణత్రయవిభాగయోగము

పరం భూయః ప్రవక్ష్యామి జ్ఞానానాం జ్ఞానముత్తమమ్,
యద్ జ్ఞాత్వా మునయస్సర్వే పరాం సిద్ధి మితో గతాః. ౧

ఎఱిఁగి దేనిని సర్వముఁనీశ్వరులును
బ్రవిమలోత్కృష్టసిద్ధినిఁ బడసినారొ;
జ్ఞానములఁ బరమోత్తమజ్ఞాన మెదియొ
వినుమ! దానిని మరల సవిస్తరముగ. ౧

ఇదం జ్ఞానముపాశ్రిత్య మమ సాధర్మ్యమాగతాః,
సర్గేఽపి నోపజాయన్తే ప్రళయే న వ్యథన్తి చ. ౨

అర్జునా! యిట్టిజ్ఞానంబు నాశ్రయించి
ధన్యతమమగు నాదు సాధర్మ్య మొంది
జననమును బొందఁగాఁ బోరు సర్గమందు
వ్యథను గాంచఁగఁ బోవరు ప్రళయమందు. ౨

మమ యోని ర్మహద్బ్రహ్మ తస్మిన్ గర్భం దధామ్యహమ్,
సమ్భవ స్సర్వభూతానాం తతో భవతి భారత. 3

అస్మదీయమహాబ్రహ్మ మఖిలసృష్టి
కారణం బాప్రకృతియందు గర్భ మేన
యుంచుచున్నాఁడ; దానిచే నుర్వి సర్వ
భూతనివహోద్భవమ్మును బొదలు చుండు. 3

సర్వయోనిషు కౌన్తేయ ! మూర్తయ స్సమ్భవన్తి యాః,
తాసాం బ్రహ్మ మహద్యోని రహం బీజప్రదః పితా. ౪

ఓయి! కౌంతేయ! విను మెల్ల◆యోనులందు
సంభవం బందు నేమూర్తి◆చయము, వాని
కిని మహాబ్రహ్మమే యగు ◆ జనని; తండ్రి
నగుదు బీజప్రదుఁడ నైన◆యట్టి నేను. ౪

సత్త్వం రజ స్తమ ఇతి గుణాః ప్రకృతిసమ్భవాః,
నిబధ్నన్తి మహాబాహో దేహే దేహినమవ్యయమ్. ౫

ఓ మహాబాహు! ప్రకృతిచే ◆ నుద్భవించు
సత్త్వము రజమ్ము తమము నాఁ ◆ జను, గుణత్రి
తయము, దేహమ్మునందు న◆వ్యయుఁడునైన
యట్టిక్షేత్రజ్ఞు నరికట్టు◆నట్లు తోఁచు. ౫

తత్ర సత్త్వం నిర్మలత్వాత్ప్రకాశకమనామయమ్,
సుఖసంగేన బధ్నాతి జ్ఞానసఙ్గేన చానఘ. ౬

అనఘ ! తద్గుణములయం ద◆నామయంబు,
నిర్మలము, కాంతిమంతమై ◆ నెగడు నట్టి
సత్త్వగుణము; సుఖజ్ఞాన◆సంగమందుఁ
గట్టివేయును దేహి నె◆ప్పట్టునందు. ౬

రజో రాగాత్మకం విద్ధి తృష్ణాసఙ్గసముద్భవమ్,
తన్నిబధ్నాతి కౌన్తేయ! కర్మసఙ్గేన దేహినమ్. ౭

భూరితృష్ణానుసంగస • ముద్భవమ్ము
నా, రజోగుణ మనురంజ • నాత్మకం బ
టంచును గ్రహింపుమా! దేహి • నద్ది సతము
గట్టివైచును కర్మసం • గమ్ముచేత. ౭

తమ స్త్వజ్ఞానజం విద్ధి మోహనం సర్వదేహినామ్,
ప్రమాదాలస్యనిద్రాభి స్తన్నిబధ్నాతి భారత. ౮

ఎల్లదేహుల, మిగుల మో • హింపఁజేయు
నాతమోగుణ మజ్ఞాన • మందుఁ బుట్టు
వందు; నిద్రాప్రమాదమాం • ద్యముల చేతఁ
గట్టుచున్నది యిద్ది ని • క్కముగఁ బార్థ! ౮

సత్త్వం సుఖే సఞ్జయతి రజః కర్మణి భారత!
జ్ఞానమావృత్యతు తమః ప్రమాదే సఞ్జయత్యుత. ౯

సౌఖ్యములయందుఁ గూర్చును • సత్త్వగుణము,
కర్మల రజోగుణమ్ము ల • గ్నం బొనర్చు,
మహిని జ్ఞానంబుఁ గప్పి ప్ర • మాదమందుఁ
జేర్చును తమోగుణంబు వి • శేషముగను. ౯

రజ స్తమశ్చాభిభూయ స త్త్వం భవతి భారత!
రజ స్సత్త్వం తమశ్చైవ తమ స్సత్త్వం రజ స్తథా. ౧౦

విస్తరిల్లుస త్త్వమ్ము, ర॰జ స్తమోగు
ణమ్ములఁ దిరస్కరించి, ర॰జమ్ము గల్గు
తమమున త్త్వమ్ములను మీఱి, ॰ తమము నట్లె
కల్గు స త్త్వరజస్సులఁ ॰ గడకుఁ ద్రోచి. ౧౦

సర్వద్వారేషు దేహేఽస్మిన్ ప్రకాశ ఉపజాయతే,
జ్ఞానం యదా తదా విద్యాద్వివృద్ధం స త్త్వమిత్యుత. ౧౧

అనఘ! భోగాశ్రియంబైన॰యట్టి యీశ
రీరమందు, శ్రోత్రాదిక॰ద్వారములను
గల్గు నెప్పుడు జ్ఞానప్ర॰కాశ మపుడ
వృద్ధి యా స త్త్వగుణ మంచు ॰ నెఱుఁగుమయ్య! ౧౧

లోభః ప్రవృ త్తిరారమ్భః కర్మణామశమః స్పృహా,
రజ స్యేతాని జాయ న్తే వివృద్ధే భరతర్షభ. ౧౨

ఎప్పుడు రజోగుణం బభి॰వృద్ధినందు;
నప్పుడె ప్రవృ త్తియును, ప్రలో॰భానురక్తి,
శమవిహీనత్వ మిచ్ఛయు, ॰ సకలకర్మ
యత్న మను నివి సంభవ ॰ మగుచునుండు. ౧౨

అప్రకాశోఽప్రవృత్తిశ్చ ప్రమాదో మోహ ఏవ చ,
తమస్యేతాని జాయన్తే వివృద్ధే కురునందన. ౧౩

అర్జునా! యెప్పుడు తమోగు • ణాభివృద్ధి
యౌనో, యప్పట్టునందున • నప్రవృత్తి
యప్రకాశప్రమాద మో • హాదికమ్ము
లైన లక్షణములు పుట్టు • వందు చుండు. ౧౩

యదా సత్త్వే ప్రవృద్ధే తు ప్రళయం యాతి దేహభృత్,
తదోత్తమవిదాం లోకా నమలాన్ ప్రతిపద్యతే. ౧౪

సత్త్వగుణ మభివృద్ధి యౌ • సమయమందు
నర్జునా! దేహి మరణంబు • నందె నేని
యరయ నుత్తమవిదుల క • ర్హాంబులైన
ప్రవిమలంబైన లోకము • ల్బడయుచుండు. ౧౪

రజసి ప్రళయం గత్వా కర్మసఙ్గిషు జాయతే,
తథా ప్రలీనస్తమసి మూఢయోనిషు జాయతే. ౧౫

వీడఁ దనువు రజోగుణ • వృద్ధియందు
కర్మసంగులయందునఁ • గల్గుచుండు
నట్టులె, తమస్సు వృద్ధిగా • నడఁగె నేని
యుద్భవం బందుఁగా మూఢ • యోనులందు. ౧౫

కర్మణస్సుకృతస్యాహుస్సాత్త్వికం నిర్మలం ఫలమ్,
రజసస్తు ఫలం దుఃఖ మజ్ఞానం తమసః ఫలమ్. ౧౬

సత్త్వగుణకర్మఫల మతి♦సాత్త్వికంబు,
నిర్మలంబు, రజోగుణ♦కర్మఫలము
గాఢదుఃఖమ్ము, తామస♦కర్మఫలము
సమధికాజ్ఞాన మని శిష్ట♦జనమతంబు. ౧౬

సత్త్వాత్సఞ్జాయతే జ్ఞానం రజసో లోభ ఏవ చ,
ప్రమాదమోహౌ తమసో భవతోఽజ్ఞానమేవ చ. ౧౭

సదమలోన్నతజ్ఞానంబు ♦ సత్త్వమునను,
జూడ, లోభప్రవృత్తి ర♦జోగుణమున,
ఫల్గున! తమోగుణమ్మున ♦ బంధుర వి
మోహము, ప్రమాద మజ్ఞాన♦మును, జనించు. ౧౭

ఊర్ధ్వం గచ్ఛన్తి సత్త్వస్థా మధ్యే తిష్ఠన్తి రాజసాః,
జఘన్యగుణవృత్తిస్థా అధో గచ్ఛన్తి తామసాః. ౧౮

ఊర్ధ్వలోకముల్ సాత్త్వికు ♦ లొందుచుండ్రి,
మర్త్యలోకాన రాజసుల్ ♦ మనుచునుందు,
రారయ, జఘన్యగుణవృత్తు♦లైన తామ
సులు, నధోభువనమ్ములఁ ♦ జొచ్చుచుండ్రి. ౧౮

నాన్యం గుణేభ్యః కర్తారం యదా ద్రష్టాఽనుపశ్యతి,
గుణేభ్యశ్చ పరం వేత్తి మద్భావం సోఽధిగచ్ఛతి. ౧౯

ఏ సమయమందు ద్రష్ట, గు ♦ ణేతరమును
కర్తగాఁ గాంచఁడో; గుణ ♦ గణముకంటె
నితరమైనట్టివానిఁగా ♦ నెఱుఁగునో కొ-;
యాసమయమందె మద్భావ ♦ మందఁగలఁడు. ౧౯

గుణానేతానతీత్య త్రీన్ దేహీ దేహసముద్భవాన్,
జన్మమృత్యుజరాదుఃఖైర్విముక్తోఽమృతమశ్నుతే. ౨౦

ఫల్గునా! దేహి, దేహోద్భ ♦ వమ్ములైన
యీగుణత్రియమును దిర ♦ స్కృతి యొనర్చి;
జన్మమృత్యుజరాదుఃఖ ♦ సమితినుండి
ముక్తుఁడై, యమృతత్వంబుఁ ♦ బొందుచుండు. ౨౦

కైర్లిఙ్గై స్త్రీన్ గుణానేతా నతీతో భవతి ప్రభో!
కిమాచారః కథం చైతాంస్త్రీన్ గుణా నతివర్తతే. ౨౧

దాటి యీగుణముల మూఁటిఁ ♦ దనరు నాతఁ
డెట్టిచిహ్నమ్ములను నొప్పు? ♦ కృష్ణ! స్వామి!
యెట్టియాచారవంతుఁడై ♦ యొసఁగు నతఁడు?
తథ్య మీమూఁడుగుణముల ♦ దాటు టెట్లు? ౨౧

ప్రకాశం చ ప్రవృత్తిం చ మోహమేవ చ పాణ్డవ,
న ద్వేష్టి సంప్రవృత్తాని న నివృత్తాని కాఙ్క్షతి. ౨౨

అర్జునా! త్రిగుణాతీతుఁ • డైనవాఁడు
ప్రకృతిసంప్రాప్తమైన లో•భప్రకాశ
మోహములయందు ద్వేషంబుఁ • బూనబోవఁ
డెపుడు వాంఛింపఁబోఁడు ని•వృత్తములను. ౨౨

ఉదాసీనవదాసీనో గుణైర్యో న విచాల్యతే,
గుణా వర్తన్త ఇత్యేవ యోఽవతిష్ఠతి నేఙ్గతే. ౨౩

సమదుఃఖసుఖః స్వస్థ స్సమలోష్టాశ్మకాఞ్చనః,
తుల్యప్రియాఽప్రియో ధీర స్తుల్యనిన్దాత్మసంస్తుతిః. ౨౪

మానావమానయోస్తుల్యస్తుల్యో మిత్రారిపక్షయోః,
సర్వారమ్భపరిత్యాగీ గుణాతీత స్స ఉచ్యతే. ౨౫

గుణకార్యముల లక్ష్య•మును లే కుదాసీను
వలె నుండి, కాంచక • చలన మింత,
గుణములె వర్తన•మును సల్పునం చెంచి,
స్తుతినిందలందునఁ • దుల్యుఁ డగుచు,
స్వస్థుఁడై, సుఖదుఃఖ•పాషాణలోష్టరు
క్మాదుల భేదంబు • నందఁబోక,

ధీరుఁడై, గౌరవా•గౌరవమ్ములఁ బ్రియా
ప్రియములఁ సమభావ•నియతినంది,

సర్వకార్యసమారంభ•సక్తి వీడి,
మిత్రపక్షమ్మునందు న•మిత్రపక్ష
మందు సమబుద్ధిని వహించు•నట్టివాఁడె,
శ్వేతవాహన! తగు గుణా•తీతుఁ డనఁగ. ౨౩

మాం చ యోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే,
స గుణాన్సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే. ౨౬

పరివిమలంబగు నిశ్చల•భక్తితోడ
నేనరుఁడు నన్ను సేవించు; • నా నరుండు
త్రిగుణములఁ బట్టువడక న•తిక్రమించి
యర్హుఁడగు బ్రహ్మభావమ్ము • నందుటకును. ౨౮

బ్రహ్మణో హి ప్రతిష్ఠాఽహమమృతస్యావ్యయస్య చ,
శాశ్వతస్య చ ధర్మస్య సుఖస్యైకాన్తికస్య చ. ౨౭

అర్జునా! యమృతం బవ్య•యమ్మనైన
బ్రహ్మమునకును, నిత్యధ•ర్మమ్మునకును,
జలనమొందని యేకాంత•సౌఖ్యమునకు,
నేనె యాధారభూతుండ • నిశ్చయంబు. ౨౯

# పదునైదవయధ్యాయము

## పురుషోత్తమప్రాప్తియోగము

ఊర్ధ్వమూలమధశ్శాఖమశ్వత్థం ప్రాహురవ్యయమ్,
ఛన్దాంసి యస్య పర్ణాని యస్తం వేద స వేదవిత్. ౧

ఊర్ధ్వమూల మధశ్శాఖ • లౌనర, భవ్య
మైన యశ్వత్థ మవ్యయ • మనఁ దనర్చు;
వేదములు పర్ణములుగాఁగ • వెలయుదీని
నెఱుఁగు మర్త్యుండు వేదార్థ • మెఱుఁగువాఁడు. ౧

అధశ్చోర్ధ్వం చ ప్రసృతాస్తస్య శాఖా గుణప్రవృద్ధా విషయ
ప్రవాళాః,
అధశ్చ మూలా న్యనుసన్తతాని కర్మానుబన్ధీని మనుష్యలోకే.

దానికొమ్మలు గుణవివృ•ద్ధమ్ము లగుచు
విషయపల్లవములచేత • వెలయు; వేళ్లు
మర్త్యలోకకర్మానుసం•బంధములయి
క్రింద మీఁదను వ్యాప్తమ్ము • నందియుండె. ౨

న రూప మస్యేహ తథోపలభ్యతే నాన్తో నచాదిర్న చ సంప్రతిష్ఠా,
అశ్వత్థ మేనం సువిరూఢమూలమసఙ్గశస్త్రేణ దృఢేన ఛిత్త్వా. 3

దీనిరూపంబు స్థితియును • దెలియరాదు
అటులె, యెఱుఁగంగరాని వా•ద్యంతములును
దీనిమూలము సువిరూఢ•మౌ; నసంగ
శస్త్రమున దీని ఛేదించి; • సవ్యసాచి!. 3

తతః పదం తత్పరిమార్గితవ్యంయస్మిన్గతానినివర్తన్తిభూయః,
తమేవచాద్యంపురుషంప్రపద్యేయతఃప్రవృత్తిఃప్రసృతాపురాణీ.

ఏపదంబంది రాఁబోవ • రింకమీఁద,
నెవనివలన ననాదిప్ర•వృత్తి గలిగె,
నాద్యుఁడౌ నట్టిపురుషుని • యందుచుంటి
శరణమని; తత్పదంబును • నరయవలయు. ౪

నిర్మానమోహా జితసఙ్గదోషా
అధ్యాత్మనిత్యా వినివృత్తకామాః,
ద్వన్ద్వైర్విముక్తాస్సుఖదుఃఖసంజ్ఞై
ర్గచ్ఛన్త్యమూఢాః పద మవ్యయం తత్. ౫

వదలి మానంబు, మోహంబు, • వాంఛ లడఁచి,
పాసి సంగదోషముల, ద్వం•ద్వముల వీడి,
పార్థ! యధ్యాత్మనిత్యులై • పరగు జ్ఞాను
లవ్యయంబైన తత్పద • మందఁగలరు. ౫

న తద్భాసయతే సూర్యో న శశాఙ్కో న పావకః,
యద్గత్వా న నివర్తన్తే తద్ధామ పరమం మమ. ౬

భాస్కరుండును, శశియు, వై•శ్వానరుండు,
భాసిత మొనర్పఁ జాల రే•పరమపదము;
నేపదంబంది తిరిగి రా • రెన్నటికిని
నామహోత్కృష్టపదమె మ•ద్ధామ్రియంబు. ౬

మమైవాంశో జీవలోకే జీవభూతస్సనాతనః,
మనష్షష్ఠానీన్ద్రియాణి ప్రకృతిస్థాని కర్షతి. ౭

జీవలోకమ్మునందున ♦ జీవభూత
మై, సనాతనమైన నా♦యంశ మెపుడు
సరవిఁ బ్రకృతిస్థమై మన♦ష్షష్ఠమైన
యింద్రియముల నాకర్షించు ♦ నింద్రతనయ! ౭

శరీరం యదవాప్నోతి యచ్చాప్యుత్క్రామతీశ్వరః,
గృహీత్వైతాని సంయాతి వాయుర్గన్ధానివాశయాత్. ౮

ఏశరీరంబు నందునో ♦ యీశ్వరుండు
ఎద్ది విడనాడునో; యప్పు♦ డింద్రియములఁ
గైకొనియు నేగు; గాడ్పు సు♦గంధములను
సంగ్రహించెడిగతి సుమ♦చయమునుండి. ౮

శ్రోత్రం చక్షుః స్పర్శనం చ రసనం ఘ్రాణమేవ చ,
అధిష్ఠాయ మనశ్చాయం విషయా నుపసేవతే. ౯

చక్షువును, శ్రవణమ్మును, ♦ స్పర్శనంబు,
ఘ్రాణమును, రసనమ్మును, ♦ మానసంబు,
జీవుఁ డెంతేనియును నధి♦ష్ఠించి వీనిఁ
బార్థ! విషయోపసేవను ♦ బరగుచుండు. ౯

ఉత్క్రామన్తం స్థితం వాపి భుఞ్జానం వా గుణాన్వితమ్,
విమూఢా నానుపశ్యన్తి పశ్యన్తి జ్ఞానచక్షుషః. ౧౦

వరుస నుత్క్రమణం బొందు • వానిగాఁగ,
స్థితునిఁగా, భోక్తగా, గుణా • న్వితునిగాఁగ
మూఢులగువారు తిలకింపఁ • బోరు; కాని
యరయుదురు జ్ఞానచక్షువు • లైనవారు. ౧౦

యతన్తో యోగినశ్చైనం పశ్యన్త్యాత్మన్యవస్థితమ్,
యతన్తోఽప్యకృతాత్మానో నైనం పశ్యన్త్యచేతసః. ౧౧

యత్నమొనరించు చీయాత్మ • నాత్మయందె
యున్నదానిగఁ గాంతురు • యోగివరులు;
అర్జునా! యకృతాత్ములౌ • నజ్ఞులిద్ది
కడఁగి యత్నించుచున్నను • గాంచలేరు. ౧౧

యదాదిత్యగతం తేజో జగద్భాసయతేఽఖిలమ్,
యచ్చన్ద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధి మామకమ్. ౧౨

అరుణగతమైన యేతేజ • మఖిలలోక
ములఁ బ్రకాశమ్మునందఁగా • సలుపుచుండు;
నెద్ది చంద్రాగ్నులందున • నెసఁగుచుండు;
నద్ది తెలియుమ! యస్మదీ • యం బటంచు. ౧౨

గామావిశ్య చ భూతాని ధారయామ్యహమోజసా.
పుష్ణామి చౌషధీస్సర్వాస్సోమో భూత్వా రసాత్మకః. ౧౩

జగతినిం జేరి యస్మదో • జస్సుచేత
నేన, భూతమ్ములను ధరి • యించుచుంటి;
విజయ! రసరూపకుండైన • విధుఁడ నగుచు
నెల్లయోషధిపోషణ • మే నొనర్తు. ౧౩

అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః,
ప్రాణాపానసమాయుక్తః పచామ్యన్నం చతుర్విధమ్. ౧౪

అన్నిప్రాణులదేహమ్ము • లాశ్రయించి
ప్రాణము నపానముం గూడి, • వహ్ని నేన
యగుచు, వారిచతుర్విధా • హారములను
బచన మొనరించుచున్నాఁడ • పాండుపుత్ర! ౧౪

సర్వస్య చాహం హృది సన్నివిష్టో
మత్తస్స్మృతి ర్జ్ఞానమపోహనం చ,
వేదైశ్చ సర్వైరహమేవ వేద్యో
వేదాన్తకృద్వేదవిదేవ చాహమ్. ౧౫

అన్నిప్రాణులహృదయమ్ము • లందు నుంటి
స్మృతియు, జ్ఞానం బపోహ నా • చేతఁ గలుగు,
సర్వవేదాంతకర్తను, • సర్వవేద
వేద్యుఁడను, వేదవిదుఁడను, • విజయ! నేను. ౧౫

ద్వావిమౌ పురుషౌ లోకే క్షరశ్చాక్షర ఏవ చ,
క్షరస్సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే. ౧౬

క్షరుఁడు నక్షరుఁ డంచు లోకమ్మునందు
వీర లిరువురు పురుషులు, వీరిలోన
నఖిలభూతౌఘమే క్షరుఁ, డక్షరుండు
నెన్న కూటస్థుఁడని వచియింపఁబడును. ౧౬

ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః,
యో లోకత్రయమావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః. ౧౭

వీరి కన్యుఁ డుత్తముఁ డయి వెలయునట్టి
పురుషుఁడే పరమాత్మ యం చెఱుఁగు మయ్య!
యెల్లజగములఁ జేరి భరించు నతఁడు;
నతఁడె యవ్యయుఁ డీశ్వరుఁ డనఁ జెలంగు. ౧౭

యస్మాత్క్షరమతీతోఽహమక్షరాదపి చోత్తమః,
అతోఽస్మి లోకే వేదే చ ప్రథితః పురుషోత్తమః. ౧౮

కవ్వడీ! క్షరాక్షరులను కడకుఁ ద్రోసి
యుత్తముఁడనయి యెంతయో యొప్పియుంట
నెల్లలోకమ్ములందున శ్రుతులయందు
ప్రథితపురుషోత్తముఁడనంచుఁ బరగి యుంటి. ౧౮

యో మామేవ మసమ్మూఢో జానాతి పురుషోత్తమమ్,
స సర్వవిద్భజతి మాం సర్వభావేన భారత ! ౧౯

భారత! యెవండు సమ్మోహ • పథముఁ బాసి
యెఱుఁగుఁ బురుషోత్తముఁడనఁగు • నిట్టి నన్ను,
వాఁడు సర్వజ్ఞుఁడై యెల్ల • భావములను
బొందుచున్నాఁడు నన్నె, యా • నందమునను. ౧౯

ఇతి గుహ్యతమం శాస్త్రమిదముక్తం మయాఽనఘ,
ఏతద్బుద్ధ్వా బుద్ధిమాన్ స్యాత్కృతకృత్యశ్చ భారత. ౨౦

అనఘ! భారత! మిగుల ర • హస్యమైన
యీమహాశాస్త్రమే వచి • యించినాఁడ,
నిటుల నిద్దానిఁ జక్కఁగా • నెవ్వఁ డెఱుఁగు
నతఁడు జ్ఞానియుఁ గృతకృత్యుఁ • డౌఁ దలంప. ౨౦

# పదునాఱవ యధ్యాయము

## దైవాసురసంపద్విభాగయోగము

అభయం సత్త్వసంశుద్ధి ర్జ్ఞానయోగవ్యవస్థితిః,
దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయ స్తప ఆర్జవమ్. ౧

అహింసా సత్యమక్రోధ స్త్యాగ శ్శాన్తి రపైశునమ్,
దయా భూతేష్వలోలత్వం మార్దవం హ్రీ రచాపలమ్. ౨

తేజః క్షమా ధృతి శ్శౌచమద్రోహో నాభిమానితా,
భవన్తి సమ్పదం దైవీ మభిజాతస్య భారత! ౩

భయములేమియు, సత్త్వభావసంశుద్ధియు,
జ్ఞానయోగస్థితి, దానరతియు,
యజ్ఞమ్ము, దమము, వేదాధ్యయనమ్మును,
ధర్మవర్తనమును, దపము, జపము,
సత్యం బహింసయు, శాంతియుం, బిశునత్వ
రాహిత్యమును, లజ్జ, ప్రాణిదయయు,
త్యాగ మక్రోధమ్ము, రాగవైముఖ్యమ్ము,
సన్మృదుత్వమ్ము, నచాపలమ్ము,
క్షమయు, ధైర్యమ్ము, తేజమ్ము, శౌచవృత్తి,
ద్రోహబాహ్యమ్ము, గర్వమ్ముం దొలంగియుండు
టాదియౌ లక్షణములు దేవాంశ నుద్భ
వించువారలయందున మించుచుండు. ౧

దంభో దర్పోఽభిమానశ్చ క్రోధః పారుష్యమేవ చ,
అజ్ఞానం చాభిజాతస్య పార్థ! సంపద మాసురీమ్. ౪

దంభ మభిమాన మజ్ఞాన•దర్పములును,
గ్రోధమును, బరుషత్వమ్ము, • గుటిలతయును,
అసురసంబంధమగా సంప•దాభిజాతుఁ
డైనవానికిఁ గల్గుఁ బృ•థాత్మజాత! ౨

దైవీ సంపద్విమోక్షాయ నిబంధాయాసురీ మతా,
మాశుచస్సంపదం దైవీ మభిజాతోఽసి పాండవ. ౫

పాండవా! దేవతాంశమ్ము • ప్రథిత మోక్ష
సమ్మతంబగు, రాక్షసాం•శమ్ము బంధ
సమ్మతంబగు, దేవతాం•శమున జన్మ
మీవు గంటివి; దుఃఖ మ్మే•దేల? నీకు. ౩

ద్వౌ భూతసర్గౌ లోకేఽస్మిన్ దైవ ఆసుర ఏవ చ,
దైవో విస్తరశః ప్రోక్త ఆసురం పార్థ! మే శృణు. ౬

ఆసురమ్మును, దైవత • మనఁగ, నీజ
గమున ద్వివిధమ్ము భూతస•ర్గమ్ము దనరు;
దైవతము విస్తరముగఁ బ్రో•క్తమ్ము నయ్యె.
నింక నాసురమును వచి•యింతు వినుమ! ౪

ప్రవృత్తిం చ నివృత్తిం చ జనా న విదురాసురాః,
న శౌచం నాపి చాచారో న సత్యం తేషు విద్యతే. ౭

అసురభావమ్ముఁ గల్గిన యట్టిజనులు
నెఱుఁగలేరు ప్రవృత్తి ని వృత్తి నుంత;
వారియందున శౌచ మా చారములును
సత్య ముండఁగఁబోదు లే శంబుఁ గూడ. ౫

అసత్య మప్రతిష్ఠం తే జగ దాహు రనీశ్వరమ్,
అపరస్పరసంభూతం కిమన్య త్కామహైతుకమ్. ౮

ఈజగ మసూనృతమ్ము, న నీశ్వరమ్ము,
నప్రతిష్ఠ మన్యోన్యజ న్యమ్ము గాదు,
యన్య మేమున్నదా, కామ హైతుకం బ
టంచు వాదింతురో, రాక్ష సాంశులెల్ల. ౬

ఏతాం దృష్టి మవష్టభ్య నష్టాత్మానో౽ల్పబుద్ధయః,
ప్రభవం త్యుగ్రకర్మాణః క్షయాయ జగతో౽హితాః. ౯

అకట! యిాజ్ఞాన మొంది న ష్టాత్ము లగుచు
నల్పబుద్ధి మహోగ్రక ర్మానురక్తి
లోకకంటకులై; సర్వ లోకనాశ
నార్థ ముత్పత్తి నొందుదు రయ్య ! వారు. ౭

కామమాశ్రిత్య దుష్పూరం దంభమానమదాన్వితాః,
మోహాద్గృహీత్వాఽసద్గ్రాహాన్ ప్రవర్తంతేఽశుచివ్రతాః.

అనఘ! దుష్పూరకామంబు • నాశ్రయించి,
యరయక గ్రహించి యపరిగ్రహములెల్ల
మోహమున; నశుచివ్రత•బుద్ధు లగుచు
దంభమానమదమ్ములఁ • దగిలియుందు్రు. ౧౦

చింతామపరిమేయాం చ ప్రళయాంతాముపాశ్రితాః,
కామోపభోగపరమా ఏతావ దితి నిశ్చితాః. ౧౧

అపరిమితమును, బ్రళయాంత • మైనచింత
నాశ్రయించి, కామోపభో•గానురక్తు
లై, మహోత్కృష్ట మిద్దియే • యంచు నిశ్చ
యమ్ముగలవారలై యుందు • రయ్య! వారు. ౧

ఆశాపాశశతైర్బద్ధాః కామక్రోధపరాయణాః,
ఈహంతే కామభోగార్థమన్యాయేనార్థసంచయాన్. ౧౨

ఫల్గునా! వివిధాశల • బద్ధు లగుచుఁ,
దగులువడి కామమునను క్రో•ధమున సక్తి,
కామభోగార్థ మన్యాయ•కార్యములను
నర్థనిచయం బపేక్షింతు • రధము లగుచు. ౧౦

ఇదమద్య మయా లబ్ధమిమం ప్రాప్స్యే మనోరథమ్,
ఇద మస్తీద మపి మే భవిష్యతి పునర్ధనమ్. ౧౩

ఇప్పు డీధన మే గడి•యించినాఁడ;
నీధనంబెల్లఁ గలదు, నా • కింతధనము
మఱల లభియింపఁగల దను•మాన మేల?
యస్మదీయసంకల్పము • నందఁగలను. ౧౧

అసౌ మయా హతశ్శత్రుర్హనిష్యే చాపరానపి,
ఈశ్వరోఽహమహం భోగీ సిద్ధోఽహం బలవాన్ సుఖీ. ౧౪
ఆఢ్యోఽభిజనవానస్మి కోఽన్యోఽస్తి సదృశో మయా,
యక్ష్యే దాస్యామి మోదిష్య ఇత్యజ్ఞానవిమోహితాః. ౧౫
అనేకచిత్తవిభ్రాంతా మోహజాలసమావృతాః,
ప్రసక్తాః కామభోగేషు పతంతి నరకేఽశుచౌ. ౧౬

పరిమార్చినాఁడ నీ•పగతుని నే, నన్య
శత్రుజనమ్ములఁ • జంపఁగలను,
అధిపుండఁ, బృథులబ•లాఢ్యుండ, సంపత్క-
రుండను, భోగవం•తుండ, సుఖిని
యన్వయశ్రేష్ఠుండ, • నతిధనవంతుఁడ,
నన్యులం దెవరు నా • కగుదు రీడు
సంతసింపఁగలాఁడ, • జన్నం బొనర్చెద,
నెద్ది కాంక్షించిన • నీయఁగలను,

మఱియు చీవిధి యజ్ఞాన•మోహితులయి,
మోహజాలాత్తులై, కామ•భోగములను
రక్తినందుచుఁ, జిత్తవి•భ్రాంతులగుచు,
భయదనరకమ్మునందునఁ • బడుచునుంద్రు. ౧౭

ఆత్మసంభావితాః స్తబ్ధా ధనమానమదాన్వితాః,
యజంతే నామయజ్ఞైస్తే దంభేనావిధిపూర్వకమ్. ౧౭

దర్పవ్యమానమదాంధులై; • స్తబ్ధులగుచు,
నెమ్మని స్తుతించుకొంచును • దమ్ముఁ దామె
దంభమునకయి విధివిరు•ద్ధమ్ముగాను,
సల్పుదురు నామమాత్రయ•జ్ఞముల నెపుడు. ౧౭

అహంకారం బలం దర్పం కామం క్రోధం చ సంశ్రితాః,
మామాత్మపరదేహేషు ప్రద్విషంతో౽భ్యసూయకాః. ౧౮

తానహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్,
క్షిపామ్యజస్రమశుభా నాసురీష్వేవ యోనిషు. ౧౯

బలమును గ్రోధదర్పములు• బంధురకామ మహంకృతుల్సదా
యొలసియు, స్వేతరాంగముల•నొప్పెడినాయెడవై రమూనుచున్;
బలసియసూయఁ,గ్రూరులశు•భాఢ్యులు ద్వేషులు నౌనరాధమా
వళిఁ జెడుసంసృతిన్ నిలుపు•వాఁడ నజస్రము దైత్యయోనులన్.

ఆసురీం యోని మాపన్నా మూఢా జన్మని జన్మని,
మామప్రాప్యైవ కౌంతేయ తతో యాంత్యధమాం గతిమ్.

అర్జునా! మూఢులౌ వీర • లసురయోను
లందుచును; జన్మజన్మంబు•లందు నన్ను
నందఁగా లేక; జెందెద • రంతకంతె
కధికతరనీచగతుల య•థార్థముగను. ౧౫

త్రివిధం నరకస్యేదం ద్వారం నాశన మాత్మనః,
కామః క్రోధ స్తథా లోభ స్తస్మాదేత త్త్రయం త్యజేత్. ౨౧

క్రోధమును మఱి కామమ్ము • లోభ మనఁగఁ
బరగు త్రివిధమ్ము, లియ్యవి • నరకమునకు
ద్వారములు, నాత్మనాశన•కారణములు,
గాన, త్యజియింపఁగావలె • వీని నీవు. ౧౬

ఏతైర్విముక్తః కౌంతేయ! తమోద్వారై స్త్రిభిర్నరః,
ఆచరత్యాత్మనః శ్రేయ స్తతో యాతి పరాం గతిమ్. ౨౨

ఓయి! కౌంతేయ! యీ విధి • నొప్పుత్రివిధ
ఘోరనరకకవాటము • లిమ్ములు నాతఁ
డాచరించు నాత్మశ్రేయ, • మంత మీఁద
స్థిరతరోత్కృష్టమాగతిఁ • జెందఁగలఁడు. ౧౭

యశ్శాస్త్రవిధిముత్సృజ్య వర్తతే కామకారతః,
న స సిద్ధిమవాప్నోతి న సుఖం న పరాం గతిమ్. ౨౩

ఎవఁడు శాస్త్రోక్తమౌవిధు • లెల్ల వీడి
వర్తన మొనర్చునో; యిచ్చ • వచ్చినట్లు
వాఁడు సుఖమును సిద్ధినిఁ • బడయఁబోవఁ,
డింక మోక్షపదంబన • నెట్టులబ్బు? ౧౮

తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ,
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తుమిహార్హసి. ౨౪

కవ్వడీ! కార్యమునకు న • కార్యమునకు
నగును శాస్త్రంబె ప్రామాణ్య • మన్నిగతులఁ;
గాన శాస్త్రవిధానోక్త • కర్మకాండ
మెఱిఁగియు నొనర్పఁగాఁదగు • దీవు తలఁప. ౧౯

# పదునేడవయధ్యాయము

## శ్రద్ధాత్రయవిభాగయోగము

యే శాస్త్రవిధిముత్సృజ్య యజంతే శ్రద్ధయాఽన్వితాః,
తేషాం నిష్ఠా తు కా కృష్ణ! సత్త్వమాహో రజస్తమః. ౧

ఎవరు శాస్త్రవిధానంబు • నెల్ల వీడి,
సాంప్రదాయానుసారమౌ • శ్రద్ధతోడ
నెలమి పూజింతురో; వారి • దెట్టినిష్ఠ?
సాత్త్వికమ? రాజసమ? తామ•సంబ? కృష్ణ! ౧

త్రివిధా భవతి శ్రద్ధా దేహినాం సా స్వభావజా,
సాత్త్వికీ రాజసీ చైవ తామసీ చేతి తాం శృణు. ౨

ప్రాణితతికి స్వభావజ•మైన శ్రద్ధ
సాత్త్వికము రాజసము తామ•సం బనంగఁ
దనరుచుండును మూఁడువి•ధాలఁ బార్థ!
వినుమ, తద్విధమెల్లను • వినుచువాఁడ. ౨

సత్త్వానురూపా సర్వస్య శ్రద్ధా భవతి భారత!
శ్రద్ధామయోఽయం పురుషో యో యచ్ఛ్రద్ధస్స ఏవ సః. 3

ప్రాణులకును సత్త్వానురూ•పంబు నగుచుఁ
దనరు శ్రద్ధ; పురుషుఁడు శ్ర•ద్ధామయుండు,
ఎట్టి యాస్తిక్యబుద్ధిచే • నెవఁడు బరగు
నదియె ప్రాముఖ్యమై వాని • కలరుచుండు. 3

యజంతే సాత్త్వికా దేవాన్ యక్షరక్షాంసి రాజసాః,
ప్రేతాన్ భూతగణాంశ్చాన్యే యజంతే తామసా జనాః. ౪

సాత్త్వికులు శ్రద్ధతో దేవతలనుగూర్చి
రాజసులు యక్షరాక్షసరాజిఁ గూర్చి
తామసులు భూతములను బ్రేతములఁ గూర్చి
యర్చన మొనర్చుచుందురి పృథాత్మజాత! ౪

అశాస్త్రవిహితం ఘోరం తప్యంతే యే తపో జనాః,
దంభాహంకారసంయుక్తాః కామరాగబలాన్వితాః. ౫
కర్శయంత శ్శరీరస్థం భూతగ్రామ మచేతసః,
మాం చైవాంతశ్శరీరస్థం తాన్ విద్ధ్యాసురనిశ్చయాన్. ౬

అనయము కామరాగము లహంకృతిదంభబలమ్ములొంది యే
జనములు, సల్పుచుండెద రశాస్త్రహితమ్మును ఘోరమౌ తపం
బును, గనలేక; లోనిమెయిఁబొల్చెడినన్నును భూతకోటి నె
ల్లను బడలింత్రు; వారలను రాక్షసనిశ్చయులం చెఱుంగుమా!

ఆహార స్త్వపి సర్వస్య త్రివిధో భవతి ప్రియః,
యజ్ఞ స్తప స్తథా దానం తేషాం భేదమిమం శృణు. ౭

అఖిలభూతములకును నాహారములు, ప్రి
యమ్ము లగుచున్నయవి త్రివిధమ్ములుగను;
యజ్ఞము తపమ్ము దానమ్ము నట్లె ప్రియము
లౌను, నేతద్విభేదమ్ము నాలకింపు! ౬

ఆయుస్సత్త్వబలారోగ్యసుఖప్రీతివివర్ధనాః,
రస్యాః స్నిగ్ధాః స్థిరా హృద్యా ఆహారాస్సాత్త్వికప్రియాః. ౮

సరసములు ఘృతయుతములు • స్థిరతరములు
నాయురారోగ్యసత్త్వబ•లాభివృద్ధి
కరములును, ప్రీతిసత్సుఖా•కరము లౌ ప
దార్థములు సాత్త్వికప్రియ•తరము లగయ. ౭

కట్వామ్లలవణాత్యుష్ణతీక్ష్ణరూక్షవిదాహినః,
ఆహారా రాజసస్యేష్టా దుఃఖశోకామయప్రదాః. ౯

పులుసు చేఁ దుప్పు కారమ్ము • గలిగి, యధిక
రూక్షతీక్ష్ణవిదాహసం•రూఢమగుచు,
శోకదుఃఖామయమ్ములఁ • గాకరమగు,
భోజనాదిక మిష్టమ్ము • రాజసులకు. ౮

యాతయామం గతరసం పూతి పర్యుషితం చ యత్,
ఉచ్ఛిష్టమపి చామేధ్యం భోజనం తామసప్రియమ్. ౧౦

యాతయామమ్ము, నుచ్ఛిష్ట•మైనయదియు,
సారహీనమ్ము, దుర్గంధ•సంయుతమ్ము,
చలిదియును, నపవిత్రమై, • చెలఁగునదియుఁ
దామసులకును హితపదా•ర్థమ్ము విజయ! ౯

అఫలాకాంక్షిభి ర్యజ్ఞో విధిదృష్టో య ఇజ్యతే,
యష్టవ్య మేవేతి మనస్సమాధాయ స సాత్త్వికః. ౧౧

శాస్త్రవిహితమ్మునైన య • జ్ఞమ్ము చేయఁ
దగు నటంచును మది సమా • ధాన మొంది;
ఫలము నించుక కోరక • సలుపఁబడెడు
యజ్ఞమే, సాత్త్వికం బని • రార్యవరులు. ౧౦

అభిసంధాయ తు ఫలం దంభార్థమపి చైవ యత్,
ఇజ్యతే భరతశ్రేష్ఠ! తం యజ్ఞం విద్ధి రాజసమ్. ౧౨

ఊహ యొనరించి సత్ఫల • మొందుటకును,
ఔర ! ప్రకటించుటకును దం • భాతిశయము,
నాచరించు యజ్ఞమ్ము పృ • థాత్మజాత !
తెలియుమా ! రాజసం బని • తెల్లముగను. ౧౧

విధిహీన మసృష్టాన్నం మంత్రహీనమదక్షిణమ్,
శ్రద్ధావిరహితం యజ్ఞం తామసం పరిచక్షతే. ౧౩

విధివిహీనమ్ము, విశ్వాస • విరహితమ్ము,
మాన్యదక్షిణరహిత మ్మ • మంత్రికమ్ము,
నన్నదానమ్ము శూన్యమై • యలరునట్టి
యజ్ఞమే తామసంబని • యార్యమతము. ౧౨

దేవద్విజగురుప్రాజ్ఞపూజనం శౌచ మార్జవమ్,
బ్రహ్మచర్య మహింసా చ శారీరం తప ఉచ్యతే. ౧౪

ద్విజుల గురువులఁ బ్రాజ్ఞుల ♦ దేవతలను
గొలిచి, శౌచార్జవంబులఁ ♦ జెలఁగియుంట,
బ్రహ్మచర్యం బహింసయు ♦ వదలకుంట,
దైహికం బైనతపమని ♦ తలఁపుమయ్య! ౧౩

అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితం చ యత్,
స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే. ౧౫

ప్రియహితమును, సత్యమ్మును,
నయము, ననుద్వేగకరము, ♦ నౌ నుడి, వేదా
ధ్యయనాభ్యసనమ్మును, వా
ఙ్మయరూపతపం బటంచు ♦ మహితాత్ము లిలన్. ౧౪

మనఃప్రసాదః సౌమ్యత్వం మౌన మాత్మవినిగ్రహః,
భావసంశుద్ధి రిత్యేత త్తపో మానస ముచ్యతే. ౧౬

పార్థ! చిత్తప్రసాదమ్ము, ♦ భావశుద్ధి,
సౌమ్యమగు వర్తనంబును, ♦ సంతసంబు,
మౌన మాత్మనిగ్రహమును, ♦ మానసికత
పం బటంచు వచించిరి ♦ ప్రాజ్ఞవితతి. ౧౫

శ్రద్ధయా పరయా తప్తం తపస్తత్త్రివిధం నరైః,
అఫలాకాంక్షిభి ర్యుక్తైః సాత్త్వికం పరిచక్షతే. ౧౭

అర్జునా! యమితోత్కృష్ట♦మైన శ్రద్ధ
నాశ సేయక ఫలిత మా♦వంత యేనిఁ
దివిరి యోగులొనర్చు నీ♦త్రివిధమైన
తపమె సాత్త్వికమంచును ♦ తద్జ్ఞమతము. ౧౬

సత్కారమానపూజార్థం తపో దంభేన చైవ యత్,
క్రియతే తదిహ ప్రోక్తం రాజసం చల మధ్రువమ్. ౧౮

జగతి నేతపంబు ♦ సత్కారగారవా
ర్చనములొంద దంభ♦మున నొనర్చు
నమితచంచలమ్ము ♦ నధ్రువమ్మైన యా
తపమె, రాజసమ్ము ♦ ధన్యచరిత! ౧౭

మూఢగ్రాహేణాత్మనో యత్పీడయా క్రియతే తపః,
పరస్యోత్సాదనార్థం వా తత్తామస ముదాహృతమ్. ౧౯

అనఘ! కుంతీకుమార! మౌ♦ఢ్యంబుతోడ
నాత్మబాధాకరంబును, ♦ నన్యజనుల
కధికమౌ క్లేశములఁ గూర్చ, ♦ నాచరించు
తపమె; తామస మందురు ♦ తత్త్వవిదులు. ౧౮

దాతవ్య మితి యద్దానం దీయతేఽనుపకారిణే,
దేశే కాలే చ పాత్రే చ తద్దానం సాత్త్వికం స్మృతమ్. ౨౦

దేశకాలపాత్రంబులఁ • దెలిసికొనియు,
నీయఁగాఁదగు నంచు నూహించి మదిని;
ననుపకారుల కిచ్చెడు • నట్టిదాన
మును వచించిరి సాత్త్విక • మనుచు బుధులు. ౧౯

యత్తు ప్రత్యుపకారార్థం ఫలముద్దిశ్య వా పునః,
దీయతే చ పరిక్లిష్టం తద్దానం రాజసం స్మృతమ్. ౨౧

పార్థ! ప్రత్యుపకారంబు • వాంఛజేసి
గాని, ఫలమును కాంక్షించి • గాని, యాత్మ
నొచ్చుకొం చన్యజనముల • కిచ్చునట్టి
దానమే, రాజసంబని • జ్ఞాను లనిరి. ౨౦

అదేశకాలే యద్దాన మపాత్రేభ్యశ్చ దీయతే,
అసత్కృత మవజ్ఞాతం తత్తామస ముదాహృతమ్. ౨౨

దేశకాలమ్ము లొక్కింత • తెలియఁబోక,
నీయఁదగనట్టివారికి • నిచ్చునదియు,
కర మసత్కృత మవమాన•కరమునైన
దానమును, దామసం బండ్రు • తత్త్వవిదులు. ౨౧

ఓం తత్సదితి నిర్దేశో బ్రహ్మణస్త్రివిధ స్స్మృతః,
బ్రాహ్మణా స్తేన వేదాశ్చ యజ్ఞాశ్చ విహితాః పురా. ౨౩

శత్రునందన! "ఓమ్" "తత్తు" • "సత్తు" లనఁగఁ
ద్రివిధములుగ బ్రహ్మంబు ని•ర్దేశమయ్యె,
దానిచే బ్రాహ్మణులును, వే•దంబులెల్ల,
యజ్ఞములు, విహితములయ్యె • నాదియందు. ౨౨

తస్మాదోమిత్యుదాహృత్య యజ్ఞదానతపః క్రియాః,
ప్రవర్తంతే విధానోక్తా స్సతతం బ్రహ్మవాదినామ్. ౨౪

అర్జునా! కాన, శాస్త్రోక్త • మైనయట్టి
యజ్ఞదానతపఃక్రియ • లాచరింపఁ
గడఁగుతఱి, బ్రహ్మవాదు లోం•కార మాది
నుచ్చరించి, యారంభింతు • రొప్పుగాను. ౨౩

తదిత్యనభిసంధాయ ఫలం యజ్ఞతపఃక్రియాః,
దానక్రియాశ్చ వివిధాః క్రియంతే మోక్షకాంక్షిభిః. ౨౫

ఫలము నాశింపకయ మోక్ష•పరులచేత
యజ్ఞదానతపఃక్రియ • లాచరింప
మొదలిడెడు వేళ, తత్ పద•మును వచించి
సలుపుచుందురు నిక్క; మో•సవ్యసాచి! ౨౪

సద్భావే సాధుభావే చ సదిత్యేతత్ప్రయుజ్యతే,
ప్రశస్తే కర్మణి తథా సచ్ఛబ్దః పార్థ! యుజ్యతే. ౨౬

పార్థ! సద్భావమున, సాధుభావమందు,
"సత్"పదము వాడఁబడును నిజమ్ముగాను;
అట్టులె, ప్రశస్తకర్మంబులందుఁగూడ
వాడుచుండెద రద్దాని బ్రహ్మవిదులు. ౨౫

యజ్ఞే తపసి దానే చ స్థితి స్సదితి చోచ్యతే,
కర్మ చైవ తదర్థీయం సదిత్యేవాభిధీయతే. ౨౭

యజ్ఞములయందు, దానంబులందుఁ, దపము
లందుఁగల నిష్ఠ "సత్" అన నలరుచుండు;
మఱియును దదర్థమైన కర్మంబులెల్ల
సత్తని వచింపుచుందురు శాస్త్రవిదులు. ౨౬

అశ్రద్ధయా హుతం దత్తం తపస్తప్తం కృతం చ యత్,
అస దిత్యుచ్యతే పార్థ న చ తత్ప్రేత్య నో ఇహ. ౨౮

సత్యముగ, శ్రద్ధలేకుండ సలుపఁబడిన
దానమేని, హుతంబేనిఁ, దపమయేని,
నాసమస్తం బసత్తని యార్యమతము
ఇహపరమ్ముల నది ఫలియింపఁబోదు. ౨౭

# పదునెనిమిదవయధ్యాయము

## మోక్షసన్న్యాసయోగము

సన్న్యాసస్య మహాబాహో తత్త్వమిచ్ఛామి వేదితుమ్,
త్యాగస్య చ హృషీకేశ పృథక్కేశినిషూదన. ౧

ఓహృషీకేశ! శ్రీకృష్ణ! యోగబలాఢ్య!
త్యాగసన్న్యాసవిషయతత్త్వం బదెల్లఁ
దెలియ వేఱ్వేఱుగా నిచ్చ గలిగెఁ గాన;
ఆనతీయఁగదే సత్కృపాంబురాశి! ౧

కామ్యానాం కర్మణాం న్యాసం సన్న్యాసం కవయో విదుః,
సర్వకర్మఫలత్యాగం ప్రాహుస్త్యాగం విచక్షణాః. ౨

కామ్యకర్మసన్న్యాసంబె కవివృషభులు
అర్జునా! పల్కుచుందురి సన్న్యాస మంచు
నఖిలకర్మఫలమ్ముల త్యాగ మెల్లఁ
ద్యాగమంచు వచింతురు తత్త్వవిదులు. ౨

త్యాజ్యం దోషవదిత్యేకే కర్మ ప్రాహుర్మనీషిణః,
యజ్ఞదానతపఃకర్మ న త్యాజ్య మితి చాపరే. ౩

కర్మ దోషయుతము గాన, కొందఱు బుధుల్
విడువఁదగినదంచు నుడువుచుందురి
యజ్ఞదానతపము లనఁబడు కర్మము
త్యాజ్యమంచుఁ గొంద ఱనుచునుందురి. ౩

నిశ్చయం శృణు మే తత్ర త్యాగే భరతసత్తమ!
త్యాగో హి పురుషవ్యాఘ్ర త్రివిధస్సంప్రకీర్తితః. ౪

భరతవంశప్రదీప! యో ♦ పురుషవర్య!
వినుము తెలిపెద నాత్యాగ♦విషయమున, మ
దీయసంపూర్ణనిశ్చయ ♦ మోయి! పార్థ!
త్యాగము వచింపఁబడె త్రి♦విధము లనుచు. ౪

యజ్ఞదానతపఃకర్మ న త్యాజ్యం కార్యమేవ తత్,
యజ్ఞో దానం తపశ్చైవ పావనాని మనీషిణామ్. ౫

యజ్ఞదానతపోరూప♦మైన కర్మ
మనుసరణయోగ్య మగును, త్యా♦జ్యంబు గాదు
దానమును యజ్ఞమ్ము ♦ తపము నరయ
పావనమ్ము లవెంతయో ♦ పండితులకు. ౫

ఏతాన్యపి తు కర్మాణి సంగం త్యక్త్వా ఫలాని చ,
కర్తవ్యానీతి మే పార్థ నిశ్చితం మతముత్తమమ్. ౬

కవ్వడీ! సతతం బిట్టి ♦ కర్మములను
సంగఫలముల వీడి ని♦శ్చయముగాను
ఆచరింపఁగ నర్హమ్ము ♦ లౌను జూవె!
యిదియె యోగ్యమతం బని ♦ యెంచువాఁడ. ౬

నియతస్య తు సన్న్యాసః కర్మణో నోపపద్యతే,
మోహాత్తస్య పరిత్యాగ స్తామసః పరికీర్తితః. ౭

విహితమును, నియతమ్మునై ♦ వెలయు కర్మ
సన్న్యసింపఁగ నేరికిఁ ♦ జనదు చనదు
విజయ ! మోహమ్ముచే దాని ♦ విడిచెనేని;
యట్టిత్యాగంబు తామసం ♦ బనఁగఁ దగును. ౭

దుఃఖమిత్యేవ యత్కర్మ కాయక్లేశభయాత్త్యజేత్,
స కృత్వా రాజసం త్యాగం నైవ త్యాగఫలం లభేత్. ౮

కాయకష్టభయమ్మునఁ, ♦ గర్మ మెవ్వఁ
డార్తికరమంచుఁ ద్యజియించు; ♦ నట్టివాని
త్యాగ మరయఁగ గాజస♦త్యాగ మగును
త్యాగఫల మించు కందఁడు ♦ దానివలన. ౮

కార్య మిత్యేవ యత్కర్మ నియతం క్రియతేఽర్జున !
సంగం త్యక్త్వా ఫలం చైవ స త్యాగస్సాత్త్వికో మతః. ౯

సంగఫలముల నెల్లను ♦ సన్న్యసించి;
యే నియతకర్మమును జేయ ♦ నౌ నటంచు
సలుపఁబడు, నట్టి త్యాగమే ♦ సాత్త్వికంబు
తెలియు మది నామతం బని ♦ తెల్లముగను. ౯

న ద్వేష్ట్యకుశలం కర్మ కుశలే నానుషజ్జతే,
త్యాగీ సత్త్వసమావిష్టో మేధావీ ఛిన్నసంశయః. ౧౦

సంశయము లేనివాఁడును, ♦ సాత్త్వికుండు,
నధిక మేధావియును, జ్ఞాని♦ యైనవాఁడు,
నశుభకర్మములను ద్వేష♦ మందఁబోడు;
చెందఁ డాసక్తి సత్కర్మ ♦ మందు నెపుడు. ౧౦

న హి దేహభృతా శక్యం త్యక్తుం కర్మాణ్యశేషతః,
యస్తు కర్మఫలత్యాగీ స త్యాగీ త్యభిధీయతే. ౧౧

కవ్వడీ! దేహధారికి ♦ కర్మములను
సాంగముగ త్యజియింపఁగ ♦ సాధ్యమగునె?
కానఁ గర్మఫలత్యాగి ♦ యైనవాఁడె
త్యాగి యంచు వచింపఁగా ♦ నర్హుఁ డగును. ౧౧

అనిష్ట మిష్టం మిశ్రం చ త్రివిధం కర్మణః ఫలమ్,
భవత్యత్యాగినాం ప్రేత్య న తు సన్న్యాసినాం క్వచిత్. ౧౨

ఇష్టము, నయిష్టమును, మిశ్ర♦ మిట్టిమూఁడు
విధములగు కర్మఫలముల ♦ విడనివార
లనుభవింతురు వీని జ♦న్మాంతరమున;
ననుభవింపఁగఁబోడు స♦న్న్యాసి యెపుడు. ౧౨

పంచైతాని మహాబాహో కారణాని నిబోధ మే,
సాంఖ్యే కృతాంతే ప్రోక్తాని సిద్ధయే సర్వకర్మణామ్. ౧౩

సాంఖ్యసిద్ధాంతమందున సవ్యసాచి!
సర్వకర్మసంసిద్ధికై నిర్వచింపఁ
బడినయట్టి యీ కారణపంచకమును
వినుమ! తెలియంగఁజేతు సవిస్తరముగ. ౧౩

అధిష్ఠానం తథా కర్తా కరణం చ పృథగ్విధమ్,
వివిధా చ పృథక్చేష్టా దైవం చైవాత్ర పంచమమ్. ౧౪

అనఘ! కుంతీకుమార! కాయమును, గర్త,
మఱియు నానావిధంబులౌ కరణములును,
నఖిలచేష్టలు, దైవంబు ననఁగ నయిదు
కారణమ్ము లటంచుఁ బల్కంగఁబడియె. ౧౪

శరీరవాఙ్మనోభిర్యత్కర్మ ప్రారభతే నరః,
న్యాయ్యం వా విపరీతం వా పంచైతే తస్య హేతవః. ౧౫

మనసుచేతను, వాక్కుచే, దనువుచేత,
నరుఁడు న్యాయంబె యైన, యన్యాయమైన,
నాచరింపఁగఁబూను కర్మాళికెల్ల
నరయఁగా కారణంబు లీయయిదె సుమ్మి. ౧౫

తత్రైవం సతి కర్తారమాత్మానం కేవలం తు యః,
పశ్య త్యకృతబుద్ధిత్వా న్న స పశ్యతి దుర్మతిః. ౧౬

కారణం బిట్టు లుండఁగాఁ, ♦ గ ర్తగాఁగ
నెవఁడు తను దానె కేవల ♦ మెంచుకొనునో?
యట్టిదుర్మతి సంస్కార ♦ మందకునికి
గాంచలేడు, యథార్థమా ♦ క ర్త నెపుడు. ౧౬

యస్య నాహంకృతో భావో బుద్ధిర్యస్య న లిప్యతే,
హత్వాపి స ఇమాన్ లోకాన్ న హంతి న నిబధ్యతే. ౧౭

ఎవని కే నను భావ మొ♦క్కింత లేదొ,
యెవనిబుద్ధి లి ప్తముగా దొ♦కించు కేని,
వాఁడు, చంపియుఁ, జంపిన♦వాఁడు గాడు
ఈజనమ్ముల; బద్ధుండు ♦ నెపుడు గాడు. ౧౭

జ్ఞానం జ్ఞేయం పరిజ్ఞాతా త్రివిధా కర్మచోదనా,
కరణం కర్మ క ర్తేతి త్రివిధః కర్మసంగ్రహః. ౧౮

జ్ఞానమని, జ్ఞేయమని, పరి♦జ్ఞాత మనియుఁ,
ద్రివిధముల నొప్పు, కర్మోప♦దేశ మనఘ!
కరణమని, కర్మమనియును ♦ గ ర్త యనియుఁ,
గర్మసంగ్రహ మీమూఁడు♦గతులఁ దనరు. ౧౮

జ్ఞానం కర్మ చ కర్తా చ త్రిధైవ గుణభేదతః,
ప్రోచ్యతే గుణసంఖ్యానే యథావచ్ఛృణు తాన్యపి. ౧౯

కాపిలాదిశాస్త్రములఁ బ•ల్కఁబడియెఁ
గవ్వడీ! కర్తయును, జ్ఞాన•కర్మములును,
దనరు గుణభేదముల త్రివి•ధములటంచుఁ
గాన, విను! వానిని యథాప్ర•కారముగను. ౧౯

సర్వభూతేషు యేనైకం భావ మవ్యయ మీక్షతే,
అవిభక్తం విభక్తేషు తద్జ్ఞానం విద్ధి సాత్త్వికమ్. ౨౦

సర్వభూతంబులందున • సవ్యసాచి!
యవ్యయ మఖండ మేకమై • యలరుచుండు,
నాపరబ్రహ్మమును గాంచు•నట్టిజ్ఞాన
మరయ, సాత్త్వికమని బుధు • లాడుచుండ్రు. ౨౦

పృథక్త్వేన తు యద్ జ్ఞానం నానాభావాన్ పృథగ్విధాన్,
వేత్తి సర్వేషు భూతేషు తద్జ్ఞానం విద్ధి రాజసమ్. ౨౧

వివిధభూతములును బృథ•గ్విధములగుచుఁ
బరగు నంచును, భేదభా•వమ్ముచేతఁ
దెలిసికొనునట్టి జ్ఞానమే, • తెలిసికొనుమ!
సవ్యసాచిరో! రాజస•జ్ఞానమంచు. ౨౧

యత్తు కృత్స్నవదేకస్మిన్కార్యే స క్తమహైతుకమ్,
అతత్త్వార్థవ దల్పం చ తత్తామస ముదాహృతమ్. ౨౨

ఏక కార్యమ్మునందున • నెసఁగుచుండి,
యఖిలసంస్థితముం బోలె • నలరుచుండు,
నల్పము, నహైతుకము, నత • త్త్వార్థమైన
జ్ఞానమే, ఫల్గునా! తామ • సం బనంగ. ౨౨

నియతం సంగరహిత మరాగద్వేషతః కృతమ్,
అఫలప్రేప్సునా కర్మ యత్తత్సాత్త్విక ముచ్యతే. ౨౩

కర్మ మెయ్యది ద్వేషరా • గములు లేక
పూని, ఫలకాంక్ష నొందని • వానిచేత
సంగరహితమ్ము, నియతమై • సలుపఁబడెడు
నట్టికర్మమె, సాత్త్విక • మనఁ జెలంగు. ౨౩

యత్తు కామేప్సునా కర్మ సాహంకారేణ వా పునః,
క్రియతే బహుళాయాసం తద్రాజసముదాహృతమ్. ౨౪

ఎల్లకోర్కెల నందఁగా • నిచ్ఛగించి,
కడు నహంకారయుక్తుఁడౌ • కర్తచేత
నాచరింపఁగఁబడెడు మ • హాప్రయాస
మైన కర్మమె, రాజసం • బండ్రు బుధులు. ౨౪

అనుబంధం క్షయం హింసా మనపేక్ష్య చ పౌరుషమ్,
మోహాదారభ్యతే కర్మ తత్తామస ముదాహృతమ్. ౨౫

పౌరుషంబును, హింసానుబంధములను,
క్షయము, నెంచక మదిని, యజ్ఞానమునను
నలుపఁగాఁబడు కర్మంబె సవ్యసాచి!
తామసం బని వచియింతు రి ధర్మవిదులు. ౨౫

ముక్తసంగోఽనహంవాదీ ధృత్యుత్సాహసమన్వితః,
సిద్ధ్యసిద్ధ్యో ర్నిర్వికారః కర్తా సాత్త్విక ఉచ్యతే. ౨౬

పాండుపుత్త్రి! యహంకారవర్జితుండు,
సంగరహితుండు, ధృతిసముత్సాహయుతుఁడు,
సిద్ధ్యసిద్ధుల వికృతినిఁ జెందనట్టి
కర్తయే, సాత్త్వికుం డనఁగాఁ జెలంగు. ౨౬

రాగీ కర్మఫలప్రేప్సు ర్లుబ్ధో హింసాత్మకోఽశుచిః,
హర్ష శోకాన్వితః కర్తా రాజసః పరికీర్తితః. ౨౭

హర్ష శోకాన్వితుండును, నధికలోభి,
యన్యహింసాత్మకుండు, ఫలాభిలాషి,
యత్యనాచారవంతుండు, సానురాగి
యైన కర్తయె, రాజసుఁడనఁ దనర్చు. ౨౭

అయుక్తః ప్రాకృతః స్తబ్ధ శ్శఠో నైకృతికో౽లసః,
విషాదీ దీర్ఘసూత్రీ చ కర్తా తామస ఉచ్యతే. ౨౮

పార్థ! దుఃఖి, యయుక్తుండు, ♦ ప్రాకృతుండు,
నిందకుఁడు, మోసగాఁడును ♦ మందమతియు,
స్తబ్ధుఁడును, దీర్ఘసూత్రియై ♦ తనరునట్టి
కర్తయే, తామసుం డనఁ♦గాఁ జెలంగు. ౨౮

బుద్ధే ర్భేదం ధృతే శ్చైవ గుణత స్త్రివిధం శృణు,
ప్రోచ్యమాన మశేషేణ పృథక్త్వేన ధనఞ్జయ! ౨౯

ఇంద్రనందన! బుద్ధియు ♦ ధృతియుఁగూడ
త్రిగుణభేదమ్ముచేతను ♦ ద్రివిధములుగఁ
జెప్పఁగాఁబడె; దాని ని♦శ్శేషముగను
వినుమ! తెల్పెద నీవు స♦విస్తరముగ. ౨౯

ప్రవృత్తిం చ నివృత్తిం చ కార్యాకార్యే భయాభయే,
బన్ధం మోక్షం చ యా వేత్తి బుద్ధిస్సా పార్థ! సాత్త్వికీ. 30

కార్యమన నిద్ది, మఱియు న♦కార్య మిద్ది,
బంధమోక్షము లివి, భయా♦భయము లివియు;
ఇయ్యది ప్రవృత్తినాఁగను, ♦ నిది నివృత్తి
యని; తెలియు బుద్ధి సాత్త్విక♦ మనఁగఁ బరగు. 30

యయా ధర్మ మధర్మం చ కార్యం చాకార్యమేవ చ,
అయథావ త్ప్రజానాతి బుద్ధి స్సా పార్థ! రాజసీ. ౩౧

ధర్మము, నధర్మమును, సల్పఁ దగినదాని,
సలుపఁగా రానిదాని, నిశ్చయముగాను
నెఱుఁగఁజాలదో యేబుద్ధి యించుకేని,
నదియె రాజసమంచు బుధానుమతము. ౩౧

అధర్మం ధర్మమితి యా మన్యతే తమసావృతా,
సర్వార్థాన్ విపరీతాంశ్చ బుద్ధి స్సా పార్థ! తామసీ. ౩౨

కవ్వడి! తమమ్ముచేతను గప్పఁబడియు
నవని, విపరీతముగను సర్వార్థములను,
ధర్మము నధర్మమట్టులఁ దలఁచుచుండు
నట్టిబుద్ధియె, తామసంబనఁ దనర్చు. ౩౨

ధృత్యా యయా ధారయతే మనః ప్రాణేన్ద్రియక్రియాః,
యోగేనావ్యభిచారిణ్యా ధృతి స్సా పార్థ! సాత్త్వికీ. ౩౩

కట్టి! నిశ్చల మైన యోగమ్ముచేతఁ
బూని, యఖిలేంద్రియప్రాణమానసక్రి
యాదికము నియమించునో; యట్టిధృతియె,
సాత్త్వికం బనఁ బరగు నిస్సంశయముగ. ౩౩

యయా తు ధర్మకామార్థాన్ ధృత్యా ధారయతేఽర్జున,
ప్రసంగేన ఫలాకాఙ్క్షీ ధృతి స్సా పార్థ! రాజసీ. 34

ఫల్గునా! కాంక్షఁ జేసియు ♦ ఫలచయమ్మ,
నధికమౌ సక్తిఁ గామధ♦ర్మార్థములను,
నెట్టిధైర్యంబుచే ధరి♦యించుచుండు
నట్టిధైర్యంబె, రాజసం♦బని తలంపు. 34

యయా స్వప్నం భయం శోకం విషాదం మదమేవ చ,
న విముంచతి దుర్మేధా ధృతి స్సా పార్థ! తామసీ. 35

ఆర్యవినుత! దుర్మేధసుఁ ♦ డైనవాఁడు
భయమున, విషాదమున, మద♦స్వప్నములను,
విపులదుఃఖమ్ముచేతను ♦ విడువఁబడఁడొ;
వానిధృతి, తామసం బని ♦ ప్రాజ్ఞమతము. 35

సుఖం త్విదానీం త్రివిధం శృణు మే భరతర్షభ!
అభ్యాసా ద్రమతే యత్ర దుఃఖాన్తం చ నిగచ్ఛతి. 36

గుణసంబంధముననను, సుఖ
మును, భేదమ్మును వహించె ♦ మూఁడు తెఱంగుల్
వినుపింతు నశేషమ్ముగ
విను! మయ్యది, శ్రద్ధతో వి♦వేకధురీణా! 36

యత్తదగ్రే విషమివ పరిణామేఽమృతోపమమ్,
తత్సుఖం సాత్త్వికం ప్రోక్త మాత్మబుద్ధిప్రసాదజమ్. 38

ఏసుఖ మభ్యసించి రమియించునో; దుఃఖమ్ములెల్ల వీడునో,
యేసుఖ మాది ఘోరవిషనృత్తిఁ దనర్చు, సుధోపమంబునై
యేసుఖ మంతమం దెసఁగు; నేసుఖ మాత్మమనఃప్రసాదజం,
బాసుఖమున్ వచించిరి, యథార్థముసాత్త్వికమంచుధీనిధుల్. 

విషయేన్ద్రియసంయోగాద్యత్తదగ్రేఽమృతోపమమ్,
పరిణామే విష మివ తత్సుఖం రాజసం స్మృతమ్. 39

కవ్వడీ! విషయేన్ద్రియకలితమగుచు
నమృతతుల్యంబునై యొప్పి యాది; నెద్ది
యంత్యమందు విషోపమ మై తనర్చు
నద్దియే, రాజససుఖం బటంచు నెఱుఁగు! 39

యదగ్రే చానుబన్ధే చ సుఖం మోహన మాత్మనః,
నిద్రాలస్యప్రమాదోత్థం తత్తామస ముదాహృతమ్. 39

పార్థ! యేసుఖ మగ్రానుబంధములను
దనకు మోహనకరమొ, నిద్రాప్రమాద
మాంద్యసంభవమైన యా నింద్యసుఖమె,
తామసం బని పల్కిరి తత్త్వవిదులు. 39

న తదస్తి పృథివ్యాం వా దివి దేవేషు వా పునః,
సత్త్వం ప్రకృతిజైర్ముక్తం యదేభిస్స్యాత్త్రిభిర్గుణైః. ౪౦

అమరలోకంబునం దైన, ♦ నవనినైన,
పాండునందన! ప్రకృతిసం♦భవములైన
మూఁడుగుణములచేత వి♦ముక్తిఁ గనిన
యట్టిప్రాణియె లేదు య♦థార్థముగను. ౪౦

బ్రాహ్మణక్షత్త్రియవిశాం శూద్రాణాం చ పరంతప!
కర్మాణి ప్రవిభక్తాని స్వభావప్రభవైర్గుణైః. ౪౧

బ్రాహ్మణులకును, రాజన్య♦వైశ్యులకును,
గవ్వడీ! శూద్రులకుఁ గూడ, ♦ కర్మములును
వారివారి స్వభావోద్భ♦వంబులైన
గుణములనుబట్టియే, విభ♦జనమునొందె. ౪౧

శమో దమస్తపశ్శౌచం క్షాన్తిరార్జవమేవ చ,
జ్ఞానం విజ్ఞానమాస్తిక్యం బ్రాహ్మం కర్మ స్వభావజమ్. ౪౨

శమము, దమమును, జ్ఞానవి♦జ్ఞానములును,
నార్జవమ్మును, శుచిత్వమ్ము, ♦ నాస్తికతయు,
క్షమయును, దపమ్మునను నిట్టి ♦ కర్మలెల్లఁ
బార్థ! బ్రాహ్మస్వభావసం♦భవము లగును. ౪౨

శౌర్యం తేజో ధృతిర్దాక్ష్యం యుద్ధే చాప్యపలాయనమ్,
దాన మీశ్వరభావశ్చ క్షాత్త్రం కర్మ స్వభావజమ్. ౪౩

దాన మీశ్వరభావమ్ము, • దక్షతయును,
ధీరతయును, తేజంబును, • శూరతయును,
యుద్ధమందుఁ బలాయన • మొందకుంట,
క్షత్త్రి! క్షాత్త్రస్వభావజ•కర్మ లివియ. ౪౩

కృషిగౌరక్ష్యవాణిజ్యం వైశ్యం కర్మ స్వభావజమ్,
పరిచర్యాత్మకం కర్మ శూద్రస్యాపి స్వభావజమ్. ౪౪

పొలము దున్నుట, గోకుల•పోషణంబు,
వర్తకమ్మును, వైశ్యస్వ•భావజమ్ము.
అరయఁ, బరిచర్యరూపక•మైన కర్మ
భారతాన్వయ! శూద్రస్వ•భావజమ్ము. ౪౪

స్వే స్వే కర్మ ణ్యభిరత స్సంసిద్ధిం లభతే నరః,
స్వకర్మనిరత స్సిద్ధిం యథా విన్దతి తచ్ఛృణు. ౪౫

మానవుఁడు, వానివాని క•ర్మంబునందు
నభిరతుం డయి; సంసిద్ధి • నందుచుండుఁ,
గాంచు నేవిధి సిద్ధి స్వ•కర్మపరుఁడు?
అద్ది వచియింతు నీ కిపు • డాలకింపు! ౪౫

యతః ప్రవృత్తి ర్భూతానాం యేన సర్వ మిదం తతమ్,
స్వకర్మణా త మభ్యర్చ్య సిద్ధిం విన్దతి మానవః. ౪౬

ఎవనిచేత నీభూతప్ర॰వృత్తి గలుగు,
నీసమస్తంబు వ్యాప్తమౌ ॰ నెవనిచేత,
వానిని, స్వకర్మములచేత ॰ మానవుండు
పూజ లొనరించి సిద్ధినిఁ ॰ బొందుచుండు. ౪౬

శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్,
స్వభావనియతం కర్మ కుర్వ న్నాఽఽప్నోతి కిల్బిషమ్. ౪౭

విగుణమైన స్వధర్మమ్ము; ॰ విశ్రుతముగఁ
జేయు పరధర్మమునకంటె ॰ శ్రేష్ఠ మగును;
కవ్వడి! స్వభావనియతమౌ ॰ కర్మములను
జేయు నాతఁడు పాపంబుఁ ॰ జెందఁబోడు. ౪౭

సహజం కర్మ కౌన్తేయ! సదోషమపి న త్యజేత్,
సర్వారమ్భా హి దోషేణ ధూమేనాగ్నిరివావృతాః. ౪౮

ఎన్ని దోషంబులం గూడి॰యున్నఁ గాని
సహజకర్మంబు విడువఁగా ॰ జనదు! చనదు!
కప్పఁబడియుండు పొగచేత ॰ ని ప్పదెట్టు
లఖిలకర్మంబు లట్లె దో॰షావృతములు. ౪౮

అసక్తబుద్ధి స్సర్వత్ర జితాత్మా విగతస్పృహః,
నైష్కర్మ్యసిద్ధిం పరమాం సన్న్యాసేనాధిగచ్ఛతి. ౪౯

అంతట నసక్తబుద్ధియై • యలరువాఁడు,
నాశలను విడువాఁడు, జిత • తాత్మకుండు,
సన్న్యసించి కర్మఫలాళి • సవ్యసాచి!
పరమనైష్కర్మ్యసంసిద్ధిఁ • బడయఁగలఁడు. ౪౯

సిద్ధిం ప్రాప్తో యథా బ్రహ్మ తథాఽఽప్నోతి నిబోధ మే,
సమాసేనైవ కౌన్తేయ! నిష్ఠా జ్ఞానస్య యా పరా. ౫౦

పాండునందన! సిద్ధినిఁ • బడయునతఁడు
బ్రహ్మమునుఁ బొందు నెటులఁ, ద • త్పరమ మైన
జ్ఞాననిష్ఠనుగూర్చియు • సంగ్రహముగ
వినుమ! శ్రద్ధాన్వితుండవై • వినుచువాఁడ. ౫౦

బుద్ధ్యా విశుద్ధయా యుక్తో ధృత్యాత్మానం నియమ్య చ,
శబ్దాదీ న్విషయాం స్త్యక్త్వా రాగద్వేషౌ వ్యుదస్య చ. ౫౧
వివిక్తసేవీ లఘ్వాశీ యతవాక్కాయమానసః,
ధ్యానయోగపరో నిత్యం వైరాగ్యం సముపాశ్రితః. ౫౨
అహఙ్కారం బలం దర్పం కామం క్రోధం పరిగ్రహం,
విముచ్య నిర్మమశ్శాన్తో బ్రహ్మభూయాయ కల్పతే. ౫౩

తతవినిర్మలబుద్ధిఁ • దనరుచు, నాత్మను
ధైర్యంబుచే నియ • తం బొనర్చి,

శబ్దాదివిషయముల్ • సంత్యక్త మొనరించి,
ద్వేషంబు, రాగంబు • వెడలనడచి,
యల్పాశియై, రహఃస్యపరిదేశస్థుఁడై,
వాక్కాయమనముల • వశముఁజేసి,
యమలమౌ ధ్యానయోగాసక్తుఁడై, యన
యంబు వైరాగ్యంబు • నాశ్రయించి,
కామము, పరిగ్రహం బహంకారములును,
బలము, దర్పంబు, క్రోధంబుఁ • బాఱఁదోలి,
నిర్మమతఁ గల్గి, శాంతుఁడై • నెగడువాఁడు;
నర్హుఁ డగు బ్రహ్మభావంబు • నందుటకును. ౫౧

బ్రహ్మభూతః ప్రసన్నాత్మా న శోచతి న కాఙ్క్షతి,
సమస్సర్వేషు భూతేషు మద్భక్తిం లభతే పరామ్. ౫౪

బ్రహ్మభూతుఁ డచ్ఛాత్ముఁడై • వరలువాఁడు
కాంక్ష సేయఁడు, దుఃఖమ్ముఁ • గాంచఁబోఁడు,
సర్వభూతంబులందున • సముఁడు నగుచుఁ,
బరమమై మించు మద్భక్తిఁ • బడయుచుండు. ౫౪

భక్త్యా మామభిజానాతి యావాన్ యశ్చాస్మి తత్త్వతః,
తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే తదనన్తరమ్. ౫౫

సర్వకర్మాణ్యపి సదా కుర్వాణో మద్వ్యపాశ్రయః,
మత్ప్రసాదాదవాప్నోతి శాశ్వతం పద మవ్యయమ్. ౫౬

ఎంతవాఁడనో; మఱియు నే ♦ నెట్టివాఁడ
నగుదునో; భక్తి నెఱిఁగి య♦థార్థముగను
పార్థ! పిమ్మట నాయందె ♦ పరగుచుండు
సకలకృతకర్ముఁడైన మ♦త్సంశ్రితుండు
పడయు మత్కృప శాశ్వతా♦వ్యయపదంబు. ౫౩

చేతసా సర్వకర్మాణి మయి సన్న్యస్య మత్పరః,
బుద్ధియోగ ముపాశ్రిత్య మచ్చిత్త స్సతతం భవ. ౫౭

విజయ! నీ వింక మిగుల వి♦వేకమునను,
సర్వకర్మాళి నాయందె ♦ సన్న్యసించి;
గతిగ నను నెంచి, బుద్ధియో♦గమ్ము నాశ్ర
యించి, చిత్తంబు నాయందె ♦ యుంచు మెపుడు. ౫౮

మచ్చిత్త స్సర్వదుర్గాణి మత్ప్రసాదా త్తరిష్యసి,
అథచే త్త్వమహఙ్కారా న్న శ్రోష్యసి వినఙ్క్ష్యసి. ౫౮

చిత్త మెుంచియు నాయందుఁ ♦ జెలఁగునీవు
కర్ణి! దాఁటెదు నాయను గ్రహముచేత
వివిధదుర్గమముల నెల్ల, ♦ వినవయేని
గర్వమున నాదుపల్కులు ♦ గలుగు కీడు. ౫౫

యద్యహఙ్కార మాశ్రిత్య న యోత్స్య ఇతి మన్యసే,
మిథ్యైష వ్యవసాయ స్తే ప్రకృతిస్త్వాం నియోక్ష్యతి. ౫౯

ఆశ్రయించి యహంకార • మాహవం బొ
నర్పఁబో నని, యూహ యొ•నర్చెదేని;
వ్యర్థ మగు నిట్టి నీదుప్ర•యత్న మెల్ల
నిన్ను నియమించు నిక్కంబు • నీదుప్రకృతి. ౫౯

స్వభావజేన కౌన్తేయ! నిబద్ధ స్స్వేన కర్మణా,
కర్తుం నేచ్ఛసి యన్మోహాత్కరిష్యస్యవశోఽపి తత్. ౬౦

భరతవంశప్రదీప! స్వ•భావజన్య
మైన నిజకర్మబద్ధుండ•వగుచు; నెద్ది
చేయఁగా నిచ్ఛగింపవో; • చేయఁగలవు
అద్ది యవశుండ వగుచు మో•హమున నీవు. ౬౦

ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేఽర్జున! తిష్ఠతి,
భ్రామయన్ సర్వభూతాని యన్త్రారూఢాని మాయయా.

యంత్రసంరూఢ మైనట్టి • యఖిలభూత
మండలి భ్రమింపఁజేయుచు • మాయచేత,
నీశ్వరుం డెల్లప్రాణుల•హృదయములను
బరగుచున్నాడు; నిక్క మో•పాండుతనయ! ౬౧

తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత!
తత్ప్రసాదా త్పరాం శాన్తిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్.

భరతవంశోత్తమా! సర్వ • భావములను
బొందు మాతనిశరణంబుఁ, • బూర్ణమైన
యాతనియనుగ్రహమునఁ బ్రా • జ్యమ్ము నైన
శాంతియును, శాశ్వతంబగు • స్థాన మబ్బు. ౬౨

ఇతి తే జ్ఞాన మాఖ్యాతం గుహ్యా ద్గుహ్యతరం మయా,
విమృశ్యైత దశేషేణ యథేచ్ఛసి తథా కురు. ౬౩

గోప్యములయందు మిక్కిలి • గోప్యమైన
జ్ఞానశాస్త్రమ్ము వచియించి • తేను నీకు,
నింక దీని విమర్శించి • యెల్లగతులఁ
బార్థ! చేయుము! నీయిచ్ఛ • వచ్చినట్లు. ౬౦

సర్వగుహ్యతమం భూయ శ్శృణు మే పరమం వచః,
ఇష్టోఽసి మే దృఢమితి తతో వక్ష్యామి తే హితమ్. ౬౪

నాకు నిష్టుండ వగుటచే • నీకు నేను
హితము వాంఛించియును వచి • యింతు నింక
గోప్యములకెల్ల గోప్యంబు • గురుతమంబు
నాలకింపుము! దీని న • త్యంతభక్తి. ౬౧

మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు,
మామేవైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోఽసి మే. ౬౫

నరవరా! భక్తుఁడవు గమ్ము! • నన్నుఁగూర్చి
నతు లొనర్పుము! సేయుమా! • నాదుపూజ?
చెందెదవు నన్ను మనము నా•యందు నిల్పు!
పార్థ! ప్రియుఁడవు నిక్కంబు • ప్రతినఁజేతు. ౬౨

సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ,
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః. ౬౬

సకలధర్మమ్ములను వీడి, • సవ్యసాచి!
పొందుమా! నన్ను శరణంబు • ముఖ్యముగను
నిన్నఖిలపాపములనుండి• నే విముక్తి
నొందఁజేసెద, దుఃఖ మిఁక• నొందఁదగదు. ౬౩

ఇదం తే నాఽతపస్కాయ నాఽభక్తాయ కదాచన,
న చాఽశుశ్రూషవే వాచ్యం నచ మాం యోఽభ్యసూయతి.

పార్థ! యశ్రద్ధునకును, ద•పంబులేని
వానికిని, భక్తిలేనట్టి• వాని కెపుడు
నాయెడ నసూయఁ బొందెడు• నరున కిద్ది
నలుపరా దుపదేశ మే •సమయమందు ౬౪

య ఇదం పరమం గుహ్యం మద్భక్తే ష్వభిధాస్యతి,
భక్తిం మయి పరాం కృత్వా మామేవైష్యత్యసంశయః. ౬౮

అర్జునా! పరమంబు గుహ్యంబు నగుచుఁ
బరగు నిద్దాని నెవఁడు మద్భక్తులకును
దెలుపు; నాయందు పరభక్తిఁ గలిగియుండు,
సందియములేదతఁడు నన్నుఁ జెందగలఁడు ౬౫

న చ తస్మా న్మనుష్యేషు కశ్చిన్మే ప్రియకృత్తమః,
భవితా న చ మే తస్మా దన్యః ప్రియతరో భువి. ౬౯

ఆవిధంబున వచియించు నతనికంటెఁ
బృథివియందున నా కతిప్రియతముండు
లేడు; నా కొక్కఁడేనియుఁ గాడు నిజము
అన్యుఁ డెవ్వాఁడు ప్రియుఁడు నా కతనికంటె. ౬౬

అధ్యేష్యతే చ య ఇమం ధర్మ్యం సంవాదమావయోః,
జ్ఞానయజ్ఞేన తేనాఽహ మిష్టస్స్యామితి మే మతిః. ౭౦

పార్థ! యీ మన ధర్మ్యసంవాద మెవఁడు
సతత మధ్యయనంబును సలుపు, నొకొ
జ్ఞానయజ్ఞమ్ముచేతను వానివలన
నర్చితుఁడ నౌదు నంచు నా యభిమతంబు. ౬౭

శ్రద్ధావా ననసూయశ్చ శృణుయా దపి యో నరః,
సోఽపి ము క్త శ్శుభాన్లోకా న్ప్రాప్నుయాత్పుణ్యకర్మణామ్.

శ్రద్ధఁ గల్గి, యసూయను ♦ జాఱవిడచి,
యేనరుం డాలకించునో ♦ యిద్ది; యతఁడు
ము క్తుఁడై, యెల్ల శుభకర్మ♦ముల నొనర్చి
పొందు వారలలోకముల్ ♦ బొందుచుండు. ౬౮

కచ్చి దేతచ్ఛ్రుతం పార్థ! త్వయై కాగ్రేణ చేతసా,
కచ్చి దజ్ఞానసమ్మోహః ప్రణష్టస్తే ధనఞ్జయ. ౭౨

శ్వేతవాహన ! యేకాగ్ర♦చిత్తమునను
ఆలకించితె ? దీని సాం♦గమ్ముగాఁగ
భూరితరభవదజ్ఞాన♦మోహమెల్ల
నిపుడు నశియించెనా ? వచి♦యింపుమయ్య ! ౬౯

నష్టో మోహస్స్మృతి ర్లబ్ధా త్వత్ప్రసాదా న్మయాఽచ్యుత,
స్థితోఽస్మి గతసన్దేహః కరిష్యే వచనం తవ. 23

అచ్యుతా ! మోహమంతయు ♦ నంతరించెఁ
గాంచితిని స్మృతి, నీయను♦గ్రహమువలన;
నాదుసందేహమెల్ల వి♦నాశమందె.
నాచరించెద నీదువా♦క్యానుసరణి. 20

ఇత్యహం వాసుదేవస్య పార్థస్య చ మహాత్మనః,
సంవాద మిమ మశ్రౌష మద్భుతం రోమహర్షణమ్. ౭౪

అంబికాపుత్ర! యిట్లు మ•హాత్ము లైన
సవ్యసాచియుఁ గృష్ణుండు • సల్పినట్టి
యద్భుతము రోమహర్షణ•మైన చెలంగు
నీమహోత్కృష్టసంవాద • మేను వింటి. ౭౪

వ్యాసప్రసాదా చ్ఛ్రుతవా నేతద్గుహ్యతమం పరమ్,
యోగం యోగేశ్వరాత్కృష్ణా త్సాక్షాత్కథయతస్స్వయమ్.

యోగ్యమును, గుహ్యమైన యీ•యోగ మేను
పార్థివోత్తమ! స్వయముగాఁ• బల్కుచున్న
పరమయోగేశ్వరుం డగు • వాసుదేవు
వలన వింటిని వ్యాసుని•భవ్యకృపను. ౭౫

రాజన్ సంస్మృత్య సంస్మృత్య సంవాదమిమమద్భుతమ్,
కేశవార్జునయోః పుణ్యం హృష్యామి చ ముహుర్ముహుః.

అద్భుతంబును నధికపు•ణ్యంబు నైన
యచ్యుతార్జునసంవాద • మాంబికేయ!
స్వాంతమున సంస్మరించియు • సంస్మరించి
యార! పలుమాఱు సంతస•మందుచుంటి. 23

తచ్చ సంస్మృత్య సంస్మృత్య రూప మత్యద్భుతం హరేః,
విస్మయో మే మహా౯ రాజ౯! హృష్యామి చ పునః పునః. ౭౭

వింతఁ గొలిపెడు కృష్ణు త◆ద్విశ్వరూప
మంబికాపుత్రి! స్మరియింప ◆ నంతకంత
కురుతరాశ్చర్య మొప్పార ◆ మఱల మఱల
సంతసం బందుచుంటి మ◆త్స్వాంతమందు. ౭౮

యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః,
తత్ర శ్రీ ర్విజయో భూతి ర్ధ్రువా నీతి ర్మతి ర్మమ. ౭౮

ఎచట, యోగేశ్వరుండు శ్రీ◆కృష్ణుఁ డుండు;
నుంకు నెచ్చోటను ధనుర్ధ◆రుండు క్రీడి;
యచట, శ్రీయును, భూతి, జ◆యమ్ము, నీతి
యలరు నిక్కం బటంచు, నా◆యభిమతంబు. ౭౯

శతసాహస్రికముం, బవిత్రమును, వ్యా◆సప్రోక్తమై, మించుభా
రతసత్సంహిత భీష్మపర్వగతసా◆రబ్రహ్మవిద్యాత్మకా
యతత త్త్వప్రతిపాదకోపనిషదం◆బౌ యోగశాస్త్రైకసం
స్థితకృష్ణార్జునవాదరూపభగవ◆ద్గీతల్ పరిపూర్ణం బగు౯.

అనఘ! కృష్ణ! కురుక్షేత్ర • మందు నీవు
ఫల్గునున కభయంబిడి • పాడినట్టి
నిర్మలోత్కృష్టగీతల • నీదుకృపను
వ్రాసియు సమాప్తముగ నాంధ్ర • భాషయందు
నాంధ్రులపవిత్రహస్తమ్ము • లందు నిడితి.

క ల్యా ణ గీ తి

ఆంధ్రకవితాకుమారి! క • ల్యాణగీతి
భావతంత్రుల శ్రుతిఁజేసి • పాడుమమ్మ!
సంతతానందసౌఖ్యప్ర • శాంతవైభ
వాయురభివృద్ధు లలర మా • యాంధ్రులకును.

ఓం తత్సత్.

# తప్పొప్పుల పట్టిక

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 4 | 5 | నది | నవి |
| ,, | 10 | తెలుసు | తెలిసి |
| 8 | 16 | సిద్ధాంతం | వడలి |
| 6 | 5 | రామఁడా | యుక్తుఁడా |
| 27 | 16 | నిద్దినీవాశ్రియించితేని | దీని నాశ్రియించితవరేని |
| 60 | 5 | యో | జ్ఞాని |
| 61 | 3 | నిజ | యందు |
| 71 | 10 | నిఖిల | యెల్ల |
| 111 | 15 | నున్నవీ | నున్నదీ |
| 130 | 10 | వంద్య | నుత |
| 144 | 11 | రీత్యామె | రీత్యమై |
| 153 | 20 | ముఖ | భుజ |
| 157 | 11 | జేయు | జేతురు |
| ,, | ,, | సమాహిత | సునిహిత |